(Private Circultion only)

శ్రీః

యోనితన్త్రమ్

నామ

# త్రికోణతన్త్రమ్

వ్యాఖ్యాత : చింతగుంట సుబ్బారావు





ప్రకాశకులు

**రావి మోహనరావు,**

404, జంజనం కాంప్లెక్స్,

చీరాల - 523155

శ్రీః

యోనితన్త్రమ్ నామ

# త్రికోణతన్త్రమ్

తెలుగు వ్యాఖ్య : చింతగుంట సుబ్బారావు


ముద్రణ : ఆదిశంకరాచార్య జయన్తి, *20-4-2018*

ప్రతులు : *200*

పేజీలు : *108*

వెల రూ. : *60-00*



**RAVI MOHAN RAO,** M.Sc., M.A.,
Dandy House,
Flat No : 404, Janjanam Complex,
Opp. I Town Police Station,
CHIRALA-523 155, Prakasam Dist.
Cell : 9440115411


*D.T.P. by :-*
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : 9966156263

*Printed at -*
**Surya Printers,**
**Chirala.**

# శ్రీః

ఇక్కొళ గ్రంథమున కాలిడుటకు **'శాక్తానందతరంగిణి' 'మహానిర్వాణతంత్రము'** వంటి తంత్రశాస్త్రవిధిగ్రంథముల అధ్యయనము మిక్కిలి తోడ్పడును.

సమయాచారము – కౌలాచారము – వామాచారము లనే పదార్థములయెడ వాస్తవిక దృష్టి సారించదగును.

సృజన – ఒక అద్భుతమైన భగవత్క్రీడ **'రసో వై సః'**

శ్లో॥ **అక్షక్రీడనతత్పరా యది భవేస్సఖ్యాసమం ప్రేయసి!**
**ద్యూతం గుహ్యతమం పునస్త్రిజగతి శ్లాఘ్యం సమాకర్ణయ ।**
**క్రీడాసాధనమక్షషట్కమతమస్సాక్షీ తు సోత్కంఠతా**
**స్తోతవ్యా అబలాశ్చ యత్ర తదిదం మన్యే పరానందదమ్ ॥**

– భాగవతచంపూః 6–94

**'పుంభావమీదృశఫలం తదుపాసనస్య'**

వినమ్రతతో

**రామోరా**

# యోనితన్త్రమ్

విశ్వంలోని చరాచరాలన్నిటికి రూపధారణ ఉన్నది, దానితో గుణకర్మలున్నవి. వీని నన్నిటిని గుర్తించే నామం ఉన్నది. ఇట్లా రూపగుణకర్మనామాలతో కూడినదే విశ్వం. ఈ విశ్వానికొక జన్మదశ, వృద్ధిదశ, నాశదశ, మూడూ తప్పనివే. అయితే ఈ జన్మ ఎక్కడి నుండి? వృద్ధి యే దిశగా? నాశం ఎక్కడకు? ఈ ప్రశ్నలను విచారించిన పెద్దలు, విశ్వంలో నాశం అన్నది లేదనీ, స్థితి మార్పు మాత్రమే సత్యమనీ నిశ్చయించినారు. కాగా, ఉన్నదే మార్పు చెందుతూన్నది, ఆ మార్పే వృద్ధి అని తేలుతూన్నది. ఈ వృద్ధి ప్రక్రియకు ఆరంభం, ప్రవేశద్వారం, జననం కాగా, మార్పును సూచించే నిష్క్రమణద్వారం మరణం. ఈ జననమరణాల భౌతికసంకేతాలే **యోని, శ్మశానం** అనునవి. కనుక, తంత్రశాస్త్రంలో ఈ రెండూ సాధన నాశ్రయించినవారికి ప్రధాన సాధనాక్షేత్రాలవుతాయి. సాధనాచారాలు భయంకరమూ జుగుప్సావహమూ కావచ్చును, కాని, వానికి ఆధారభూతమైన తత్త్వాన్ని తప్పుబట్టలేము. ఆ విధంగా శక్తిసాధనలో ఒక భాగమైనది **యోనితంత్రం**. ఇది పార్వతీపరమేశ్వరుల సంవాదరూపమైన శాస్త్రము. శాస్త్రానికి ప్రాణం హేతుబద్ధత. ఆ హేతుబద్ధతను వివరించగల మహనీయులు నేడు అఋదుగా లభిస్తారు. ఆచరణాసక్తి లేకున్నాగాని, విషయపరిజ్ఞానంలో దోషం లేదు. అందుకే ఈ ప్రయత్నం.

శ్రీః

# శ్రీః
# ప్రథమోఽధ్యాయః

ఓం

**పరమదేవతాయై నమః । శ్రీగురవే నమః ॥**

**శ్లో॥ కైలాశశిఖరారూఢం దేవదేవం జగద్గురుమ్ ।**
**సదా స్మేరముఖీ దుర్గా పప్రచ్ఛ నగనన్దినీ ॥** 1

**ప్రతిపదార్థం :** సదా = ఎల్లప్పుడూ, స్మేరముఖీ = చిఱునవ్వు ముఖమునగల, దుర్గా = దుర్గయగు, నగనన్దినీ = హైమావతి, పార్వతి, కైలాశశిఖరారూఢమ్ = కైలాసపర్వతాగ్రాన నెలకొన్న, జగద్గురుమ్ = జగత్తునకు జ్ఞానమునిచ్చు, దేవదేవమ్ = దేవతారాధ్యుడైన దేవుడగు శివుని, పప్రచ్ఛ = అడిగెను.

**తాత్పర్యం :** కైలాసశిఖరవాసియైన జగద్గురుని దేవదేవుని ఎప్పుడూ నగుమోముగల హిమవత్పుత్రి దుర్గ ఈ విధంగా అడిగింది.

శివుడు జ్ఞానదాత కనుక జగద్గురువు. కైలాసశిఖరం వీని నెలవు. శివునితో కలిసియున్న పార్వతి ఆనందమూర్తియే. కనుకే హైమావతిగా హిమవంతునికి ఆనందదాయిని యైనది. నగుమోముతో విరాజిల్లుతూన్నది. భక్తసులభయైనది. ఆమె దుర్గ, చేరరానిది. *

**శ్రీదేవ్యువాచ । :** శ్రీదేవీ = మహాదేవుని ఇల్లాలు, ఉవాచ = ఇట్లన్నది.

**శ్లో॥ చతుఃషష్టి చ తన్త్రాణి కృతాని భవతా ప్రభో! ।**
**తేషాం మధ్యే ప్రధానాని వద మే కరుణానిధే! ॥** 2

**ప్రతిపదార్థం :** ప్రభో! = స్వామీ!, భవతా = తమచేత, చతుఃషష్టి = అరువదినాలుగు, తన్త్రాణి = తంత్రములు, కృతాని = చేయబడినవి, చ = మఱియు, తేషాం మధ్యే = వానిలో, ప్రధానాని = ముఖ్యమైన వానిని, కరుణానిధే! = దయాసముద్రా!, మే = నాకు వద = చెప్పుము.

**తాత్పర్యం :** స్వామీ! తమరు అరువదినాలుగు తన్త్రాలను నిర్మించినారు కదా, వానిలో ముఖ్యమైనవానిని దయతో నాకు చెప్పండి.

తంత్రమన్నది సాధనోపాయం. సాధించదలచినదానినిబట్టి తంత్రం మారుతూ ఉంటుంది. ఇట్లా మానవుడు సాధించదగిన లక్ష్యాలు, వాని మార్గాలూ అరువదినాలుగుగా గుర్తించబడినవి. కళలుగా ప్రసిద్ధమైనవి కూడా అరువదినాలుగే, ఈ కళలన్నీ సాధించ నెంచిన ఏకైకలక్ష్యం **పరమానందం**. ఈ ఆనందసాధనకు అవసరం శక్తి. ఆ శక్తి సాధనమార్గాలున్నూ అరువదినాలుగే. అయితే, ఈ కళారూపాలు, ప్రయోగమూ సాత్త్వికమైనవి. శక్తిసాధనమార్గాలు సాత్త్విక రాజసిక తామసికమైనవిగా ఉంటాయి. ఎక్కువ భాగం తాంత్రికప్రక్రియ అంతా తామసికంగానే ఉంటుంది. ✻

**శ్రీమహాదేవ ఉవాచ ।** – శ్రీమహాదేవు డిట్లనెను.

శ్లో॥ **శృణు పార్వతి! చార్వఙ్గి! హ్యస్తి గుహ్యతమం ప్రియే! ।**
**కోటివారం వారితాసి తథాపి శ్రోతుమిచ్ఛసి ॥** 3

శ్లో॥ **స్త్రీస్వభావాచ్చ చార్వఙ్గి! తథా మాం పరిపృచ్ఛసి ।**
**గోపనీయం ప్రయత్నేన త్వయ్యేవ విద్యతే చ తత్ ॥** 4

**ప్రతిపదార్థం :** చారు + అఙ్గి! = అందమైన రూపముగల, పార్వతి! = ఓ పార్వతీ!, ప్రియే! = ఓ ప్రియురాలా!, (తత్ = అది), గుహ్యతమమ్ = నిగూఢరహస్యము, అస్తి = అయియున్నది, కోటివారమ్ = అనేక పర్యాయములు, వారితా = నివారింపబడినదానవు, అసి = అగుచున్నావు, తథా + అపి = అట్లయినను, శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావు, స్త్రీస్వభావాత్ చ = స్త్రీకి సహజమైన లక్షణమువలననే, తథా = ఇట్లు, మామ్ = నన్ను, పరిపృచ్ఛసి = మరల మరల అడుగుచున్నావు, ప్రయత్నేన = ప్రయత్నముతో, గోపనీయమ్ = దాచదగినది, తత్ చ = ఆ దాచుటయును, త్వయి + ఏవ = నీయందే, విద్యతే = ఉన్నది, చారు+అఙ్గి = అందమైనదానా!, శృణు = వినుము.

**తాత్పర్యం :** అందమైన ప్రియురాలా పార్వతీ! నీవడిగిన విషయము అతిరహస్యమైనది. అనేకసార్లు నిన్నీ విషయమడుగవద్దని వారించినను, మరల మరల వినగోరి అడుగుట నీ స్త్రీస్వభావము సుమా! నీవు నాకు ప్రియమైనదానవు కనుక చెప్పుచున్నాను, వినుము. ఇది చాలా రహస్యముగ నుంచదగిన విషయము. నీవు నీ స్త్రీస్వభావముచే ఈ రహస్యమును బయలుపరచక, దాచియుంచవలెను. అది నీ శక్తికి మించిన పని కారాదు సుమా! ✻

శ్లో॥ **మన్త్రపీఠం యన్త్రపీఠం యోనిపీఠఞ్చ పార్వతి! ।**
**యోనిపీఠం ప్రధానం హి తవ స్నేహాత్ప్రకాశ్యతే ॥** 5

శ్లో॥ **హరిహరాద్యాశ్చ దేవాః సృష్టిస్థిత్యన్తకారకాః ।**
**సర్వే వై యోనిసమ్భూతాః శృణుష్వ నగనన్దిని! ॥** 6

**ప్రతిపదార్థం :** పార్వతి! = ఓ పార్వతీ!, మన్త్రపీఠమ్ = మంత్రపీఠము, యన్త్రపీఠమ్ = యంత్రపీఠము, యోనిపీఠమ్ = యోనిపీఠము, చ = కూడ, యోనిపీఠం హి = యోనిపీఠమే, తవ = నీయొక్క, స్నేహాత్ = సంయోగమువలన, ప్రధానమ్ = ముఖ్యముగా, ప్రకాశ్యతే = ప్రకాశింపజేయబడుచున్నది, హరి = విష్ణువు, హర = రుద్రుడు, ఆద్యాః = మొదలగు, దేవాః = దేవతలు, సృష్టి = లోకసృష్టికి, స్థితి = ఉనికికి, అన్త = నశింపునకు, కారకాః = కారణభూతులగు, సర్వే వై = అందఱును, నగనన్దిని! = హైమవతీ!, శృణుష్వ = వినుము, యోనిసంభూతాః = యోనినుండి పుట్టినవారే.

**తాత్పర్యం :** ఓ హైమవతీ! పార్వతీ! విను. మన్త్రపీఠము, యన్త్రపీఠము, యోనిపీఠము అనునవి మూడున్నవి. వీనిలో నీ సంయోగకారణాన యోనిపీఠమే ఇప్పుడు ప్రధానంగా వివరించబడుతూన్నది. సృష్టిస్థితిలయాలకు కారకులుగా చెప్పబడు బ్రహ్మ విష్ణు రుద్రులున్నూ, తదితర దేవగణాలున్నూ అందఱునూ యోనినుండి పుట్టినవారే.

పీఠం అంటే స్థానం, నెలవు. ఈ నెలవులు మూడు. మన్త్రం మొదటిది, యన్త్రం దాని తర్వాతిది, యోని చివరిదిగా క్రమం చెప్పబడింది. ఈ క్రమాన్ని పరిశీలిస్తే, శక్తిబీజం మొదట మంత్రరూపంతోను, తర్వాత యంత్రరూపంతోను, ఆపై యోనిరూపం గానూ పరిఢవిల్లినట్లు, అనగా బీజము మొలకెత్తి వృక్షమై మరల బీజస్థాయిని చేరుతూన్న క్రమంలో శక్తి బీజంకాగా ఆ సూక్ష్మం, మంత్రమనే స్థూలమనోరూపాన్నీ, యన్త్రమనే భౌతికస్థూలరూపాన్నీ సంతరించికొని, భౌతికవిశ్వసృష్టికి యోనిపీఠాన్ని యేర్పరించినదన్న భావం తోస్తుంది. ఆ యోనిపీఠమే శక్తిపీఠప్రాధాన్యంతో సృష్టిస్థితిలయాలకు మూలంకాగా, ఈ ప్రక్రియలకు అధిష్ఠానదేవతలు బ్రహ్మవిష్ణు రుద్రులయినారు. వారితో అన్యదేవతలు చేరి విశ్వాన్ని నియంత్రిస్తూన్నారని భావం. ఈ దేవతలు అందఱున్నూ ప్రాకృతిక గుణమూర్తులే. గుణప్రాథమ్యాలను బట్టి మూర్తి భేదాలు. గుణాలు సృష్టికి ఆద్యాప్రకృతి. ఇవి సమస్థితిలో ఉన్నప్పుడిది ప్రధానమనబడి, కార్యకారణభేదరూపంగా ప్రకృతి అనబడుతూ, పరస్పరవిరుద్ధధర్మాలతో ప్రకటరూపమై మాయగా తెలియబడే శక్తి యీ **యోనిపీఠాధిష్ఠాత్రి**. ఈ దేవత పార్వతియే. కనుక **తవ స్నేహాత్ ప్రకాశ్యతే** అని శివభగవానుడనుట. ఈమె సాత్త్వికస్థితిలో మాయగాను, తామసికస్థితిలో అవిద్యగానూ ప్రవర్తిల్లుతూంటుంది. *

**శ్లో॥ శక్తిమన్త్రముపాస్యైవ యది యోనిం న పూజయేత్ ।**
**తేషాం దీక్షాశ్చ మన్త్రాశ్చ నరకాయోపపద్యతే ॥ 7**

**శ్లో॥ అహం మృత్యుఞ్జయో దేవి! తవ యోనిప్రసాదతః ।**
**తవ యోనిం మహేశాని! భావయామి చాహర్నిశమ్ ।**
**పూజయామి సదా దుర్గే! హృత్పద్మే సురసున్దరి! ॥ 8**

**ప్రతిపదార్థం :** మహేశాని! దుర్గే! సురసున్దరి! = దివ్యసుందరివిన్నీ మహేశ్వరివిన్నీ అయిన ఓ దుర్గా!, తవ = నీయొక్క, యోనిప్రసాదతః = యోనిప్రసాదముగా, మృత్యుఞ్జయః అహమ్ = మృత్యుంజయుడనైన నేను, అహర్నిశమ్ = పవలు రాత్రులు, తవ = నీయొక్క, యోనిమ్ = యోనిని, భావయామి = ధ్యానించుచున్నాను, దేవి = ఓ దేవీ!, సదా = ఎల్లప్పుడు, హృత్పద్మే = హృదయపద్మంలో, పూజయామి = పూజించు చున్నాను; శక్తిమన్త్రమ్ = శక్తిమంత్రమును (లేదా) 'ఈం / శ్రీం / హ్రీం / పంచదశీ / షోడశీ / ద్వావింశత్యక్షరీ మహామంత్రము'), న ఉపాస్య ఏవ = ఉపాసించకయే, యది యోనిం పూజయేత్ = యోనిని ఒకవేళ పూజించినట్లయితే, తేషామ్ = వారియొక్క, దీక్షాః చ = దీక్షలున్నూ, మన్త్రాః చ = మంత్రములున్నూ, నరకాయ = నరకప్రాప్తికే, ఉపపద్యతే = మార్గములగును.

**తాత్పర్యం :** మహేశ్వరీ! దేవతాసుందరీ! దేవీ! దుర్గా!, నేను నీయోనిప్రసాదంగానే మృత్యుంజయుడనైనాను, నిత్యము నీయోనినే నా మనసులో ధ్యానిస్తూ, హృదయంలో పూజిస్తూంటాను. ఎవరైన శక్తిమన్త్రాన్ని ఉపాసించక యోనిపూజ చేసినచో, వారి దీక్షలూ మన్త్రాలూ అన్నీ నరకానికే దారితీస్తాయి. **అర్థాత్, శక్తిమంత్రోపాసన, యోనిపూజ విడదీయరాక కలిసియున్నప్పుడే సుగతి, లేనిచో దుర్గతి.**

శివుడు యోనిప్రసాదంవలన మృత్యుంజయుడైనాడనటంలో గ్రాహ్యాభావ మేమిటి? యోనిపీఠం అని ముందు చెప్పబడిన శక్తిప్రసాదంవలన అనుకుంటే, శివుని సర్వదా చైతన్యవంతుని చేసేది ఆ శక్తియే అన్నట్లవుతుంది. కనుక శివము సదాశివము కావలె నంటే శక్తి అనుగ్రహం కావలె. జీవుడైన శివుడు, యోనిప్రసాదంవలన, శవుడైకూడా మరల శివుడుగా జన్మిస్తూన్నాడు. అనగా తాను తానైయుండి జగత్పిత్రుత్వాన్ని సాధించటం యోనిప్రసాదం. మృతుడైన జీవుడు తనసంతానంలో జీవించటం యోని ప్రసాదంవలన. ఇది మానుషమృత్యుంజయత్వం. కనుకే శివుడు సదాశివుడు కావలెనంటే శక్తిని కూడి యుండవలసిందే. శక్త్యుపాసనతోకూడిన యోనిపూజ సమస్తసుఖామృతత్వ ప్రసాదినిగా స్థాపించబడి ప్రాధాన్యాన్ని వహిస్తూన్నది. ✻

శ్లో॥ **దివ్యభావో వీరభావో యస్య చిత్తే విరాజతే ।**
**అనాయాసేన దేవేశి! తస్య ముక్తిః కరే స్థితా ॥** 9

శ్లో॥ **శక్తిమన్త్రం పురస్కృత్య యో వా యోనిపూజకశ్చ ।**
**స ధన్యః స కవిర్ధీమాన్ స వన్ద్యోఽపి సురాసురైః ॥** 10

శ్లో॥ **బ్రహ్మా యది చతుర్వక్త్రైః కల్పకోటిశతైరపి ।**
**తదా వక్తుం న శక్నోతి కిమన్యైర్బహుభాషితైః ॥** 11

శ్లో॥ యది భాగ్యవశేనాపి సుపుష్పాం మీనచేతసామ్ ।
తదేవ మహతీం పూజాం కృత్వా మోక్షమవాప్నుయాత్ ॥ 12

శ్లో॥ ఆనీయ ప్రమదాం కాన్తాం ఘృణా-లజ్జా-వివర్జితామ్ ।
స్వకాన్తాం పరకాన్తాం వా సువేశాం స్థాప్య మణ్డలే ।
ప్రథమే విజయాం దత్త్వా పూజయేద్భక్తిభావతః ॥ 13

**ప్రతిపదార్థం :** యః = ఎవడైతే, శక్తిమన్త్రమ్ = శక్తిమంత్రమును, పురః + కృత్య = ముందుగా జపించి, యోనిపూజకః = యోనిపూజ చేయువాడగునో, యస్య = ఎవనియొక్క, చిత్తే = మనస్సునందు, దివ్యభావః = దివ్యభావము, వా = లేక, వీరభావః = వీరభావము, విరాజతే = ప్రకాశించునో, దేవేశి! = దేవతలకు ఈశ్వరివైన ఓ పార్వతీ!, తస్య = వానికి, అనాయాసేన = శ్రమలేకుండా, కరే = చేతియందు, ముక్తిః = మోక్షము, స్థితా = ఉన్నదగును, సః = అతడు, ధన్యః = ధన్యుడు, సః = అతడు, కవిః = కవి, సః = అతడు, ధీమాన్ = బుద్ధిమంతుడు, సురాసురైః అపి = దేవతలచేతను దానవులచేతను కూడ, వన్ద్యః = పూజింపబడదగినవాడు, భాగ్యవశేన + అపి = అదృష్టవశముననైన, (సః = ఆతడు), స్వకాన్తామ్ = తన భార్యను, వా = లేక, పరకాన్తామ్ = ఇతరుని భార్యను, ప్రమదామ్ = యౌవనమున కాముకియైనదానిని, కాన్తామ్ = ఆకర్షణీయమైన రూపముగలదానిని, ఘృణా = విముఖత, లజ్జా = సిగ్గు, వివర్జితామ్ = లేనిదానిని, సువేశామ్ = మంచి వేషధారణగలదానిని, లేక, సులభయగు వేశ్యను, సుపుష్పామ్ = పుష్పవతియైనదానిని, మీనచేతసామ్ = ప్రేమగలదానిని, ఆనీయ = తీసికొని వచ్చి, మండలే = మండలమున, స్థాప్య = ప్రతిష్ఠించి, ప్రథమే = మొట్టమొదట, విజయామ్ = భంగును, దత్త్వా = సమర్పించి, భక్తిభావతః = భక్తిభావముతో, తద్ + ఏవ మహతీం పూజామ్ = ఆ చెప్పబడిన గొప్ప పూజనే, కృత్వా = చేసి, పూజయేత్ = పూజించునో, మోక్షమ్ = మోక్షమును, అవాప్నుయాత్ యది = పొందినట్లయిన, తదా = అప్పుడు, బ్రహ్మా = బ్రహ్మ, చతుః + వక్త్రైః = నాలుగు ముఖములతో, కల్పకోటిశతైః అపి = నూరుకోట్ల బ్రహ్మకల్పముల పర్యంతము, వక్తుమ్ = వర్ణించుటకు, న శక్నోతి యది = అశక్తుడైనట్లయిన, అన్యైః = ఇతరుల, బహుభాషితైః కిమ్ = బహువర్ణనల విషయమేమి చెప్పవలెను?

**తాత్పర్యం :** ఏ సాధకుడు ముందుగా శక్తిమంత్రాన్ని జపించి యోనిపూజ చేస్తాడో, ఎవని మనసులో ఆ సమయమున దివ్యభావమో వీరభావమో ప్రకాశిస్తూంటుందో, వానికి శ్రమతోకూడిన సాధనల ఆవశ్యకత లేకయే మోక్షం సిద్ధిస్తుంది. ఓ పార్వతీ! అతడు ధన్యుడు, అతడు కవి, అతడు బుద్ధిమంతుడు, దేవతలకూ రాక్షసులకూ గూడా

అతడు వందనీయుడు. అతడొకవేళ అదృష్టవంతుడై తన భార్యనుగాని వేరొకని భార్యనుగాని లేక వేశ్యనుగాని తన కనుకూలవతియై సిగ్గును, విముఖతను విడచినదై, రూపవతి, మదవతి, ఆకర్షణ గలిగినది లభించినప్పుడు, ఆమెను తీసికొని వచ్చి, మండలంలో కూర్చుండబెట్టి, మొట్టమొదట భంగును సేవింపనిచ్చి, భక్తిభావంతో ముందు చెప్పబడిన యోనిపూజను నిర్వహించినట్లయితే, ఆతనికి మోక్షం సిద్ధిస్తుంది. అట్టివానిని నూరుకోట్ల బ్రహ్మకల్పాల పర్యంతం సాక్షాత్ బ్రహ్మదేవుడైనా తన నాలుగు ముఖములతో స్తుతించినప్పటికీ, ఆ మహిమావర్ణన సంపన్నం కాదు. ఇక మిగత చెప్పవలసినదేమున్నది!

పశుభావము భౌతికభావము. దానినాశ్రయించి యోనిపూజ చేసే సాధకుడు పశువుగానే మిగిలి, పతనమవుతాడు కనుక యీ పూజావేళ అతని మనసులో దివ్యభావం / వీరభావం ప్రకాశించటం సర్వోత్తమం, ఆశ్రయమని స్పష్టం.

దివ్యభావంతో చేసే యోనిపూజలో, సహకారిణి సాధారణ స్త్రీగా భావింపబడదు, జగజ్జననిగా, కాళీమాతగా భావించబడుతుంది. ఈ భావనలో పవిత్రత తప్ప సిగ్గు, అసహ్యము వంటి ప్రాకృతిక భావాలకు (పశుభావాలకు) తావుండదు. అప్పుడు మాత్రమే యోని జగద్యోనిగా సృష్టిస్థితిలయల కాధారభూతమై దివ్యమై ముక్తిని ప్రసాదిస్తుంది. ఈ భావశుద్ధి లోపిస్తే, ఇంద్రియలాలస ఆక్రమించి భ్రష్టుని చేయగలదని హెచ్చరిక. ✻

**శ్లో॥ వామోరౌ పరిసంస్థాప్య పూజా దేయా కులోచితా ।**
**యోనిగర్తే చన్దనశ్చ దద్యాత్పుష్పం మనోహరమ్ ॥ 14**

**శ్లో॥ తత్ర చావాహనం నాస్తి జీవన్యాసం తథా మనుః ।**
**తన్ముఖే కారణం దత్త్వా సిన్దూరేనార్ధచన్ద్రకమ్ ॥ 15**

**ప్రతిపదార్థం :** వామ + ఊరౌ = ఎడమ తొడపై, పరిసంస్థాప్య = కూర్చుండబెట్టుకొని, కుల + ఉచితా = కులసంప్రదాయమునకు తగిన (కౌలమైన), పూజా = పూజ, దేయా = ఇవ్వదగినది, యోనిగర్తే = యోనిగుంతపై, చన్దనః = గంధము, చ = మఱియు, మనోహరమ్ పుష్పమ్ = అందమైన పువ్వును, దద్యాత్ = ఉంచవలెను, తత్ర = ఈ విషయమున, ఆవాహనమ్ = ఆవాహన చేయుట, చ = మఱియు, జీవన్యాసమ్ = అంగన్యాసకరన్యాసములు, తథా = అట్లే, మనుః = మంత్రము, న + అస్తి = లేదు, తన్ముఖే = ఆమె ముఖముపై, సిన్దూరేన = సిందూరముతో, అర్ధచన్ద్రకమ్ = చంద్రవంకను, కారణమ్ = బొట్టు, దత్త్వా = పెట్టి,

**శ్లో॥ లలాటే చన్దనం దత్త్వా హస్తద్వయం కుచోపరి ।**
**అష్టోత్తరశతం జప్త్వా స్తనమధ్యే వరాననే! ॥ 16**

**శ్లో॥ కుచయోర్మర్దనం కుర్యాద్గణ్డచుమ్బనపూర్వకమ్ ।**
**అష్టోత్తరశతం వాపి సహస్ర యోనిమణ్డలే ॥ 17**

**శ్లో॥ జప్త్వా మహామనుం స్తోత్రం పఠేద్భక్తిపరాయణః ।**
**పూజాకాలే గురుర్న స్యాత్ యది సాధకసత్తమః ॥ 18**

**శ్లో॥ స్వయం పూజాప్రకర్తవ్యా నాత్ర కార్యా విచారణా ।**
**గురోరగ్రే పృథక్పూజా విఫలా చ న సంశయః ॥ 19**

**ప్రతిపదార్థం :** లలాటే = నుదుట, చన్దనమ్ = గంధమును, హస్తద్వయమ్ = రెండు చేతులను, కుచ + ఉపరి = పాలిండ్లపై, దత్వా = ఉంచి, అష్టోత్తరశతమ్ = నూట ఎనిమిది సార్లు, స్తనమధ్యే = స్తనముల మధ్యభాగమున, జప్త్వా = జపించి, వరాననే = అందమైన మోముగలదానా!, గణ్డచుంబనపూర్వకమ్ = బుగ్గలను ముద్దాడిన తరువాత, కుచయోః మర్దనమ్ = చన్నులొత్తుటను, అష్టోత్తరశతమ్ = నూట ఎనిమిది సార్లు, యోనిమణ్డలే = యోనిప్రదేశమున, సహస్ర వా + అపి = అష్టోత్తరసహస్రమునైనను, మహామనుమ్ = మహామంత్రమును, జప్త్వా = జపించి, భక్తిపరాయణః = భక్తితో నిండినవాడై, స్తోత్రమ్ = **యోనిస్తోత్రమును**, పఠేత్ = పఠించవలెను, పూజాకాలే = పూజ చేయు సమయమున, గురుః = గురువు, న స్యాత్ యది = లేనిచో, సాధకసత్తమః = ఉత్తమసాధకుడు, స్వయమ్ = తానే, పూజా = పూజను, ప్రకర్తవ్యా = చేయవలయును, అత్ర = ఈ, గురోః = గురువుయొక్క, అగ్రే = ఎదుట, పృథక్ = మరల వేరుగా, పూజా = పూజ, విఫలా = నిష్ఫలమగును, న సంశయః = సందేహము లేదు.

**తాత్పర్యం :** ఆ స్త్రీని సాధకుడు తన ఎడమతొడపై కూర్చుండబెట్టుకొని, కౌలసంప్రదాయిక పూజ చేయవలెను. యోనిద్వారమున గంధపుష్పముల నుంచవలెను. ఈ పూజావిధానంలో సాధారణంగా నిర్వహించే ఆవాహనముగాని అంగన్యాస కరన్యాసములుగాని, మంత్రోచ్చారణగాని ఉండదు. ఆమె ముఖముపై అర్ధచంద్రాకారంలో సిందూరంతో బొట్టు పెట్టి, చందనము పూయవలెను. తరువాత ఆతడు తన రెండు చేతులను ఆమె చనుగవపైనుంచి, స్తనమధ్యప్రదేశంలో నూట ఎనిమిది సార్లు ద్వావింశత్యక్షరీమహామంత్రాన్ని భక్తితో జపించి, బుగ్గలను ముద్దాడి, కుచమర్దనం చేసి, యోనిప్రదేశంలో అష్టోత్తరసహస్రంగా గాని లేక అష్టోత్తరశతంగా గాని జపించి, యోనిస్తోత్రాన్ని పఠించవలెను. ఆ సమయంలో సాధకుడే తాను స్వయంగా పూజచేయవలె, సందేహింపరాదు. ఇది సత్యం. *

**శ్లో॥ తస్మాత్ బహుతరైర్జలైర్గురవే చ సమర్పయేత్ ।**
**పూజావసానే చాగత్య ప్రణమేత్ యోనిమణ్డలే ॥ 20**

**శ్లో॥ పుష్పాంజలిత్రయం దత్త్వా స్వగురుం ప్రణమేత్పునః ।**
**ప్రార్థయే ద్బహుమంత్రేన కృతాఞ్జలిపుటః సుధీః ॥ 21**

**ప్రతిపదార్థం :** తస్మాత్ = అందువలన, బహుతరైః జలైః = నీటిధారతో, గురవే = గురువునకు, సమర్పయేత్ = (పూజాఫలమును) సమర్పించవలెను, చ = మరియు, పూజావసానే = పూజ ముగిసిన తరువాత, ఆగత్య = వచ్చి, యోనిమణ్డలే = యోని ప్రదేశమున, ప్రణమేత్ = నమస్కరించవలెను, పునః = మరల, సుధీః = బుద్ధిమంతుడు, స్వగురుమ్ = తన గురువును, ప్రణమేత్ = నమస్కరించవలెను, కృతాంజలిపుటః = దోసిలిపట్టి, బహుమంత్రేన = అనేక విధములుగా శ్రద్ధతో, పుష్పాంజలిత్రయమ్ = ముమ్మారు పూలు దోసిటబట్టి, దత్త్వా = పూజించి, ప్రార్థయేత్ = ప్రార్థించవలెను.

**తాత్పర్యం :** పై జెప్పబడిన కారణాలవలన పూజాఫలాన్ని నీటితో గురువునకు ధారపోయవలె. పూజ పూర్తియైన తరువాత ముమ్మారు దోసిలినిండ పూలతో గురువును పూజించవలె, నమస్కరించి, అంజలి ఘటించి మంత్రపూతముగ ప్రార్థించవలె. అట్లే, యోనిప్రదేశమునకు నమస్కరించవలె.

ఏ పూజ చేసినా, పూజాఫలాన్ని ఆ మంత్రాధిదేవతకో గురువుకో సమర్పించవలె నన్నది సంప్రదాయం. కాగా, ఈ పూజకూడా భక్తితో నిర్వికారమనస్కతతో జగత్కారణ దైవతాన్నిగా యోనిని పూజించి నమస్కరించటమే.

జితేంద్రియులకు తప్ప ఈ సాధనలు సామాన్యులకు ఫలించవు. కనుక ఈ వర్ణనలకు మార్మికమైన సాత్త్వికార్థాలను గ్రహించి, ఆ పద్ధతి నవలంబించి అనుకల్పాలను – నిర్వాణతంత్రం, శాక్తానందతరంగిణి వంటి విధి గ్రంథాలనుండి గ్రహించి ఆశ్రయించటం మేలు. *

**శ్లో॥ యోనిపూజావిధిం దృష్ట్వా కృతార్థోఽస్మి న సంశయః ।**
**అద్య మే సఫలం జన్మ జీవితశ్చ సుజీవితమ్ ।**
**పూజాం కృత్వా మహాయోనిముద్ధృతం నరకార్ణవాత్ ॥ 22**

**ప్రతిపదార్థం :** యోనిపూజావిధిమ్ = యోనిపూజావిధానమును, దృష్ట్వా = చూచి, కృతార్థః = ధన్యుడను, అస్మి = అయినాను, న సంశయః = సందేహము లేదు, మహాయోనిమ్ = మహాయోనిని, శక్తిపీఠమును, పూజామ్ కృత్వా = పూజించి, అద్య = నేడు, మే జన్మ = నా జన్మము, నరకార్ణవాత్ = నరకసాగరమునుండి, ఉద్ధృతమ్ = కాపాడబడినది, జీవితః చ = జీవితమున్నూ, సఫలమ్ = ఫలవంతమై, సుజీవితమ్ = చక్కగా జీవింపబడినది.

**తాత్పర్యం :** యోనిపూజ చేసి నేను ధన్యుడనైనాను. **యోనిపీఠాన్ని లేక శక్తిపీఠాన్ని** పూజించినందువలన నరకసముద్రమునుండి దాటింపబడినాను, నేడు నా జన్మ సఫలమైనది, చక్కగా జీవింపబడినది.

ఇది పూజాంతంలో సాంజలియై సాధకుడు గురువుతో తన కృతజ్ఞతాప్రకటనగా చెప్పవలసినది. ఇక్కడ నరకంనుండి కాపాడబడటం అన్న ప్రసంగంవలన ఈ నరకం ఇంద్రియలాలసవలన కలిగేదనిన్నీ, యోనిని మహాశక్తిపీఠంగా పూజ్యభావంతో గ్రహించటం ద్వారా ఆ లాలసనుండి, తత్ఫలమైన నరకంనుండి తరించటం ప్రస్తుతింపబడినది. ఇట్లే పూజ ముక్తిదాయకమైనది. *

**ఇతి యోనితన్త్రే ప్రథమోఽధ్యాయః సంపూర్ణమ్ ।**

---

# ద్వితీయోఽధ్యాయః

**శ్రీదేవ్యువాచ :** శ్రీదేవీ = పూజ్యురాలైన పార్వతీదేవి, ఉవాచ = పలికెను,

శ్లో॥ **దేవదేవ! జగన్నాథ! సృష్టిస్థిత్యన్తకారకః ।**
**త్వాం వినా జనకః కోఽపి మాం వినా జననీ పరా ॥** 1

శ్లో॥ **సంక్షేపాత్కథితా యోనిపూజావిధిరనుత్తమా ।**
**కస్యా యోనిః పూజితవ్యా యోనిశ్చ కీదృశీ శుభా ॥** 2

**ప్రతిపదార్థం :** దేవదేవ! = దేవతలకే దేవుడవైన, జగన్నాథ! = జగత్ప్రభూ!, సృష్టి = విశ్వముయొక్క పుట్టుకకు, స్థితి = నిలుకడకు, అన్త = నాశనమునకు, కారకః = కారణమైన, త్వాం వినా = నీవు కాక, జనకః = పుట్టించువాడు, కః = ఎవ్వడు?, మాం వినా = నేనుగాక, పరా = వేరొక, జననీ = జన్మనిచ్చునది, అపి = కూడ, (కా = ఎవతె?), అనుత్తమా = శ్రేష్ఠమైన, యోనిపూజావిధిః = యోనిపూజను చేయు విధానము, సంక్షేపాత్ = సూక్ష్మముగ, కథితా = చెప్పబడినది, కస్యాః = ఎవతెయొక్క, యోనిః = యోని, పూజితవ్యా = పూజింపదగినది?, చ = మరియు, (అట్టి) శుభా యోనిః = శుభమైన యోని, కీదృశీ = ఎటువంటిది?

**తాత్పర్యం :** లోకపూజ్యురాలైన దేవి పార్వతి ఇట్లడిగింది : సృష్టిస్థితిలయాలకు కారణమైనవాడవు కదా జగన్నాథా! దేవదేవా! నీకంటె వేరుగా తండ్రిగాని, నాకంటె వేరుగా తల్లిగాని ఎవరున్నారు? శ్రేష్ఠమైన యోనిపూజావిధానాన్ని ఇంతవరకు క్లుప్తంగా చెప్పినారు. మీరు చెప్పిన పూజ్యమైన ఆ యోని ఎవరిది? అది ఎటువంటిది? అదెంత శుభంకరమైనది?

సృష్టిస్థితిలయాలు ప్రకృతిస్వరూపాలు. వానికి క్షేత్రం ప్రకృతి, అనగా పార్వతియే. కనుక వానికి యోని, అనగా జన్మభూమి ఆమెయే. అట్లే, ఆ క్షేత్రంలో ఈ సృష్టి మొలకెత్తటానికి మూలమైనది బీజం, అనగా కర్త, ఆతడే పురుషుడు, భవుడు, కారణము. ఆ పురుషుడే జనకుడు, కాగా తామిద్దరున్నూ కాక వేరొకరు జగత్కారణంగా జగత్పితరులుగా చెప్పదగినవారున్నారా? ఉంటే, ఆ క్షేత్రం ఎవరికి సంబంధి? దాని లక్షణమేమి? దాని పూజ ఎంత శుభకరం? అని పార్వతి సంశయం. ✻

**శ్రీ మహాదేవ ఉవాచ :** శ్రీమహాదేవః = పూజ్యుడైన మహాదేవుడు, ఉవాచ = పలికెను

**శ్లో॥ నటీ కాపాలినీ వేశ్యా రజకీ నాపితాఙ్గనా ।**
**బ్రాహ్మణీ శూద్రకన్యా చ తథా గోపాలకన్యకా ॥ 3**

**శ్లో॥ మాలాకారస్య కన్యా చ నవకన్యాః ప్రకీర్తితాః ।**
**అథవా సర్వజాతీయా విదగ్ధా లోలలోచనా ॥ 4**

**శ్లో॥ మాతృయోనిం పరిత్యజ్య సర్వయోనిఞ్చ తాడయేత్ ।**
**ద్వాదశాబ్దాధికా యోనిం యావత్ షష్ఠీం సమాపయేత్ ॥ 5**

**శ్లో॥ ప్రత్యహం పూజయేద్యోనిం పఞ్చతత్త్వైర్విశేషతః ।**
**యోనిదర్శనమాత్రేణ తీర్థకోటిఫలం లభేత్ ॥ 6**

**ప్రతిపదార్థం :** నటీ = నాటకములలో నటించు స్త్రీ, కాపాలినీ = కపాలమాలలు ధరించి సంచరించు ఒక శైవసంప్రదాయమునకు చెందిన స్త్రీ, వేశ్యా = పురుషుల భోగమునకై శరీరము నర్పించు వృత్తిగల స్త్రీ, రజకీ = బట్టలుతుకి శుభ్రము చేయు వృత్తిగల స్త్రీ, నాపితాఙ్గనా = క్షవరము చేయు వృత్తిగల యింట బుట్టిన స్త్రీ, బ్రాహ్మణీ = బ్రాహ్మణస్త్రీ, శూద్రకన్యా = శూద్రస్త్రీ, చ = మరియు, తథా = అట్లే, గోపాలకన్యకా = గోవులగాచు స్త్రీ, చ = మరియు, మాలాకారస్య కన్యా = తోటమాలి లేక పూదండలు గట్టు వృత్తిగల ఇంటి స్త్రీ, (వీరు) నవకన్యాః = తొమ్మండుగురు కన్యలుగా, ప్రకీర్తితాః = చెప్పబడినారు, అథవా = లేక, సర్వజాతీయా = ఏ జాతికి చెందినదైనను, లోలలోచనా = చంచలనేత్రియై దిక్కులు చూచునది, విదగ్ధా = తెలివిగల వంచన చేయగల స్త్రీ, మాతృయోనిం పరిత్యజ్య = కన్నతల్లిని విడచి, సర్వయోనిఞ్చ = యే స్త్రీనైనను, ద్వాదశాబ్దాధికా = పండ్రెండు సంవత్సరములు దాటినది, షష్ఠీం సమాపయేత్ యావత్ = ప్రసవించి ఆరు దినములు దాటిన దానిని, తాడయేత్ = రమించవలెను, ప్రత్యహమ్ = ప్రతిదినము, యోనిమ్ = యోనిని, విశేషతః = విశేషించి, పంచతత్త్వైః = పంచతత్త్వములతో, పూజయేత్ = పూజింపవలెను, యోనిదర్శనమాత్రేణ = యోనిదర్శనం చేత, తీర్థకోటి = కోటి పుణ్యతీర్థముల యాత్రా, ఫలమ్ = ఫలము, లభేత్ = లభించును.

**తాత్పర్యం :** పూజ్య మహాదేవుడిట్లు పార్వతికి సమాధానమిచ్చినాడు : నవకన్యలుగా చెప్పబడిన వారందరూ ఈ సాధనకు తగినవారే, వారెవరంటే, నటి, కాపాలినీ, వేశ్య, రజకస్త్రీ, మంగలిస్త్రీ, బ్రాహ్మణస్త్రీ, శూద్రస్త్రీ, యాదవకన్య, తోటమాలి స్త్రీ, వీరుకాక, ఏ జాతి స్త్రీయైనను, చంచలనేత్రాలు కలిగి, తెలివిగల స్త్రీ తగినదే. అయితే సాధకుని తల్లి నిషిద్ధస్త్రీ. ఈ యువతి పంద్రెండేండ్లు నిండినది మొదలు ప్రసవించిన ఆరవరోజు జరుపు షష్ఠిపూజ పూర్తియైనదైనంతవరకు సాధకసహాయిని కావచ్చును. విశేషముగా పూజను పంచతత్త్వములతో ప్రతిదినము చేయవలెను. యోనిదర్శనమే కోటితీర్థస్నానముల ఫలమునిచ్చును.

ఈ శ్లోకాన్ని, ప్రథమాధ్యాయంలోని సారభూతమైన విషయంతో సమన్వయించి కొని భావనను దివ్యభావనగా సంస్కరించికొని, సాధకుడు పూజించవలెను.

ప్రకృతితత్త్వాలైన పృథివీ, ఆపః, తేజస్, వాయురాకాశాదులతో కలిపి భావించి ప్రతిదినము యోనిని పూజించవలెను. అనగా, ప్రాకృతికమైన, తన స్వభావాన్ని జీవుడేనాడూ మరువరాదు. తనకు నామరూపాలిచ్చినవి, మన్నిక, మనుగడలిచ్చినవి ఈ ప్రధానతత్త్వాలే, అవి సర్వదా స్మరణీయం. ఈ రూపమైన పాంచభౌతికరూపమున యోనిని దర్శించుట కోటిపుణ్యక్షేత్రముల సేవవలన లభించే పుణ్యాన్నివ్వగలదు. దర్శించటం అంటే, మనసా భావించటం. *

**శ్లో॥ తిలకం యోనితత్త్వేన వస్త్రఞ్చ కులరూపకమ్ ।**
**ఆసనం కులరూపఞ్చ పూజనఞ్చ కులోచితమ్ ॥ 7**

**శ్లో॥ ప్రథమం మర్దనం తస్యాః కున్తలాకర్షణాదికమ్ ।**
**తద్ హస్తే చ స్వలిఙ్గఞ్చ దద్యాత్ సాధకసత్తమః ॥ 8**

**ప్రతిపదార్థము :** సాధకసత్తమః = సాధనశ్రేష్ఠుడు, కులరూపకమ్ = కౌలాచారపరమైన, తిలకమ్ = తిలకము, చ = మరియు, వస్త్రమ్ = వస్త్రము, చ = మరియు, కులరూపమ్ = కౌలాచారపరమైన, ఆసనమ్ = ఆసనము, పీట, చ = మరియు, కులరూపమ్ = కౌలాచారపరమైన, కులోచితమ్ = కౌలాచారమునకు తగిన, పూజనం చ = పూజయున్ను, తస్యాః = ఆమెయొక్క, కున్తల = జుత్తును, ఆకర్షణమ్ = ముడి వీడదీయుట, ఆదికమ్ = మొదలుగాగల, ప్రథమమ్ = ముఖ్యమైన, మర్దనమ్ = చన్నులొత్తుట, చ = మరియు, తద్ హస్తే = ఆమె హస్తమున, స్వలిఙ్గమ్ = తన పురుషాంగమును, యోనితత్త్వేన = యోనితత్త్వమునందు మనసునిల్పి, దద్యాత్ = ఈయదగును.

**తాత్పర్యము :** కులాచారాన్ని అనుసరించి ఆసనం, వస్త్రం, విధివిధాయకంగా అర్పించి తన ఇష్టదేవతను పూజించవలెను. అన్నిటికంటే ముందుగా తన కులకాంత కుచమర్దనం

ఆమె జుత్తును వదులుగా ముడివీడ లాగటం చేయవలె. ఆపై సాధకుడామె హస్తంలో తన పురుషాంగాన్ని ఉంచవలె. ఈ మొత్తం ప్రక్రియను యోనితత్త్వంలో మనసు నిలిపి చేయవలెను. ఈ ప్రక్రియకు **తిలకార్పణం** అని పేరు.

శక్తి ఆరాధనలో అనుసరించబడే మార్గాలు రెండు : 1) కౌలం, 2) వామం. **కౌలం సాత్త్వికం**, సమాజంలో జీవితంలో ఉంటూ ఆచరించదగిన రీతిలో పూజనవిధి ఉంటుంది. కనుక అత్యధికులకు ఆశ్రయం.

కౌలం అంటే కులసంబంధమైనది అని అర్థం. శాక్తేయపరిభాషలో కులం అన్నదానికి నిర్వచనం "కుః పృథ్వీతత్త్వం యత్ర లీయతే తత్కులమ్" పృథ్వీతత్త్వం లీనమై యున్నది కులము. కులము అని శ్రీవిద్యకున్నూ పేరు. మూలాధారాన్ని కులపద్మ మంటారు. అట్లే సుషుమ్నానాడికి కులమార్గమని పేరు. కనుక కులము అన్నది ఒక ఉపాసనా విధానము. ఈ దైవశక్తికి కులాంగన అని పేరు. ఇది కుండలినీశక్త్యుపాసన సంబంధి. కనుక, దానిని మనసులో నుంచికొనియే సాధకుడు ఈ పూజాక్రమాన్ని పరిశుద్ధమనస్కతతో నిర్వహించవలె.

ఈ ఉపాసనాధిదేవతస్థానంలో సాధకుడు తన కులాంగనను పూజిస్తాడు. ఆ పవిత్రభావన సడలరాదు. ఏలన భౌతికప్రాపంచికస్థాయిలో భూతత్త్వం లీనమైనది వ్యక్తిలో నాలుగుదళముల మూలాధారంలో, దీని అధిదేవత కులాంగనకు కౌలమైన లౌకికాధిదేవత సాధకుని ఇల్లాలు, కులాంగన. ఈ భావన సాగవలె. ఈ మొత్తం విధానాన్ని యోనితత్త్వంతో నిర్వహించవలె. అంటే, **సృష్టికి జన్మకారణతత్త్వంతో మనసు నిండాలి**. శ్రీవిద్యోపాసనలో అంగమైన కరచరణవిన్యాసాది దైహికతంత్రప్రక్రియగనే గ్రహించాలి. ✳

**శ్లో॥ యోనిపూజాం విధాయాథ లిఙ్గపూజనముత్తమమ్ ।**
**చన్దనం కుఙ్కుమం దద్యాత్ లిఙ్గోపరి వరాననే! ॥ 9**

**శ్లో॥ యోనౌ లిఙ్గం సమాక్షిప్య తాడయేద్బహుయత్నతః ।**
**తాడ్యమానే పునస్తస్యా జాయతే తత్త్వముత్తమమ్ ॥ 10**

**ప్రతిపదార్థం :** యోనిపూజామ్ = యోనిపూజను, విధాయ = విధ్యుక్తముగా చేసి, అథ = అంతట, లిఙ్గపూజనమ్ = లింగపూజను చేయుట, ఉత్తమమ్ = శ్రేష్ఠము, వరాననే! = అందమైన ముఖముగలదానా! లిఙ్గోపరి = లింగముపై, చన్దనమ్ = చందన గంధమును, కుఙ్కుమమ్ = కుంకుమమును, దద్యాత్ = ఉంచదగును. యోనౌ = యోనియందు, లిఙ్గమ్ = లింగమును, సమాక్షిప్య = ఉంచి, బహుయత్నతః = ఎంతయో ప్రయత్నపూర్వకముగ, తాడయేత్ = రమించవలెను. తాడ్యమానే = ఆ తాడనము జరుగుచుండగా, తస్యాః = ఆమెయొక్క, ఉత్తమమ్ తత్త్వమ్ = ఉత్తమమైన తత్త్వము,

పునః = తద్విపరీతముగా, జాయతే = కలుగును.

**తాత్పర్యం :** విధ్యుక్తముగా యోనిపూజనుచేసి, ఆ తరువాత లింగపూజను చేయుట శ్రేష్ఠము. లింగమును కుంకుమగంధాలతో అలంకరించవలెను. యోనియందు లింగమునుంచి ప్రయత్నపూర్వకముగ రమించవలెను. ఆ రీతి రమించగా, బాహ్యక్రియార్థ విపరీతముగా, ఆమెయొక్క ఉత్తమతత్త్వము ఆమెయందే జనించును.

ఈ పూజా సన్నివేశంలో సాధకుడొకడే పూజారి కాదు, నిజానికి వాని పూజలందే కులదేవతగా కనిపిస్తూన్న వాని ఇల్లాలు కూడా పూజారిణియే. ఇది గమనార్హం. పూజారి ధ్యానం తన బాహ్యదైహికచర్యలయందు కాక ఆ కులదేవతయందు ఎట్లుండునో, అట్లే, కులదేవతస్థానీయయై పూజలందుకొంటూన్న వాని ఇల్లాలు సైతం తనకు జరుగుచున్న పూజయందు గాని, తాను పాల్గొంటూన్న దైహికకార్యకలాపాలందుగాని యేమాత్రమున్నూ మనసునుంచక, మనసులో సాక్షాత్ ఆ కులదేవతనే భావించి తాను తత్సరూపయౌనంతగా ఆ దేవత ధ్యానంలో తదేకం కావలె.

**తాడయేద్బహుయత్నతః అనటంలో భావం :** సాధారణకాముకునివలె సంభోగానందంకోసం, ఎప్పుడెప్పుడు వీర్యస్ఖలనమవుతుందో అనిగాక, ఆ సాధకుడు ఆనందపరమావధిని చేరుటకు సాధ్యమైనంతకాలం రతిని సాగనివ్వవలెను.

యోనిపూజానిర్వాహకుడు సాధకుడైతే, లింగపూజనం చేసేదెవరు? అంటే, ఇక్కడ పూజయేదైనా దంపతులిద్దరూ భాగస్వాములే అన్నది గ్రాహ్యం. *

**శ్లో॥ తత్త్వేన పూజయేద్దేవీం యోనిరూపాం జగన్మయీమ్ ।**
**భౌమావాస్యాం నిశాభాగే చతుష్పథగతో నరః ॥ 11**

**శ్లో॥ శ్మశానే ప్రాన్తరే గత్వా దగ్ధమీనసమన్వితః ।**
**పాయసాన్నం బలిం దత్త్వా కుబేర ఇవ పారగః ॥ 12**

**ప్రతిపదార్థం :** నరః = సాధకమానవుడు, భౌమావాస్యామ్ = మంగళవారమునాడుండు అమావాస్యయందు, నిశాభాగే = అర్ధరాత్రివేళ, చతుష్పథ = నాలుగు మార్గముల కూడలిని, గతః = చేరినవాడై, జగన్మయీమ్ = జగత్తునంతయు నిండియున్న, యోనిరూపామ్ = యోనిరూపముగల, దేవీమ్ = దేవతను, తత్త్వేన = తత్త్వజ్ఞానముతో, పూజయేత్ = పూజింపదగును. (లేక) శ్మశానే = శ్మశానందలి, (లేక) ప్రాన్తరే = నిర్మానుష్యమై, పొడవైన మార్గము, అరణ్యము, చెట్టు తొఱ్ఱ, వీనిలో నేదో యొక సాంప్రదాయసిద్ధమైన దానియందు, గత్వా = చేరి, దగ్ధమీనసమన్వితః = కాల్చిన చేపతో కూడిన, పాయసాన్నమ్ = పాయసాన్నమును, బలిం దత్త్వా = బలిగానిచ్చి, పారగః = సంసారసాగరమును దాటినవాడై, కుబేరః ఇవ = కుబేరునివలె (అగును).

**తాత్పర్యం :** సాధకుడు మంగళవారమునాటి అమావాస్య అర్ధరాత్రమున నాలుగు బాటలు కలిసిన కూడలినిగాని, శ్మశానమునుగాని, నిడుదయై నిర్మానుష్యమైన బాటనో లేక అటవీప్రాంతమునో, లేక చెట్టు తొఱ్ఱలోనో, వీనిలో సాంప్రదాయసిద్ధ ప్రదేశము నొకదానిని చేరి, కాల్చిన చేపతో కూడిన పాయసాన్నమును బలిగా సమర్పించి, జగత్తంతయూ తానై వ్యాపించిన యోనిరూపయైన ఆ దేవిని తత్త్వసహితముగ పూజింపదగును. ఇందువలన నితడు భవసాగరమును దాటి, కుబేరునివలె సంపత్సమృద్ధితో ఆనందించును.

తత్త్వేన, తత్త్వదృష్టితో, అనటం గమనార్హం. పూజాకార్యక్రమంపైకి భౌతిక చర్యగా కనిపిస్తూన్నప్పటికి, ఈ భౌతికచర్య కేవలం అంగన్యాసంగా ఉన్న తాంత్రికచర్య, అప్రధానం. ముఖ్యం పూజ తత్త్వం. తాత్త్వికదృష్టిలో ప్రాణిలోకంలోకి ప్రవేశించే మార్గం యోని. సృష్టిసమస్తమున్నూ యోనిరూపమాతృతత్త్వమే. అట్లే, శ్మశానము ప్రాణి నిర్గమమార్గం. ఇవి సాధన స్థలాలుగా శక్తిక్షేత్రాలయినవి. దగ్ధమీనసమన్వితపాయసాన్నం అనగా, **దహించిన కామక్రోధలోభమోహమదమాత్సర్యనిచయం సమష్టిగా ఆ కుండలినీ శక్తికి నైవేద్యంగా సమర్పించటం భావించబడింది.** దగ్ధకామంతో (అరిషడ్వర్గవిజేతగా), సన్యస్తకామాదులతో, సంసారరూపకామప్రక్రియను సాగించి, అందలి దైవశక్తిని, జీవశక్తిని ఆకళింపు జేసికొన్నవాడు సర్వసిద్ధులను పొందగలుగును. *

**శ్లో॥ చితాయాం భౌమవారే చ యో జపేద్ యోనిమణ్డలే ।**
**పఠిత్వా కవచం దేవి పఠేన్నామసహస్రకమ్ ।**
**స భవేత్కాలికాపుత్త్రో ముక్తః కోటికులైః సహ ॥ 13**

**ప్రతిపదార్థం :** భౌమవారే = మంగళవారమున, చ = మరియు, చితాయామ్ = శ్మశానమున, యః = ఏ సాధకుడు, దేవి = ఓ దేవీ!, కవచమ్ = యోనికవచమును, పఠిత్వా = చదివి, యోనిమణ్డలే = శక్తిపీఠమున, నామసహస్రకమ్ = సహస్రనామ స్తోత్రమును, పఠేద్ = చదువునో, జపేద్ = జపము చేయునో, సః = ఆతడు, కోటికులైః సహ = తన కులమువారు కోట్లమందితో సహ, ముక్తః = ముక్తుడై, కాలికాపుత్త్రః = కాళికాదేవి కుమారుడై (అంతటి ప్రీతిపాత్రుడై), భవేత్ = అగును.

**తాత్పర్యం :** ఓ దేవీ! మంగళవారంనాడు, శ్మశానంలో, శక్తిపీఠస్థుడై యే సాధకుడు యోనికవచాన్ని పఠించి, సహస్రనామస్తోత్రం చేసి, మంత్రజపము చేయునో, ఆతడు తన సాటివారు కోటిమంది సాధకులతో కూడి ముక్తుడై, కాళికాదేవి ప్రియపుత్త్రసముడగును.

పై శ్లోకాలలో వర్ణించబడిన తత్త్వంతోకూడిన పూజ శక్తిపూజ (శక్తిమండలం, శక్తిపీఠం) అవుతుంది. ఆ పూజాంతంలో సాధకుడు తన ఆరాధ్యదేవతామంత్రాన్ని మనసా

జపించవలె. ఆపై కవచాన్నీ సహస్రనామాన్నీ పఠించాలి. ఈ కవచ స్తోత్రాలు యేవి? దేవత కాళిక కనుక కాళీకవచమా? లేక, ఆ దేవత ప్రస్తుతం యోనిరూప కనుక యోనికవచమా? యోనికవచాన్ని పఠించి, కాళికాసహస్రనామస్తోత్రం చేయవలె అని పెద్దల నిరూపణ. ఈ ప్రక్రియను తత్త్వతః నిర్వహించినవాడు కాళీపుత్రుడే అనటం అత్యుక్తి కాదు. తాను ముక్తుడగుట నిస్సంశయమే. వానిని అనుసరించువారు కోట్లాదిగా ఉందురని, వారున్నూ ముక్తులగుదురనిన్నీ భావం. *

**శ్లో॥ సామిషాన్నం బలిం దత్త్వా శూన్యగేహేఽథవా గృహే ।**
**జపిత్వా చ పఠిత్వా చ భవేద్యోగీశ్వరో నరః ॥ 14**

**ప్రతిపదార్థం :** నరః = సాధక మానవుడు, శూన్య = ఎవరున్నూ నివసించని నిర్జనమైన, గేహే = ఇంటియందు, అథవా = లేకున్న, గృహే = తాను నివాసమున్న ఇంటియందు, జపిత్వా చ = మంత్రమును జపించియు, పఠిత్వా చ = కవచమును, కాలికాసహస్రనామ స్తోత్రమును పఠించియును, స + ఆమిష + అన్నమ్ = సామిషాన్నమ్ = మాంసముతో కూడిన అన్నమును, బలిమ్ = నైవేద్యముగా, దత్త్వా = సమర్పించి,యోగీశ్వరః = యోగులలో శ్రేష్ఠుడు, భవేత్ = అగును.

**తాత్పర్యం :** 13వ శ్లోకంలో చెప్పినట్లు, మంత్రజపాన్నీ కవచపాఠాన్నీ సహస్రనామ స్తోత్రాన్నీ సాధకుడు ఆ యా పూర్వోక్తప్రదేశాలలోనేకాక, ఎవరూ కాపురముండని ఇంటియందో లేక తాను కాపురముంటూన్న ఇంటియందో నిర్వహించి, మాంసంతో కూడిన అన్నాన్ని నైవేద్యం చేసినట్లయితే, అతడు యోగలలో శ్రేష్ఠుడవుతాడు.

నైవేద్యమిచ్చే సామిషాన్నం వాని ఉపాసనాఫలానికి సమరూపం. శాక్తేయ పరిభాషలో **'మాంసభక్షణ'** అంటే బాహ్యప్రపంచబంధాలనుండి ముక్తుడై తన సాధనలో మగ్నమై ఉండటం; ఈ భావాన్ని విస్తరిస్తే, సాధకుని ధ్యానం పూర్తిగా సమాధిదశకు చేరటం సూచితం. కనుక ఆతడు శ్రేష్ఠయోగి యనటం సహజోక్తియే.

**శ్లో॥ రజస్వలాభగం దృష్ట్వా స్పృష్ట్వా సాధకః స్వయఞ్చ ।**
**అష్టోత్తరశతం జప్త్వా భవేద్భువి పురన్దరః ॥ 15**

**శ్లో॥ స్వశుక్రైర్యోనిపుష్పైశ్చ బలిం దత్త్వా జపేన్మనుమ్ ॥ 16**

**ప్రతిపదార్థం :** సాధకః = సాధకుడు, స్వయమ్ = తనకు తానై, రజస్వలాభగమ్ = పుష్పవతియైయున్న తరుణి యోనిని, దృష్ట్వా = చూచి, స్పృష్ట్వా = తాకి, అష్టోత్తరశతమ్ = 108సార్లు, జప్త్వా = మంత్రజపము చేసి, భువి = భూమిపై, పురన్దరః = దేవేంద్రుడుగ, భవేత్ = అగును. స్వశుక్రైః = తన వీర్యముతో, చ = మరియు, యోనిపుష్పైః =

సహజసిద్ధమైన రజస్వలారక్తముతోను, బలిమ్ = నైవేద్యముగా, దత్వా = ఇచ్చి, మనుమ్ = మంత్రమును, జపేత్ = జపించవలెను.

**తాత్పర్యం :** సాధకుడు స్వయంగా రజస్వలయైయున్న యువతి యోనిని చూచి, తాకి, అష్టోత్తరశతం మంత్రజపంచేసి, లోకంలో ఇంద్రుడివలె వెలిగిపోతాడు. కాగా మంత్రజపం పూజ తరువాత దేవతకు నివేదనగా తన వీర్యాన్నీ దానితో కలిపి ఆ రజస్వలా స్త్రీ యోనినుండి స్రవించిన పుష్పాన్ని, అనగా, రక్తాన్ని సమర్పించవలె. ✻

**శ్లో॥ దగ్ధమీనం కుక్కుటాణ్డం మూషకం మహిషం నరమ్ ।**
**మధు మాంసం పిష్టకాన్నం బలిం దత్వా నిశాముఖే ॥ 17**

**శ్లో॥ యత్ర తత్ర మహాస్థానే స్వయం నృత్యపరాయణః ।**
**దిగమ్బరో ముక్తకేశః స భవేత్ సమ్పదాం పదమ్ ॥ 18**

**ప్రతిపదార్థం :** (సాధకుడు), నిశాముఖే = రాత్రికాలము మొదలగువేళ, దగ్ధమీనమ్ = కాల్చిన చేపను, కుక్కుటాణ్డమ్ = కోడిగ్రుడ్డును, మూషకమ్ = ఎలుకను, మహిషమ్ = దున్నపోతును, నరమ్ = మనుష్యుని, మాంసమ్ = మాంసమును, పిష్టకాన్నమ్ = ఆవపిండి కలిపిన అన్నమును, మధు = సారాయిని, బలిమ్ = నైవేద్యముగ, దత్వా = ఇచ్చి, మహాస్థానే = పూజచేసిన చోట, యత్ర తత్ర = పై జెప్పబడిన ప్రదేశాలలో ఎక్కడైతే అక్కడ, స్వయమ్ = తనకు తాను, దిగమ్బరః = వివస్త్రుడై, ముక్తకేశః = జుత్తు విరబోసికొని, నృత్యపరాయణః = ఒడలు మరచి నాట్యమునందు లగ్నమగునో, సః = ఆ సాధకుడు, సంపదామ్ = సంపదలకు, పదమ్ = నిలయము, భవేత్ = అగును.

**తాత్పర్యం :** సాధకుడు, సాయంసమయం రాత్రిగా మారుతూన్నవేళ, కాల్చిన చేపను, కోడిగ్రుడ్డును, ఎలుక, దున్నపోతు, మనుష్యుడు, వీని మాంసాన్నీ, పిష్టికాన్నాన్నీ, సారాయిని, నైవేద్యమిచ్చి, ఆ ఎన్నుకొనబడిన పూజాస్థానంలో, తాను తనంత వివస్త్రుడై, జుత్తు విరబోసికొని, మైమరచి నాట్యమున లగ్నమైనచో, అట్టి సాధకుడు సంపదలకు నిలయమగును.

మాంసం అన్నది మూషక మహిష నరులకు ముగ్గురికీ చెందేదైతే, ఈ మూటి మాంసాన్నీ మిగతవానితో ఒకేసారి నివేదన అని భావమా? లేక ఈ మూటిలో లభించినదేదైనా నొకదాని మాంసమనవలెనా? అన్నది అస్పష్టము. ఇట్లే, పిష్టిక శబ్దానికి ఒక రకపు ధాన్యమని, ఆవాలని అర్థాలున్నవి. పిష్టకాన్నం పిండిగొట్టిన ధాన్యమేదైన పిండిని **పిష్టమనే** అంటారు. ఈ నైవేద్యపదార్థపు వివరాలు సాంప్రదాయికాచారంగా తెలియదగినవి. ఈ నైవేద్యంలో ఆ యా పదార్థాలకు కౌలాచారంలో అనుకల్పములు చెప్పబడినవి. ✻

**శ్లో॥ పరయోనౌ జపేన్మన్త్రం సర్వకాలే చ సర్వదా ।
దేవీబుద్ధ్యా యజేద్యోనిం తాం శక్తిం శక్తిరూపిణీమ్ ॥** **19**

**ప్రతిపదార్థం :** సర్వకాలే = అన్ని కాలములందు, చ = మరియు, సర్వదా = ఎల్లప్పుడును, శక్తిరూపిణీమ్ = శక్తిరూపముగల, తాం శక్తిమ్ = ఆ శక్తిని, దేవీబుద్ధ్యా = దేవతయన్న ఎఱుకతో, భావనతో, పరయోనౌ = పరకీయ స్త్రీయోనియందు, మన్త్రమ్ = మంత్రమును, జపేద్ = జపించదగును, యోనిమ్ = యోనిని, యజేత్ = పూజింపదగును.

**తాత్పర్యం :** ఆ శక్తిరూపిణియైన శక్తిని సర్వదా దేవీబుద్ధితో ఆరాధించుచూ పరయోనియందు మంత్రపూతముగ ధ్యానించదగును.

శక్తిరూపిణియైన ఆ శక్తిని పరదేవతగా స్వీకరించి జపించి, పూజించి, ధ్యానించుమని భావము. ఆ శక్తి ఎవరు? వ్యక్తిలో నిద్రాణంగా ఉన్న **'కులాంగన'** అనబడు కుండలిని. ఈమెయే ఆద్యాశక్తి, పరదేవత. అమెయందు సాధకుని మనస్సు లగ్నం కావలె. ఉపాసనాప్రక్రియలో తన భార్యయోని, కాకున్న పరస్త్రీయోని పరదేవతా పీఠంగా భాసిల్లుతుంది.

సర్వకాలే, సర్వదా రెండున్నూ కాలాన్ని బోధించేవే. బహుశః దేశకాలాలు రెండూ ఉద్దేశింపబడియుండవచ్చును. ✳

**శ్లో॥ ధర్మార్థకామమోక్షార్థీ చతుర్వర్గం లభేన్నరః ।
మద్యం మాంసం బలిం దద్యాత్ నిశాయాం సాధకోత్తమః ॥** **20**

**ప్రతిపదార్థం :** ధర్మ+అర్థ+కామ+మోక్ష+అర్థీ = ధర్మమును, అర్థమును, కామ్యపరిపూర్తిని, మోక్షమును కోరునట్టి, సాధకోత్తమః = శ్రేష్ఠసాధకుడైన, నరః = మానవుడు, మద్యమ్ = సారాయిని, మాంసమ్ = మాంసమును, నిశాయామ్ = అర్ధరాత్రివేళ, బలిమ్ = నైవేద్యముగా, దద్యాత్ = ఇవ్వదగును, అందువలన, చతుర్వర్గమ్ = పురుషార్థము లనబడు నాలుగిటిని, లభేత్ = పొందును.

**తాత్పర్యం :** ధర్మార్థకామమోక్షాలను కోరి శ్రీవిద్యనుపాసించే నరుడు ఉత్తమసాధకుడు. ఆతడు అర్ధరాత్రి మద్యమాంసాలను నైవేద్యం చేసి, ఆ దేవత నారాధిస్తే, ఆతడు కోరినవి పొందగలడు. ✳

**శ్లో॥ యత్నతస్తాడయేద్యోనిం కుచమర్దనపూర్వకమ్ ।
శక్తిరూపా చ సా దేవీ విపరీతరతా యది ॥** **21**

**ప్రతిపదార్థం :** చ = మరియు, శక్తిరూపా = శక్తిరూపయగు, సా దేవీ = ఆ ఆరాధ్యదేవత, యది విపరీతరతా = ఒకవేళ విపరీతరతియందాసక్తి గలిగినదయితే, కుచమర్దనపూర్వకమ్

= ముందుగా చన్నులొత్తి, యోనిమ్ = యోనిని, యత్నతః = ప్రయత్నపూర్వకముగ, తాడయేత్ = మధించవలెను.

**తాత్పర్యం :** ఒకవేళ సాధనలో తనకు సహకరించే స్త్రీ విపరీతరతిలో ఆసక్తిగలదైతే, సాధకుడు కుచమర్దనం తరువాత ఆమెను సంతోషపెట్టుటకు ఎంతైన ప్రయత్నించవలెను. ఆమెనొక సాధారణస్త్రీగా భావించక శక్తిదేవతగా గుర్తించవలెను. *

**శ్లో॥ తదా కోటి కులైః సార్ధం జీవితఞ్చ సుజీవితమ్ ।**
**యోనిక్షాలనతోయేన లిఙ్గప్రక్షాలనేన చ ॥ 22**

**శ్లో॥ పూజయిత్వా మహాదేవి! హ్యర్ఘం దద్యాత్ విధానతః ।**
**తత్తోయం త్రివిధం కృత్వా భాగం శక్త్యై నివేదయేత్ ॥ 23**

**ప్రతిపదార్థం :** తదా = అప్పుడు, కోటి కులైః సార్ధమ్ = తన కుటుంబమువారు కోటిమందితో కూడిన, జీవితం చ = జీవితముకూడ, సుజీవితమ్ = మంచి జీవితమగును. యోనిక్షాలనతోయేన = యోనిని కడిగిన నీటితో, చ = మరియు, లిఙ్గప్రక్షాలనేన = లింగమును కడుగుటచే, పూజయిత్వా = పూజించి, విధానతః = వేదవిధిగా, అర్ఘమ్ = అర్ఘ్యముగా, దద్యాత్ = ఇవ్వదగును; మహాదేవి! = ఆదిశక్తీ!, తత్తోయమ్ = ఆ నీటిని, త్రివిధమ్ = మూడు భాగములు, కృత్వా = చేసి, భాగమ్ = భాగమొకదానిని, శక్త్యై = శక్తికి, నివేదయేత్ = నివేదించవలెను.

**తాత్పర్యం :** అట్లా జరిగితే, అప్పుడు ఆ సాధకుడు తన వంశమువారిని కోటిమందిని తరింపజేసి, తాను తరించును. వారిది సార్థక జీవితమగును. యోనిక్షాలన, లింగక్షాలనల వలన లభించిన నీటితో దేవిని పూజించి, అర్ఘ్యం ఇవ్వదగును. ఆ నీటిని మూడు భాగాలు చేసి, ఒక భాగాన్ని శక్తికి నివేదించవలె. ఈ పూజ వేదవిధిగా జరగవలె.

తదా, అప్పుడు, అంటే, ఒకవేళ సాధకుని సహకారిణి విపరీతరతిని కోరినట్లయితే, అని అర్థం. *

**శ్లో॥ భాగద్వయం తథా మన్త్రీ కారణేన వ్యవస్థితమ్ ।**
**మిశ్రయిత్వా మహాదేవి! పిబేత్ సాధకసత్తమః ॥ 24**

**శ్లో॥ వస్త్రాలంకారగంధాద్యైస్తోషయేత్ పరసున్దరీమ్ ।**
**తద్యోనౌ పూజయేద్విద్యాం నిశాశేషే విధానతః ॥ 25**

**శ్లో॥ భగలింగైర్భగక్షాలైః భగశబ్దాభిధానకైః ।**
**భగలింగామృతైః కుర్యాన్నైవేద్యం సాధకోత్తమః ॥ 26**

**ప్రతిపదార్థం :** తథా = అదేవిధంగా, వ్యవస్థితమ్ = సిద్ధముగా ఉన్న, భాగద్వయమ్ =

రెండు భాగాలను, కారణేన = మద్యంతో, మిశ్రయిత్వా = కలిపి, సాధకోత్తమః = ఉత్తమసాధకుడు, పిబేత్ = త్రాగును. మహాదేవి! = ఓ ఆదిశక్తీ!, పరసుందరీమ్ = అన్యస్త్రీని, తద్ యోనౌ = ఆమె యోనియందు, నిశాశేషే = తెల్లవారుజామున, విధానతః = శాస్త్రోక్తపద్ధతిలో, విద్యామ్ = మహావిద్యయనుపేరుగల శ్రీవిద్యలో అంగమైన ఒక దేవతను ఆ దేవతామంత్రముతో, పూజయేత్ = పూజించవలెను (పూజాసమాప్తిలో), వస్త్రాలంకారగంధాద్యైః = నూతన వస్త్రములు, అలంకారములు, గంధము మొదలగు వానితో, తోషయేత్ = సంతోషపెట్టవలెను. సాధకోత్తమః = ఉత్తమ సాధకుడు, (పూజాకాలంలో) భగలింగైః = యోని, పురుషాంగములతో, భగక్షాలైః = యోనిని కడిగిన నీటితో, భగశబ్ద+అభిధానకైః = యోనికి గల అన్యనామములతో, భగలింగ+అమృతైః = భగమునుండి, లింగము నుండి స్రవించిన ద్రవముతో, నైవేద్యమ్ = నైవేద్యమును, కుర్యాత్ = సమర్పించవలెను.

**తాత్పర్యం :** శక్తిదేవతకు సమర్పించగా మిగిలిన రెండు భాగాలనూ మద్యంతో కలిపి సాధకుడు త్రాగవలెను. తనకు సహకరిస్తూన్న ఆ పరస్త్రీయోనియందు తన ఆరాధ్యదేవతను భావించి శాస్త్రోక్తముగా తెల్లవారుజామున పూజింపవలెను. పూజాంతంలో ఆ సహకారిణిని క్రొత్తబట్టలతో సత్కరించి, గంధాదులతో అలంకరించి గౌరవించి సంతోషపెట్టవలె. భగలింగములు స్రవించిన ఆ ద్రవాన్నే పూజలో ఉపయోగించాలి, దానితోనే నైవేద్యమివ్వాలి. *

**ఇతి యోనితన్త్రే ద్వితీయోఽధ్యాయః సంపూర్ణమ్ ।**

---

# తృతీయోఽధ్యాయః

**శ్రీ మహాదేవ ఉవాచ : శ్రీ మహాదేవు డిట్లనెను.**

**శ్లో॥ అథ వక్ష్యే మహేశాని! సావధానావధారయ ।**
**గోపనీయం ప్రయత్నేన న ప్రకాశ్యం కదాచన ॥ 1**

**శ్లో॥ ప్రకాశాత్ సిద్ధిహానిః ప్రకాశాత్ మరణం ధ్రువమ్ ।**
**ప్రకాశాత్ మన్త్రహానిః ప్రకాశాత్ శివహా భవేత్ ॥ 2**

**ప్రతిపదార్థం :** మహేశాని! = మహేశ్వరీ!, సావధానా = మనస్సు లగ్నంచేసి, అవధారయ = అవధరించు, అథ = ఇప్పుడు, ప్రయత్నేన = ఎంత ప్రయత్నమైన చేసి, గోపనీయమ్ = దాచియుంచదగినది, కదాచన = ఎప్పుడుగాని, న ప్రకాశ్యమ్ = అందరూ తెలియదగినది కాదు, ప్రకాశాత్ = బహిరంగపరచినందువలన, మన్త్రహానిః =

మంత్రమునకు హాని జరుగును, ప్రకాశాత్ = బట్టబయలు చేసినందువలన, సిద్ధిహానిః = రావలసిన సిద్ధులు భ్రష్టమగును, ప్రకాశాత్ = ప్రకాశపరచటం వలన, మరణమ్ = మరణము, ధ్రువమ్ = నిశ్చయము, ప్రకాశాత్ = ప్రకాశమువలన, శివహా = తాను కోరిన శుభములు నాశనము, భవేత్ = అగును.

**తాత్పర్యం :** మహాదేవుడిట్లా చెప్పినాడు : ఓ మహేశ్వరీ! ఇప్పుడు నే చెప్పబోయే విషయం పరమరహస్యం, సావధానవై విను. దీనిని బైటకు రానివ్వరాదు. ఎంత ప్రయత్నం చేసియైన రహస్యంగా ఉంచవలసినది. గోప్యత లేనట్లయితే, సాధకుడాశించిన సిద్ధులు లభించవు. ఎందుకంటే, మన్త్రం భ్రష్టమవుతుంది. దానివలన కలుగవలసిన శుభాలు కలుగవు. ప్రాణహాని కూడా కద్దు.

ఉపాసన విషయాలు రహస్యంగా ఎందుకుంచుతారన్నది తఱచు వేసే ప్రశ్న. దానికి సమాధానం ఇక్కడ దొరుకుతుంది. పదిమందికీ అందించవలెనన్న తపనతో యోగ్యతను త్రోసివేస్తే, ఆ నోట ఈ నోట పడి మంత్రం భ్రష్టమయితే, దానివలన ఫలితాలుగూడ దారుణంగానే ఉంటాయి. ✻

**శ్లో॥ యోనితత్త్వసముద్భూతం తన్త్రం తన్త్రప్రధానకమ్ ।**
**సుగోప్యోఽయం హి తన్త్రశ్చేత్ తవ స్నేహాత్ ప్రకాశితమ్ ॥ 3**

**శ్లో॥ పాపాత్మా మైథునే యస్య ఘృణా స్యాద్రక్తరేతసోః ।**
**పానే భ్రాన్తిర్భవేద్యస్య భేదబుద్ధిశ్చ సాధకే ॥ 4**

**ప్రతిపదార్థం :** యోనితత్త్వసముద్భూతమ్ = యోనితత్త్వమునుండి పుట్టినట్టి, తన్త్రమ్ = తంత్రశాస్త్రము, తన్త్రప్రధానకమ్ = తంత్రములలో ముఖ్యమైనది, అయమ్ = ఈ, తన్త్రః = తంత్రము, సుగోప్యః హి = రహస్యముగా నుంచదగినదే, చేత్ = అయినప్పటికి, తవ స్నేహాత్ ప్రకాశితమ్ = నీ స్నేహబలమున ప్రకటము గాక తప్పలేదు. సాధకే = సాధకునియందు, మైథునే = మైథునవేళలో, యస్య = ఎవనికి, ఘృణా = విసువు లేక, విముఖత, అసహ్యము, స్యాత్ = కలుగునో, రక్తరేతసోః = యోనిస్రావరక్తాన్నీ, శిశ్నస్రావ వీర్యాన్నీ, ఈ రెంటిని, పానే = త్రాగుటయందు, యస్య = ఎవనికి, భ్రాన్తిః = భ్రమ, చ = మరియు, భేదబుద్ధిః = దైవత్వభావమునుండి తొలగిన వివేకము, భవేత్ = కలుగునో, (సః = అతడు), పాపాత్మా = పాపి.

**తాత్పర్యం :** యోనితత్త్వంనుండి పుట్టిన తంత్రశాస్త్రం తన్త్రాలన్నిటిలో సర్వప్రధానమైనది. ఇది చాల రహస్యంగా ఉంచదగినదే. కాని నీ స్నేహబలం కారణంగా ప్రకటం చేస్తూన్నాను. యే సాధకునకు మైథునక్రియ సాగుతూండగా మైథునమునందు అసహ్యము కలుగునో, లేక, మైథునానంతరము యోనిస్రవరక్తాన్ని, వీర్యాన్నీ కలిపి త్రాగే సమయంలో

ఎవనికి దైవత్వభావం తొలగి, ప్రాకృతికమైన భేదబుద్ధి కలిగి, సాధనయంతయు ఒక ఆత్మలేని లాంఛనంగా తోచునో, అతడు పాపి.

**తన్త్రం క్షుద్రవిద్య కాదని ఈ శ్లోకాలు నొక్కి చెబుతూన్నవి.** సృష్టికి మూలతత్త్వమైన యోనితత్త్వం పట్ల యేమాత్రమూ తూష్ణీంభావమో నిరాదరణయో పనికిరాదు. తంత్రానుసారి పూజానిర్వహణలో సాధకుడు చిత్తభ్రాంతికి లోను కావచ్చు. కాని అట్లా కాకూడదు. తాను ఆచరిస్తూన్న కార్యకలాపం పట్ల జుగుప్స కలగటం గాని, లేక, తానూ తన మంత్రాధిదేవతా ఏకరూపులన్న నమ్మకం సడలటం గాని జరుగరాదు. ఈ భేదబుద్ధి కలిగినంతనే, వాని ప్రతి ఆచరణ పాపక్రియ అవుతుంది. ఆతడు పాపి అవుతాడు. *

**శ్లో॥ శక్తిమన్త్రముపాస్యైవ స దురాత్మా కథం వ్రజేత్ ।**
**పూజయిత్వా మహామాయాం ఛాగమేషాదిభిర్నరైః ॥ 5**

**శ్లో॥ రూరూభిర్హరిణైరుష్ట్రైర్గజైర్గోభిః శివాసుభిః ।**
**సింహైరస్రైర్గర్ధభైశ్చ పూజయేద్భక్తిభావతః ॥ 6**

**ప్రతిపదార్థం :** సః = అట్టి, దురాత్మా = దుర్మార్గుడు, శక్తిమన్త్రమ్ = శక్తిమంత్రాన్ని, ఉపాస్య + ఏవ = ఉపాసించియు, ఛాగ = మేక, మేష = గొఱ్ఱె, ఆదిభిః = మొదలగు వానితోను, నరైః = మనుష్యులతోను, రూరూభిః = నల్లఇఱ్ఱిచేతను, హరిణైః = ఇఱ్ఱి చేతను, ఉష్ట్రైః = ఒంటెలచే, గజైః = ఏనుగులచే, గోభిః = గుఱ్ఱాలచేత, శివా = గుంటనక్క యొక్క, అసుభిః = ప్రాణములచేత, సింహైః = సింహములచేత, అస్రైః = నెత్తురులచేత, గర్దభైః = గాడిదలచేత, చ = కూడ, భక్తిభావతః = భక్తిభావముతో, పూజయేత్ = పూజించునుగాక, పూజయిత్వా = పూజించి, కథమ్ = ఎట్లు, వ్రజేత్ = పొందును?

**తాత్పర్యం :** పై జెప్పబడిన దుర్బుద్ధిగలవాడు శక్తిమంత్రాన్ని ఉపాసించినా, పూజానంతరం మేక, గొఱ్ఱె, నల్లజింక, లేడి, గుంటనక్క, ఏనుగు, సింహము, నక్క, ఒంటె, గుఱ్ఱం, గాడిద మొదలైన జంతువుల ప్రాణాలతో, రక్తంతో ఎంత భక్తితో నైవేద్యం సమర్పించినప్పటికి, వాని పూజ నిష్ఫలమే అవుతుంది.

పై శ్లోకార్థాన్ని పోషించేదే ఈ శ్లోకార్థం కూడా. సాధకుని భక్తి లోపం లేదు. పూజానైవేద్యాలలోనూ లోపం లేదు. అయినా వాని సాధన వ్యర్థం. ఎందుకంటే, భక్తుడు తన ఆరాధ్యదేవతకు దూరమైనాడు. అద్వయభావం నష్టమై ద్వయభావం సాకారమైనది, ప్రకృతికి లొంగిపోయినాడు. *

**శ్లో॥ యోనిదర్శనమాత్రేణ కులకోటిం సముద్ధరేత్ ।**
**చంద్రసూర్యోపరాగే చ యది యోనిం ప్రపూజయేత్ ॥ 7**

**శ్లో॥ తర్పణం యోనితత్త్వేన న పునర్జాయతే భువి ।**
**క్రమశో లోకమాసాద్య దేవీలోకే మహీయతే ॥ 8**

**ప్రతిపదార్థం :** యోనిదర్శనమాత్రేణ = యోనిని దర్శించినంత మాత్రంచేత, కులకోటిమ్ = కోటి తరాలవారిని, సముద్ధరేత్ = (సాధకుడు) తరింపజేయును, యది = ఒకవేళ, చంద్రసూర్య = చంద్రసూర్యులయొక్క, ఉపరాగే = గ్రహణమునందు, యోనిమ్ = యోనిని, ప్రపూజయేత్ = పూజించినట్లయితే, యోనితత్త్వేన = యోనితత్త్వంచేత, తర్పణం చ = నైవేద్యమును కూడ (సమర్పించినట్లయితే), క్రమశః = కాలగతిలో, లోకమ్ = లోకాన్ని, ఆసాద్య = పొంది, దేవీ లోకే = తన ఇష్టదేవతాలోకంలో, మహీయతే = ఘనత వహిస్తాడు, భువి = భూలోకంలో, పునః = మరల, న జాయతే = జన్మించదు.

**తాత్పర్యం :** యోనిదర్శనమాత్రేణ అంటే, భౌతికంగా 'యోని' అనబడే స్త్రీ శరీరభాగమైన అంగాన్ని కంటితో చూడటం వలన, అని అర్థం కాదు. మనోనేత్రంతో, భక్తుడు విగ్రహంలో తన ఆరాధ్యదైవాన్ని దర్శించినట్లు, భౌతికతకతీతంగా తన దేవతను చూడటం ఇక్కడ సంభావ్యార్థం. అట్లే, కులకోటిం అనగా కోటి వంశాలని కాక తన వంశంలోని కోటి తరాలవారిని అనిగాని లేక కోటిమంది కులాచారులనిగాని అర్థం చెయ్యాలి. ఇక్కడ యోని తాత్త్వికమే తప్ప భౌతికం కాదని నొక్కి చెప్పటం కోసమే యోనితత్త్వేన అన్న దాని ఉద్దేశం.

లోకమాసాద్య అంటే లోకాన్ని పొంది అని అర్థం. అనగా లోకంలో తాను యేయే కోరికలతో ఆ దేవతను అర్చించినాడో ఆ కోరికలన్నీ తీరగా, అని భావం. *

**శ్లో॥ తత్ర తిష్ఠేత్ సాధకేన్ద్రః శక్త్యాయుక్తో మహేశ్వరః ।**
**మహాశంఖేన కల్యాణి! సర్వం కార్యం జపాదికమ్ ॥ 9**

**శ్లో॥ పఞ్చతత్త్వం వినా దేవి! యత్ కిఞ్చిత్ క్రియతే నరైః ।**
**తత్ సర్వం నిష్ఫలం తస్య చాన్తే చ నరకం వ్రజేత్ ॥ 10**

**ప్రతిపదార్థం :** (హే) దేవి! = ఓ దేవీ, కళ్యాణి! = కళ్యాణీ! సమస్తశుభకారిణీ!, సాధకేన్ద్రః = సాధకశ్రేష్ఠుడు, (యత్ర = ఎక్కడ), శక్త్యాయుక్తః = శక్తితో కూడి, మహేశ్వరః = మహేశ్వరుడు, తిష్ఠేత్ = నివసించునో, తత్ర = అక్కడ, (తిష్ఠేత్); జపాదికం సర్వమ్ = జపము మొదలైన పూజావిధానమంతయు, మహాశంఖేన = మహాశంఖముతో నిర్మించబడిన జపమాలతో, కార్యమ్ = చేయదగినది; నరైః = మానవులచే, యత్ కిఞ్చిత్ = యే కొంచెము, వినా పఞ్చతత్త్వమ్ = పంచమకారములు లేకుండ, క్రియతే

= చేయబడునో, తత్ సర్వమ్ = అది యంతయు, నిష్ఫలమ్ = నిష్ఫలమై, తస్య = వానియొక్క, అన్తే = అవసానమున, నరకం చ = నరకమును గూడ, (సః), వ్రజేత్ = పొందును.

**తాత్పర్యం :** ఓదేవీ! శుభప్రదా! శ్రేష్ఠసాధకుడు జన్మావసానమున శక్తితో ఏకత్వమున గూడి మహేశ్వరుడు నివసించు చోట తాను కూడ నివసించును. శక్తిసాధనలో జపాదిక క్రియాకలాపమంతయు శంఖనిర్మితజపమాలతో చేయదగును. నరులు పంచతత్త్వములు లేకుండ చేయు సాధన సర్వం నిష్ఫలమై, వారు దేహాంతమున నరకవాసులగుదురు.

**మహాశంఖేన** అన్నదాని అర్థాన్ని పరిశీలిస్తే, శంఖశబ్దానికి శంఖమనే వస్తుపరమైన అర్థం కాక, కోటికోట్లు అని సంఖ్యాపరమైన అర్థం కాగా, దానికి మహాశబ్దార్థాన్ని అన్వయిస్తే మరింత లెక్కకు మిక్కిలి సంఖ్య అవుతుంది. ఆ అర్థాన్ని జపాదికానికి అన్వయించటం మానవసాధకులకసాధ్యం. ఇక **మహాశంఖ** శబ్దార్థంగా నుదురు చెప్పబడింది. సాంకేతికంగా నుదురు ధ్యాననిమగ్నతకు స్థానం కనుక చెదరని ఏకాగ్రతను అన్వయించవచ్చు. అసందర్భమేమీ ఉండదు. కాగా, శంఖజపమాల శక్తిసాధకుల వాడుకలోనిదే కనుక, అదే ప్రాథమిక వాచ్యార్థంగా చెప్పి, ఏకాగ్రతను వ్యంగ్యార్థంగా చెప్పవచ్చు.

పంచతత్త్వములు అంటే పంచభూతములన్నదొక అర్థం ఉన్నది. కాని దానికిక్కడ సందర్భశుద్ధి లేదు. కనుక శక్తిసాధన విషయంలో విశేషార్థంగా తంత్రశాస్త్రార్థం పంచ మకారాలు భావింపబడినందున, అవే గ్రాహ్యమవుతాయి.

**పంచమకారాలు :** మద్య, మాంస, మత్స్య, ముద్రా, మైథునాలు, అయిదు. ఈ అయిదింటికి భౌతికవస్తురూపార్థాలు తెలిసినవే. ఆచరణ కివి పనికిరావని, వీనికి సాత్త్వికమైన సాంకేతికార్థాలను ప్రతిపాదించి తన్త్రవేత్తలు ఆచరిస్తూన్నారు. ఆ వివరాలివి:

**1. మద్యం :** సామాన్యార్థంలో **సారాయి**. సాంకేతికార్థంలో, మద్యపానం అంటే, నిరంతరం బ్రహ్మరంధ్రం నుండి ప్రవహించే చంద్రామృతాన్ని ఆస్వాదించటం, సాధకుని పరమాత్మానుభవం.

**2. మాంసం :** సాంకేతికంగా, మాంసభక్షణం అంటే, సాధకుడు మౌనవ్రతియై, లౌకికవార్తాలోలుపుడు కాక, తన సాధనలో లగ్నమనస్కుడై ఉండే స్థితి.

**3. మత్స్యం :** చేప, అన్నది సామాన్యార్థం. సాత్త్వికార్థం, కామక్రోధలోభమోహమద–మాత్సర్యములారింటి సమాహార స్వరూపం. వీనికే అరిషడ్వర్గం అని పేరు. మత్స్యభక్షణం అంటే ఈ షడ్వర్గాన్ని జయించటం. మత్స్యసాధనకు వేరుగానూ అర్థం చెప్పినారు

తన్త్రజ్ఞులు: శ్వాస ప్రక్రియకు సంబంధించిన ప్రాణాయామంలో కుంభకం అనబడే సాధనకే **మత్స్యసాధన** అన్న పేరు.

**4. ముద్రా :** భౌతికంగా, అంగన్యాస కరన్యాస ప్రక్రియ. యోగసాధనలోనూ భాగమే. సాంకేతికంగా, తన్త్రశాస్త్రంలో, మనోవృత్తులను నశింపజేసే సాధన, ఆత్మసాక్షాత్కార సాధన.

**5. మైథునం :** సామాన్యార్థం, స్త్రీపురుషలైంగిక క్రియ. తన్త్రశాస్త్రసాంకేతికార్థం, కుండలినీ శక్తితో శివుని కలయిక, అనగా, సాధకుడు తానే కుండలినీరూపశక్తితో తాదాత్మ్యం చెందటం.

వీని భౌతికార్థాలు మాత్రమే గ్రహించి, వాని సాధనయే శక్తిసాధనగా భావించి జీవించినవాని సాధన నిష్ఫలమని చెప్పబడినది. సృష్టి-స్థితి-లయ-తిరోధాన-అనుగ్రహములు - పంచతత్త్వములు. ఆ శ్రీదేవి - పంచకృత్యపరాయణా (273) లలితాసహస్రనామస్తోత్రమ్.

*

**శ్లో॥ అన్యయోనివిభేదేన యత్కిఞ్చిత్సాధకోత్తమైః ।**
**కుమ్భీపాకే చ పచ్యన్తే యావదాభూతసంప్లవమ్ ॥ 11**

**శ్లో॥ యోనిముఖే ముఖం దత్త్వా ప్రజపేదయుతం యది ।**
**కోటిజన్మార్జితం పాపం తత్క్షణాదేవ నశ్యతి ॥ 12**

**ప్రతిపదార్థం :** సాధకోత్తమైః = ఉత్తమసాధకులచే, యత్ కిఞ్చిత్ = యే కొంచెమైన, అన్యయోనివిభేదేన = తన భార్యయోని – అన్యస్త్రీయోని యన్న భేదబుద్ధితో, (క్రియతే = చేయబడునో), (తే = వారు), కుంభీపాకే = కుంభీపాకము అను నరకాగ్నిలో, యావత్ + ఆభూతసంప్లవమ్ = సమస్త సృష్టి ప్రళయమున లయమగువరకు, పచ్యన్తే చ = కాల్చబడుదురు. యోనిముఖే = యోనిద్వారమున, ముఖం దత్త్వా = తన ముఖమునుంచి, అయుతమ్ = పదివేలు, యది ప్రజపేత్ = మంత్రజపము చేసినచో, తత్ క్షణాత్ ఏవ = ఆ క్షణమే, కోటిజన్మార్జితమ్ = కోటి జన్మల కర్మఫలమైన, పాపమ్ = పాపము, నశ్యతి = నశించుచున్నది.

**తాత్పర్యం :** యోనిద్వారంలో సాధకుడు తన ముఖాన్ని ఉంచి తన ఇష్టదేవతామంత్రాన్ని పదివేలసార్లు జపించినట్లయిన, కోటి జన్మాలలో ప్రోగుబడిన పాపం నశిస్తుంది. ఆ సాధకు డొకవేళ మంత్రజపం చేసేవేళలో తాను ముఖాన్నుంచినది తన కధికారమున్న తన భార్యయోనిద్వారంలోనని, లేదా తన కధికారంలేని అన్యస్త్రీయోనిద్వారంలోనని గాని లోకబుద్ధితో ఆలోచించినట్లయితే, వానికి జపఫలం దక్కకపోగా, ఆతడు కుంభీపాక

మనబడే ఒక ప్రత్యేకమైన నరకంలో అగ్నిలో కాల్చబడుతూ మహాప్రళయం సంభవించి, సృష్టి నశించే వరకూ యాతనాదేహంతో ఉంటాడు.

ఈ దుఃస్థితి ఉత్తమసాధకులకైనా కలుగవచ్చునని, ప్రకృతిబలాన్ని తక్కువగా భావించవద్దని హెచ్చరికగా **సాధకోత్తమైః** అన్న ప్రయోగం.

**కుంభీపాక** మన్నది కొన్ని ప్రత్యేక పాపాలకు ప్రాయశ్చిత్తం కోసం కల్పించబడిన నరకం. సలసల కాగుతూన్న నూనెలో ఆ జీవుని యాతనాదేహాన్ని పడవేసి ఉడికిస్తారని శాస్త్రవచనం. ఈ శిక్ష మహాప్రళయంవరకు సాగుతుందనటం, ఈ నేరమెంత గంభీరమైనదో తెలియటానికే. ఏమంటే, ఆ సాధనలో సాధకుని భావంలో ఉండవలసినది భౌతికమైన స్త్రీయోని కానేకాదు, సమస్తసృష్టికీ జన్మస్థానమైన శక్తియొక్క సృజనాత్మక చైతన్యం మాత్రమే. కాగా, భౌతికమైన యోనిగా భావించటమొక దోషం, అందున, అహంకారమమకారాలకు తావిచ్చి స్వకీయము పరకీయమూ అన్న వ్యక్తిభావాన్ని అనుభవించటమూ, పూర్తిగా లోకాయతుడైపోవటమే కదా. అందుకే అంత శిక్ష. *

**శ్లో॥ రేతోయుక్తాని పుష్పాణి స్వపుష్పమిశ్రితాని వా ।**
**కారణేనాభిమన్త్ర్యాథ దద్యాత్ యోనౌ ప్రయత్నతః ॥ 13**

**శ్లో॥ స భవేత్ కాలికాపుత్త్ర ఇతి ఖ్యాతిముపాగతః ।**
**యోనిమూలే వసేద్గౌరీ యోన్యాఞ్చ నగనన్దినీ ॥ 14**

**ప్రతిపదార్థం :** రేతోయుక్తాని = వీర్యంతో కూడిన, పుష్పాణి = పుష్పములను, వా = లేక, స్వపుష్పమిశ్రితాని = తమంత తాముద్భవించిన పుష్పములు, కారణేన = మద్యముతో, అభిమన్త్ర్య = మంత్రించి, అథ = ఆపై, ప్రయత్నతః = ప్రయత్నించి, యోనౌ = యోనియందు లేక యోనిపై, దద్యాత్ = అర్పించదగును, సః = అట్లు అర్పించినవాడు, కాలికాపుత్త్రః = కాళీమాత కుమారుడు, భవేత్ = అగును, ఇతి = అని, ఖ్యాతిమ్ = లోకోక్తిని, ఉపాగతః = పొందియున్నాడు; యోనిమూలే = యోనిమొదట, గౌరీ = గౌరి, చ = మరియు, యోన్యామ్ = యోనిలో, నగనన్దినీ = పార్వతి, వసేత్ = నివసించును.

**తాత్పర్యం :** వీర్యంతో కూడిన పుష్పాలనుగాని, లేక, తమంత తామేర్పడిన పుష్పాలతో గాని కలిపిన వానిని మద్యంతో మంత్రించి యోనిపై ఉంచవలెను. ఈ విధంగా ఆరాధించినవాడు కాళికాపుత్త్రుడే కాగలడని ప్రతీతి. ఎందుకంటే, యోనిముఖంలో గౌరి, యోనిలో పార్వతి నివసిస్తారు.

పుష్పమంటే తంత్రశాస్త్రంలో శక్తి ఆరాధన సందర్భంలో అర్థం స్త్రీయోనినుండి రజస్వలయైనప్పుడు స్రవించే రక్తం. ఇది కాక తొమ్మిది పుష్పాలు చెప్పబడినవి :

1. ఆలింగనం, 2. చుంబనం, 3. కుచమర్దనం, 4. దర్శనం, 5. స్పర్శనం, 6. యోనిస్రావం, 7. లింగప్రవేశం, 8. లింగఘర్షణం, 9. స్థాపనం. ఇవి స్త్రీపురుషసంయోగం లోని సహజభౌతికక్రియలు. భౌతికదృష్టి విడిచి పూజాపుష్పాలుగా శక్తినారాధించటం సంప్రదాయం. ✳

**శ్లో॥ కాలీ తారా యోనిచిహ్నే కున్తలే ఛిన్నమస్తకా ।**
**బగలాముఖీ చ మాతంగీ వసేద్యోనిసమీపతః ॥ 15**

**శ్లో॥ యోనిగర్తే మహాలక్ష్మీః షోడశీ భువనేశ్వరీ ।**
**యోనిపూజనమాత్రేణ శక్తిపూజా భవేద్ధ్రువమ్ ॥ 16**

**ప్రతిపదార్థం :** యోనిచిహ్నే = యోనిచక్రంలో, కాళీ తారా = కాళికాదేవి, తారాదేవి, కున్తలే = యోనికుండలంలో, ఛిన్నమస్తా = ఛిన్నమస్తాదేవి, యోనిసమీపతః = యోని సమీపప్రాంతంలో, బగలాముఖీ = బగళాముఖీదేవి, చ = మరియు, మాతంగీ = మాతంగీదేవియు, యోనిగర్తే = యోనిగుహలో, మహాలక్ష్మీః = మహాలక్ష్మీదేవి, షోడశీ = షోడశీదేవి, భువనేశ్వరీ = భువనేశ్వరీదేవి, వసేత్ = నివసించును; యోనిపూజన-మాత్రేణ = యోనిని పూజించిన మాత్రంచేత, ధ్రువమ్ = నిశ్చయముగా, శక్తిపూజా = ఆదిశక్తిపూజ, భవేత్ = అగును.

**తాత్పర్యం :** యోనిచక్రంలో కాళీ, తారలు; యోని కుండలంలో ఛిన్నమస్తా; యోని పరిసరప్రాంతంలో బగళాముఖి, మాతంగి; యోని గర్తమున మహాలక్ష్మి, షోడశి, భువనేశ్వరీ అనబడు ఈ దేవతామూర్తులందరు నివసిస్తారు కనుక, వీరందరూ ఆదిశక్తియొక్క మూర్తివిశేషాలే కనుక, యోని (త్రికోణ) పూజ నిశ్చయంగా ఆ అష్టమాతృకల పూజ, ఆదిశక్తిపూజయే అవుతుంది అనటంలో అనౌచిత్యం లేదు. ✳

**శ్లో॥ పక్ష్యాది బలిజాతీనాం రుధిరైశ్చ ప్రపూజయేత్ ।**
**యోని యోనీతి యో వక్తి జపకాలే చ సాధకః ॥ 17**

**శ్లో॥ తస్య యోనిః ప్రసన్నా స్యాద్భుక్తిముక్తిప్రదాయినీ ।**
**యోగీ చేన్నైవ భోగీ స్యాద్భోగీ చ న తు యోగవాన్ ॥ 18**

**ప్రతిపదార్థం :** పక్షి ఆది = పక్షి మొదలగు, బలిజాతీనామ్ = నైవేద్యార్హతగల జాతులయొక్క, రుధిరైః చ = రక్తములతో కూడ, ప్రపూజయేత్ = పూజింపదగును, చ = మరియు, యోని యోని ఇతి = యోని యోని అని, జపకాలే = జపించువేళ, యః సాధకః = యే సాధకుడు, వక్తి = పలుకుచున్నాడో, తస్య = వానికి, యోనిః = యోని, ప్రసన్నా స్యాత్ = ప్రసన్నమగును, భుక్తిముక్తిప్రదాయినీ = భుక్తిని ముక్తిని ఇచ్చును, చ = మరియు,

యోగిచేత్ = యోగియైతే, న ఏవ భోగీస్యాత్ = భోగికానేకాడు, భోగీ తు = భోగియేమో, న యోగవాన్ = యోగి కాడు.

**తాత్పర్యం :** నైవేద్యార్హతగల పక్షుల, జంతువుల రక్తంతో కూడా పూజ చేయవచ్చును. జపం చేసే సమయంలో యోని యోని యని యోని నామాన్ని పలుకుతూండే సాధకునకు భుక్తిముక్తిప్రదయైన యోని ప్రసన్నమై ఉంటుంది. యోగి భోగి కానట్లే, భోగి యోగి కాడు.

**ఈ చివరి మాట** హెచ్చరిక. యోగికీ భోగికీ అంతరం చెఱుపరానిది. యోగబుద్ధినీ భోగబుద్ధినీ సంకరం చేసే పద్ధతి చేయదగినది కాదు. ఒకే సమయంలో, ఎంతటి సాధకుడైనా, యోగీ భోగీ రెండూ కాలేడు సుమా! కనుక తాను స్త్రీ సంగమం దైహికంగా చేస్తూండి కూడా భోగభావన యే మాత్రమూ లేని యోగిగా ఉండవలసిందే. దైహికక్రియ పూజావిధానంలో అంగన్యాసకరన్యాసాలను మించి మరేమీ కాదు. *

**శ్లో॥ యోగభోగాత్మకం కాలం యది యోనిప్రపూజకః ।**
**యోనిపూజాం వినా దుర్గే! సర్వపూజా వృథా భవేత్ ॥ 19**

**శ్లో॥ యోనిమధ్యే ప్రధానా చ చాణ్డాలీ గణనాయికా ।**
**తస్యాః పూజనమాత్రేణ మమ తుల్యో న సంశయః ॥ 20**

**ప్రతిపదార్థం :** దుర్గే = ఓ దుర్గా!, యోగభోగాత్మకమ్ = యోగభోగముల రెండిటిని కేంద్రముగా గల, కాలమ్ = జీవితము, యోనిప్రపూజకః యది = యోనిని పూజించువానిదైతే, యోనిపూజాం వినా = యోనిపూజ లేక, సర్వపూజా = పూజయంతయు, వృథా భవేత్ = వ్యర్థమగును, యోనిమధ్యే = యోని మధ్యప్రదేశంలో, ప్రధానా గణనాయికా = ముఖ్య గణనాయిక, చణ్డాలీ = చండాలి, చ = మరియు, తస్యాః పూజనమాత్రేణ = ఆమె పూజమాత్రంచేత, మమ = నాకు, తుల్యః = సమానుడు, న సంశయః = అనుమానము లేదు.

**తాత్పర్యం :** ఓ దుర్గా! యోనిపూజ చేసినవానికి భోగము యోగము కూడా సిద్ధిస్తవి. అట్లే, యోనిపూజ లేని పూజ నిరర్థకం. యోని మధ్యభాగంలో ప్రధాన దేవత చండాలి. ఆమె పూజచేత సాధకుడు నాకు సమానుడవుతాడు.

ప్రతి జీవికీ ఒక పరిమితకాలజీవనం విధి. ఆ కాలంలో ఐహికజీవనమూ ఉన్నదే. అది లోటు లేకుండా కామ్యపరిపూర్తి కలుగుతుంది ఆ దేవి అనుగ్రహం చేత. కాగా, ఆముష్మికఫలంగా ముక్తి లభిస్తుందని తాత్పర్యం. *

**శ్లో॥ కిం జ్ఞానైః కిం తపోదానైః కిం జపైః కిం కులామృతైః ।**
**యోనిపూజాం వినా దుర్గే! సర్వఞ్చ నిష్ఫలం భవేత్ ॥ 21**

శ్లో॥ యస్మై కస్మై న దాతవ్యం మమ సర్వస్వసాధనమ్ ।
స్వయం యద్యసమర్థస్స్యాద్యోనిపూజనతత్పరః ॥ 22

శ్లో॥ సాధకం వృణుయాద్దుర్గే! వస్త్రాలఙ్కారణాదిభిః ।
పూజయిత్వా మహాయోనిం తత్పశ్చాదన్యమణ్డలమ్ ॥ 23

**ప్రతిపదార్థం :** (హే) దుర్గే! = ఓ దుర్గా!, జ్ఞానైః = జ్ఞానములచేత, కిమ్ = ఏమి (యగును)?, తపోదానైః = తపస్సులచేత, దానములచేత, కిమ్ = ఏమి (యగును)?, జపైః = జపములచేత, కిమ్ = ఏమి (యగును), కులామృతైః = కులామృతములచేత, కిమ్ = ఏమి (యగును)?, యోనిపూజాం వినా = యోనిపూజ లేకున్న, సర్వం చ = సమస్తమున్ను, నిష్ఫలం భవేత్ = వ్యర్థమై పోవును. మమ = నాయొక్క, సర్వస్వసాధనమ్ = సాధనా సర్వస్వమైనదానిని, యోనిపూజనతత్పరః = యోనిపూజ చేయనెంచినవాడు, స్వయమ్ = తనకు తానుగా, యది అసమర్థః = పూజింప అశక్తుడైనట్లయితే, యస్మై కస్మై = ఎవరికో ఒకరికి, న దాతవ్యమ్ = ఇవ్వరాదు, వస్త్రాలఙ్కారణ ఆదిభిః = వస్త్రములు, అలంకరణ ద్రవ్యములు మొదలైనవానిచేత, సాధకమ్ = (తగిన) సాధకుని, వృణుయాత్ = నియోగించదగును, మహాయోనిమ్ = మహాయోనిని, పూజయిత్వా = పూజించి, తత్పశ్చాత్ = అటు తరువాత, అన్యమణ్డలమ్ = వేరు సాధనమండలమును.

**తాత్పర్యం :** ఓ దుర్గా! నా సాధనల సర్వస్వం యోనిపూజలో నిక్షిప్తమైయున్నది. అట్టి యోనిపూజను నిరాకరించి, ఎంతగా బహుశాస్త్రజ్ఞానాన్ని సంపాదించిననూ, తపస్సులనేక పద్ధతులలో చేసిననూ, భిన్నరీతుల దానాలు చేసిననూ, మంత్రజపములు చేసిననూ, కులామృతప్రక్రియలు సాధన చేసిననూ, సర్వమూ నిష్ఫలాయాసమే. ఏ సాధకుడైన ఒకవేళ స్వయముగా యోనిపూజ చేయలేనివాడైతే, ఆతడొక యోగ్యుడైన సాధకుని గుర్తించి, వానికి వస్త్రాలంకరణాదులిచ్చి, వానిచే యోనిపూజ నిర్వహింపజేసి, అటుపై తదితర దేవతారాధనలు చేయవచ్చును. కాని, యోనిపూజకు తానెన్నుకొనిన వ్యక్తి వాడో, వీడో, ఎవడో ఒకడు కాకూడదు సుమా!

శక్తిసాధనకు కేవల జ్ఞానమో, లేక తపస్సో, లేక మంత్రజపమో, లేక దానమో, లేక కౌలాచారప్రక్రియలో సరిపోవు. జీవి జననమరణాల మూలమైన యోనితత్త్వంతో సుసంగతం కాని సాధనలు సఫలం కావు.

శివుడు యోనిపూజ తన సర్వస్వసాధనంగా ప్రకటించటంలోని ఔచిత్యమూ ఆంతర్యమూ యేమిటి? అంటే, శివుడు శక్తిసాధకులలో సర్వప్రథముడు, సర్వోత్తముడు, వాని సాధనకు పరాకాష్ఠ శక్తిని తనలో ఇముడ్చుకునే నిమిత్తం తాను శక్తిలో ఇమిడిపోయి, తత్పరతను, తాదాత్మ్యాన్నీ సాధించి, శక్తినుండి విడదీయరాని వాడైనాడు. అర్ధనారీశ్వర తత్త్వంగా విలసిల్లుతూన్నాడన్న సత్యాన్ని లోకం మరువరాదన్నదే.

**'శివః శక్త్యాయుక్తో....'** – సౌందర్యలహరి (1) శ్లోకమిచట అనుసంధానం చేసుకొనదగును. *

**శ్లో॥ దణ్డవత్ప్రణిపత్యాథ యోనిముద్రాం నిరీక్షయేత్ ।**
**యస్య యోనౌ సదా భక్తిః సాధనే చ తథా ప్రియే ॥ 24**

**శ్లో॥ తస్య దుర్గా ప్రసన్నా స్యాత్ కిమన్యైర్బహుభాషితైః ।**
**క్షతయోనిః పూజితవ్యా చాక్షతాం నైవ పూజయేత్ ।**
**అక్షతాం పూజనాద్దేవి! సిద్ధిహానిః పదే పదే ॥ 25**

**ప్రతిపదార్థం :** ప్రియే = ఓ ప్రియురాలా!, అథ = ఆ తరువాత, దణ్డవత్ ప్రణిపత్య = దండప్రణామమాచరించి, యోనిముద్రామ్ = యోనిముద్రను, నిరీక్షయేత్ = ఏకాగ్రముగా చూడవలెను, యస్య = ఎవనికి, సదా = ఎల్లప్పుడు, యోనౌ = యోనియందు, సాధనే చ = సాధన చేయుటలోను, భక్తిః స్యాత్ = భక్తియుండునో, తస్య = వానికి, దుర్గా = దుర్గాదేవి, ప్రసన్నా స్యాత్ = ప్రసన్నయగును, అన్యైః = ఇతరములైన, బహుభాషితైః = పలు మాటల చేత, కిమ్ = ఏమి ప్రయోజనము?, పూజితవ్యా = పూజింపదగినది, క్షతయోనిః = తన కులకాంత యోనియే, అక్షతామ్ = అజ్ఞాతయైన పరస్త్రీయోని, న ఏవ పూజయేత్ = పూజింపనే రాదు, దేవి = ఓ దేవీ!, అక్షతామ్ = అజ్ఞాతపరస్త్రీ యోనిని, పూజనాత్ = పూజించుటవలన, పదే పదే = అడుగడుగున, సిద్ధిహానిః = ఫలసిద్ధివిషయమున నష్టము (కలుగును).

**తాత్పర్యం :** ఓ ప్రియురాలా! ఆ పూజావిధి ముగిసిన తరువాత దండప్రణామమాచరించి, యోనిముద్రదర్శనం చేసికొనవలె. యోనియందు, సాధనయందు భక్తి గలవానికి దుర్గాదేవి ప్రసన్నయై ఉంటుంది. వేయి మాటలేల? తన కులకాంతయోని పూజింపదగినది. పరస్త్రీయోనిని పూజింపరాదు. ఏలన, పరస్త్రీయోనిపూజనంవలన ఫలసిద్ధికి అడుగడుగున హాని కలుగుతుంది.

దండప్రణామం అంటే నిటారుగా బోర్లా పడుకుని నమస్కరించటం. కఱ్ఱవలె ఉండటం వలన **దండప్రణామంగా** ప్రసిద్ధి. అష్టాంగప్రణామం.

**యోనిముద్రాం అన్నప్పుడు** వాచ్యార్థాన్ని యథాతథంగా స్వీకరిస్తే, యోనిముద్రను పట్టి, చిటికెనవ్రేళ్ళను కలిపి, చూపుడువ్రేళ్ళనూ ఉంగరం వ్రేళ్ళనూ కలిపి బంధించి, నడిమి వ్రేలిని కొంచెం ఉంగరపువ్రేలితో సంధానం చేసి, నిటారుగా ఉంచి, రెండు బొటనవ్రేళ్ళను ఒకదానిపై నొకటి ఉంచి, ఈ యోనిముద్రను దర్శించుట. *

**ఇతి యోనితన్త్రే తృతీయోధ్యాయః సమ్పూర్ణమ్ ॥**

---

# చతుర్థోఽధ్యాయః

**శివ ఉవాచ = శివుడిట్లనెను :**

**శ్లో॥ మహాచీనక్రమోక్తేన సర్వం కార్యం జపాదికమ్ ।**
**ఇతి తే కథితం దేవి! యోనిపూజావిధిర్మయా ॥ 1**

**శ్లో॥ సుగోప్యం యది దేవేశి! తవ స్నేహాత్ప్రకాశితమ్ ।**
**కోచాఖ్యానే చ దేశే చ యోనిగర్తాసమీపతః ॥ 2**

**శ్లో॥ గంగాయాః పశ్చిమే భాగే మాధవీ నామ విశ్రుతా ।**
**తత్ర చాహర్నిశం దేవి! యోనిపూజనతత్పరః ।**
**భిక్షాచారప్రసంగేన గచ్ఛామి చ దివానిశమ్ ॥ 3**

**ప్రతిపదార్థం :** దేవి! = ఓ దేవీ!, మయా = నాచేత, యోనిపూజావిధిః = యోనిని పూజించు పద్ధతి, జపాదికమ్ = జపము మొదలగునవి, సర్వమ్ = అన్నియు, మహాచీనక్రమోక్తేన = మహాచీనతంత్రంలో చెప్పబడిన విధానము ననుసరించి, కార్యమ్ = చేయదగినది, ఇతి = అని, తే = నీకు, కథితమ్ = చెప్పబడినది, దేవేశి! = ఓ దేవదేవుని హృదయేశ్వరీ!, సుగోప్యం యది = అతిరహస్యమైనను, తవ స్నేహాత్ = నీయొక్క స్నేహమువలన, ప్రకాశితమ్ = బయలుపరుపబడినది, చ = మరియు, కోచాఖ్యానే దేశే = కోచమను పేరుగల దేశమున, యోనిగర్తాసమీపతః = యోనిగర్తమునకు దగ్గరగా, గంగాయాః = గంగకు, పశ్చిమే భాగే = పడమటి దిక్కున, మాధవీ నామ = మాధవియను పేరుతో, విశ్రుతా = ప్రఖ్యాతమైనది, దేవి = ఓ దేవీ!, యోనిపూజనతత్పరః = యోనిపూజనతత్పరుడనై, అహర్నిశం చ = రేబవళ్ళును, భిక్షాచారప్రసంగేన = భిక్షాటన చేయు నిమిత్తము, అనిశమ్ = ఎప్పుడును, దివా = పగటివేళ, తత్ర = ఆ క్షేత్రమునకు, గచ్ఛామి = పోవుదును.

**తాత్పర్యం :** దేవదేవుని ఇల్లాలా! ఓ దేవీ!, నేను చెప్పిన యోనిపూజావిధానం అంతా, జపం మొ॥ విధులన్నీ, మహాచీనతంత్రంలో చెప్పబడినట్లు చేయదగినవి. ఇది అతిరహస్యంగా కాపాడదగినదే, అయినప్పటికి నీయందలి ప్రేమవలన విప్పి చెప్పినాను, కోచదేశంలో గంగానదీతీరాన పడమటి భాగంలో, యోనిగర్తసమీపంలో, ప్రసిద్ధమైన యోనిపూజాక్షేత్రంగా మాధవీక్షేత్రం ఉన్నది. అక్కడ నేను పగటివేళ ఎప్పుడూ భిక్షాటన చేస్తూ తిరుగుతూంటాను, యోనిపూజాతత్పరుడనై రాత్రింబవళ్ళు వెళ్ళుతూంటాను.

గంగ ప్రవహించే కోచదేశం ఈనాడు కామాఖ్యపీఠం పేరుతో పిలువబడుతూ కామరూప దేశంలో ఉన్నది కావచ్చును. ఆ శక్తిపీఠం లోని దేవతపేరు మాధవి కావచ్చు. *

**శ్లో॥ మాధవీసదృశీ యోనిర్నాస్తి యోనిర్మహీతలే ।**
**తత్కుచౌ కఠినౌ దుర్గే! యోనిస్తస్యాః సుపీనతా ॥ 4**

**శ్లో॥ తస్యాః పూజనమాత్రేణ శివోఽహం శృణు పార్వతి! ।**
**రాధాయోనిం పూజయిత్వా కృష్ణః కృష్ణత్వమాగతః ॥ 5**

**ప్రతిపదార్థం :** దుర్గే! = ఓ దుర్గా!, మహీతలే = భూలోకంలో, మాధవీసదృశీ = మాధవిని పోలిన, యోనిః = శక్తిపీఠము, నాస్తి = లేదు. తత్‌కుచౌ = ఆ దేవత చనులు, కఠినౌ = గట్టివి, తస్యాః = ఆమెయొక్క, యోనిః = యోని, సుపీనతా = బాగుగా బలమైనది. తస్యాః = ఆమెయొక్క, పూజనమాత్రేణ = పూజచేయుటచేత, అహమ్ = నేను, శివః = శివుడను, పార్వతి = ఓ పార్వతీ!, శృణు = వినుము, రాధాయోనిమ్ = రాధయోనిని, పూజయిత్వా = పూజించి, కృష్ణః = కృష్ణుడు, కృష్ణత్వమ్ = కృష్ణస్వభావమును, ఆగతః = పొందినవాడాయెను.

**తాత్పర్యం :** మాధవిని పోలిన శక్తిపీఠము భూమ్మీద లేదు. ఆ పీఠంలోని దేవతా కుచములు కఠినములు, యోని చాలా బలమైనది. విను పార్వతీ! ఆమెను పూజించిన మాత్రంచేత నేను శివుడనైనాను. అట్లే రాధయోనిని పూజించి కృష్ణుడు కృష్ణుడైనాడు. *

**శ్లో॥ శ్రీరామో జానకీనాథః సీతాయోనిప్రపూజకః ।**
**రావణం సకులం హత్వా పునరాగత్య సున్దరి! ॥ 6**

**శ్లో॥ అయోధ్యాం నగరీం రమ్యాం వసతిం కృతవాన్ స్వయమ్ ।**
**సముద్రస్య మహావిష్ణుర్వేలాయాం వటమూలతః ॥ 7**

**ప్రతిపదార్థం :** సున్దరి! = ఓ సుందరీ!, జానకీనాథః = జానకి భర్తయైన, శ్రీరామః = శ్రీరాముడు, సీతాయోనిప్రపూజకః = సీతయోనిని పూజించినవాడై, రావణమ్ = రావణుని, సకులమ్ = రాక్షసకులముతోసహా, హత్వా = చంపి, పునః = మరల, ఆగత్య = వచ్చి, రమ్యామ్ = అందమైన, అయోధ్యాం నగరీమ్ = అయోధ్యానగరిని, వసతిమ్ = నివాసముగ, కృతవాన్ = చేసికొన్నవాడాయెను, స్వయమ్ = స్వయముగ, మహావిష్ణుః = మహావిష్ణువు, సముద్రస్య = సముద్రముయొక్క, వేలాయామ్ = తీరప్రాంతమందలి, వటమూలతః = వటవృక్షమువరకు (ఆక్రమించెను).

**తాత్పర్యం :** ఓ సుందరీ! జానకిపతి శ్రీరాముడు సీతాయోనిని శక్తిపీఠముగ పూజించి తత్ఫలముగనే రావణాసురుని వంశనాశము గావించి, తిరిగి అందమైన అయోధ్యానగరికి వచ్చి నివాసమేర్పరచుకున్నవాడాయెను. మహావిష్ణువు స్వయంగా త్రికోణగర్తమును పూజించి, సముద్రతీరమున వటవృక్షమును చేరి విశ్రాంతుడాయెను.

పురాణపురుషుల విజయానికి కారణం వారు తమ తమ భార్యల యోనులను తాత్త్విక దృష్టితో ఆరాధించి పొందిన శక్తియే, అని తాత్పర్యం. మహావిష్ణువు మహా–ప్రళయానంతరము వటపత్రశాయియై కేవలుడై యుండెనన్న గాథను స్మరింపజేసేదే సముద్రయోని (త్రికోణగర్తం) పూజనంగా సమంజసం. సృష్టిసమస్తం నామరూప–రహితంగా నశించిన వేళ మిగిలింది జలతత్త్వము, విష్ణుత్వము మాత్రమే. అవియే పునఃసృష్టికి మూలమైనవి. *

**శ్లో॥ భగినీయోనిమాశ్రిత్య బలదేవస్తు భైరవః ।**
**లక్ష్యా సుదర్శనే నాపి తిష్ఠత్యేకోఽ కుతోభయః ॥ 8**

**శ్లో॥ అహం విష్ణుశ్చ బ్రహ్మా చ మునయశ్చ మహాశయాః ।**
**ఆబ్రహ్మస్తమ్బపర్యన్తం యోనౌ సర్వం ప్రజాయతే ॥ 9**

**ప్రతిపదార్థం :** బలదేవః తు = బలదేవుడైతే, భగినీయోనిమ్ = చెల్లెలైన సుభద్రశక్తిని, ఆశ్రిత్య = ఆశ్రయించి, భైరవః = భైరవత్వముగల్గి, లక్ష్మ్యా = లక్ష్మిచేత, సుదర్శనేన అపి : సుదర్శన = సుదర్శనచక్రముచేత గూడ, అకుతోభయః = భయములేనివాడగు, ఏకః = ఒక్కడై, తిష్ఠతి = నిలిచియుండును, చ = మరియు, అహమ్ = నేను, విష్ణుః = విష్ణువు, బ్రహ్మా చ = బ్రహ్మయు, మహాశయాః = గొప్ప ఆశయములుగల, మునయః చ = మునులున్ను, ఆబ్రహ్మస్తమ్బపర్యన్తమ్ = బ్రహ్మ మొదలు గడ్డిదుబ్బవరకు, సర్వమ్ = సమస్తము, యోనౌ = యోనియందు, ప్రజాయతే = పుట్టుచున్నది.

**తాత్పర్యం :** బలరాముడు తన చెల్లెలి శక్తినాశ్రయించి భయమెఱుగని ఏకైకవ్యక్తియై భైరవత్వాన్ని పొందినాడు. ఆతడు లక్ష్మికిగాని సుదర్శనచక్రానికిగాని భయపడడు. నేను, విష్ణువు, బ్రహ్మ, మహాశయులు, మునులు, బ్రహ్మ మొదలు గడ్డిదుబ్బువరకు అన్నీ శక్తియందే పుట్టుతూన్నవి.

సుదర్శనచక్రం వలన భయం సహజం, అది శిక్షించేది కనుక. లక్ష్మి భయంకరి ఎట్లా అవుతుంది?! ఆమె ప్రసన్నత తొలగితే ఇహపరాలు రెండున్నూ కటికచీకటియే కదా. కాని బలరామునకు నిర్భయత్వం శక్తిసాధనవలన, కనుక భైరవత్వం కలిగింది.

శక్తివిస్ఫోటనం కారణంగా పదార్థప్రాణసృష్టి జరిగింది కనుక శక్తియే సర్వయోని. మరల పదార్థవిస్ఫోటనంతో సృష్టి అంతమవుతుంది కనుక ఆ విస్ఫోటక శక్తియే లయకారి, శ్మశానసంకేతంగా శాక్తేయదర్శనం. *

**శ్లో॥ యోనితత్త్వస్య మాహాత్మ్యం కో వదేద్భువనత్రయే ।**
**మద్యం మాంసం తథా మత్స్యం ముద్రా మైథునమేవ చ ।**
**పఞ్చతత్త్వం వినా దేవి సర్వఞ్చ నిష్ఫలం భవేత్ ॥ 10**

**ప్రతిపదార్థం :** భువనత్రయే = మూడులోకాలలో, కః = ఎవడు, యోనితత్త్వస్య = యోనితత్వముయొక్క, మాహాత్మ్యమ్ = మాహాత్మ్యమునుగూర్చి, వదేత్ = చెప్పగలడు? పఞ్చతత్త్వమ్ = ఐదు తత్త్వములైన, మద్యమ్ = మద్యము, మాంసమ్ = మాంసము, తథా = అట్లు, మత్స్యమ్ = మీనము, ముద్రా = ముద్ర, చ = మరియు, మైథునం ఏవ = మైథునములే, వినా = లేక, దేవి = ఓ దేవీ!, సర్వం చ = అంతయు, నిష్ఫలమ్ = ఫలితములేనిది, భవేత్ = అగును.

**తాత్పర్యం :** ఓ దేవీ! యోనితత్త్వాన్ని గురించి సమగ్రంగా తెలిసి దాని మాహాత్మ్యమును గూర్చి వివరించగలవాడు మూడులోకాలలోనూ ఒక్కడైన లేడు. మద్యం, మాంసం, మత్స్యం, ముద్రా, మైథునం అను ఐదు పంచతత్త్వాలు. ఇవి లేకుండ చేసే సాధన ఫలితమివ్వదు.

**భువనత్రయమ్ :** భూః, భువః, సువః – భూలోక, భువర్లోక, సువర్లోకాలు. ✻

**శ్లో॥ సర్వేభ్యశ్చోత్తమా వేదా వేదేభ్యో వైష్ణవం పరమ్ ।**
**వైష్ణవాదుత్తమం శైవం శైవాద్దక్షిణముత్తమమ్ ॥ 11**

**శ్లో॥ దక్షిణాదుత్తమం వామం వామాత్సిద్ధాన్తముత్తమమ్ ।**
**సిద్ధాన్తాదుత్తమం కౌలం తత్రాపి యోనిలంపటః ॥ 12**

**ప్రతిపదార్థం :** వేదాః = వేదములు, సర్వేభ్యః చ = అన్నిటికంటెను, ఉత్తమాః = ఉత్తమములు, వేదేభ్యః = వేదములకంటె, వైష్ణవమ్ = వైష్ణవము, పరమ్ = శ్రేష్ఠము, వైష్ణవాత్ = వైష్ణవముకంటె, శైవమ్ = శైవము, ఉత్తమమ్ = ఉత్తమము, శైవాత్ = శైవముకంటె, దక్షిణమ్ = దక్షిణాచారము, ఉత్తమమ్ = ఉత్తమము, దక్షిణాత్ = దక్షిణాచారముకంటె, వామమ్ = వామాచారము, ఉత్తమమ్ = శ్రేష్ఠము, వామాత్ = వామాచారముకంటె, సిద్ధాన్తమ్ = సిద్ధాన్తాచారము, ఉత్తమమ్ = శ్రేష్ఠము, సిద్ధాన్తాత్ = సిద్ధాన్తాచారముకంటె, కౌలమ్ = కౌలాచారము, ఉత్తమమ్ = శ్రేష్ఠము, తత్ర అపి = ఆ కౌలాచారములో కూడ, యోనిలంపటః = యోనిపూజనము (త్రికోణపూజనము శ్రేష్ఠము).

**తాత్పర్యం :** లౌకికశాస్త్రాలన్నిటికంటె వేదాలు, వేదాలకంటె వైష్ణవమతము, వైష్ణవానికంటె శైవము, శైవమతం కంటె దక్షిణాచారము, దక్షిణాచారం కంటె వామాచారము, వామాచారం కంటె సిద్ధాన్తాచారము, సిద్ధాన్తాచారం కంటె కౌలాచారము, ఆ కౌలాచారంలో కూడ యోనిపూజనం, ఉత్తరోత్తరం శ్రేష్ఠం.

వేదాలు లౌకికార్థసాధనకు యజ్ఞయాగాలను, పరిమార్థసాధనకు ఉపనిష ణ్మార్గాన్నీ ప్రతిపాదించినవి, కనుక అవి లౌకికశాస్త్రాలకంటె శ్రేష్ఠమైనవి. వేదోపనిషదర్థాన్ని

పిండితార్థంగా శ్రీరామానుజవైష్ణవం ప్రతిపాదించింది, కనుక వైష్ణవం శ్రేష్ఠం. ఐహికత్యాగాన్నీ పూర్ణవైరాగ్యాన్నీ బోధించే శైవం అంతకంటె శ్రేష్ఠం. శైవం కంటె శాక్తేయం ఉత్తమం, శివకేశవులిద్దరే కాదు, చరాచరసృష్టిసమస్తమూ, సర్వలోకాలూ శక్తిప్రసవాలు, శక్తిప్రలీయములూ కనుక. శాక్తేయంలో ఆచారభేదాన్ని బట్టి శాఖలున్నాయి. అవే దక్షిణాచారం, వామాచారం, సిద్ధాన్తాచారం, కౌలాచారం, అనబడుతూన్నవి. కౌలాచారంలో భాగమైనది యోనిపూజన సంప్రదాయం. ✻

**శ్లో॥ సూర్యఖద్యోతయోర్యద్వన్మేరుసర్షపయోరివ ।**
**కులీనస్సర్వవిద్యానామధికారీతి గీయతే ॥ 13**

**శ్లో॥ యది భాగ్యవశేనాపి కులీనదర్శనం లభేత్**
**భక్ష్యైర్భోజ్యైశ్చ సన్తోష్య ప్రార్థయేద్బహుయత్నతః ।**
**ఆగచ్ఛ సాధకశ్రేష్ఠ! యోనిపూజనతత్పరః**
**తవ దర్శనమాత్రేణ కృతార్థోఽస్మి న సంశయః ॥ 14**

**ప్రతిపదార్థం :** యద్వత్ = యేరీతిగా, సూర్య = సూర్యుడు, ఖద్యోతయోః = నక్షత్రము, ఈ రెండింటికి, మేరు = సుమేరుపర్వతము, సర్షపయోః = ఆవగించ, ఈ రెంటికి, ఇవ = వలె, కులీనః = కౌలాచారమునందున్నవాడు, సర్వవిద్యానామ్ = అన్నివిద్యలకు, అధికారీ = అధికారి, ఇతి = అని, గీయతే = చెప్పబడుచున్నది, భాగ్యవశేన అపి = భాగ్యం చైతనైనను, కులీనదర్శనమ్ = కౌలాచారిదర్శనము, యది లభేత్ = లభించినట్లయిన, భక్ష్యైః = భక్ష్యములచే, భోజ్యైః = భోజ్యములచే, సంతోష్య = సంతోషపెట్టి, బహుయత్నతః = అనేకవిధములుగా, యోనిపూజనతత్పరః = యోనిపూజకుడు, ప్రార్థయేత్ = ప్రార్థింపదగును, ఆగచ్ఛ = రమ్ము, సాధకశ్రేష్ఠ = ఓ సాధకోత్తమా!, తవ = నీయొక్క, దర్శనమాత్రేణ = దర్శనమాత్రంచేత, కృతార్థః అస్మి = ధన్యుడనైనాను, న సంశయః = సందేహము లేదు, (ఇతి = అని)

**తాత్పర్యం :** సూర్యుడు నక్షత్రముకంటె ఎట్లధికుడో, సుమేరు పర్వతము ఆవగింజకంటె ఎట్లధికమైనదో, అట్లే కౌలాచారమందున్నవాడు అధికుడై అన్ని విద్యలకు అధికారియగును. అదృష్టవశాన కౌలాచారిదర్శనం లభిస్తే భక్ష్యభోజ్యాలతో అతనిని సంతోషపెట్టి పరిపరి విధముల "సాధకోత్తమ! రండు, రండు! తమ దర్శనమాత్రమున నేను ధన్యుడనైనాను, సంశయము లేదు" అని ప్రార్థించవలె.

సర్వవిద్యానాం అంటే, సందర్భోచితమైన అర్థం అన్ని మంత్రవిద్యలు అని. **కౌలాచారశాక్తేయం కుండలినీశక్తిసాధకం**. దానికి **మహావిద్య**యని పేరు. దాని కధికారి కాగా మిగత విద్యలకధికారం సహజసిద్ధం, అని భావం.

భక్ష్యము అంటే పంటితో కొరికి తినదగిన పదార్థం. భోజ్యము అంటే నమిలి తినవలసినది. *

**శ్లో॥ పశునా సహ సంలాపః పశుసంసర్గ ఏవ చ ।**
**యది దైవాన్మహాదేవి! యోనిదర్శనతత్పరః ।**
**తిలకం యోనితత్త్వేన తదా శుద్ధో భవిష్యతి ॥ 15**

**ప్రతిపదార్థం :** మహాదేవి! = ఓ మహాదేవీ!, పశునా సహ = పశువుతో (జీవునితో), సంలాపః = ముచ్చటించటం, పశుసంసర్గ ఏవ = సంయోగమే, చ = మరియు, దైవాత్ = అదృష్టవశమున, యోనిదర్శనతత్పరః = శక్తిదర్శనతత్పరుడైనవాడు, యోనితత్త్వేన = యోనితత్త్వాన్ని బుద్ధియందుంచి, యది తిలకం (ధార్యతే) = తిలకమును ధరింపజేయ బడినట్లయిన, తదా = అప్పుడు, శుద్ధః = పరిశుద్ధుడు, భవిష్యతి = అగుచున్నాడు.

**తాత్పర్యం :** ఓ మహాదేవీ! ఒక జీవితో ముచ్చటించటం అంటే ఆ జీవితో సంయోగం పొందినట్లే అవుతుంది. అదృష్టవశాన, శక్తిదర్శనతత్పరుడు కౌలాచారపరునిచేత తిలకధారణ చేయించుకోగలిగినట్లయితే, జీవవిషయప్రసంగంవలన కలిగిన దోషం శుద్ధియవుతుంది. *

**శ్లో॥ కుమారీపూజనం దుర్గే! కులీనభోజనం తథా ।**
**ప్రధానద్వయమేవాస్మిన్ గ్రన్థేష్వపి చ సునిశ్చితమ్ ॥ 16**

**శ్లో॥ అంతః శాక్తా బహిః శైవాః సభాయాం వైష్ణవా మతాః ।**
**నానావేశధరాః కౌలాః విచరన్తి మహీతలే ॥ 17**

**ప్రతిపదార్థం :** దుర్గే = ఓ దుర్గా!, కుమారీపూజనమ్ = కుమారిని పూజించటము, తథా = అట్లే, కులీనభోజనమ్ = కౌలాచారుని భోజనము, సునిశ్చితమ్ = నిస్సంశయముగ, అస్మిన్ గ్రన్థేషు అపి = ఈ (తంత్రశాస్త్ర) గ్రంథాలలో కూడ, ప్రధానద్వయం ఏవ = ముఖ్యమైనవి రెండే, చ = మరియు, అంతః = లోపల, శాక్తాః = శాక్తేయులు, బహిః = వెలుపల, శైవాః = శైవులు, సభాయామ్ = సభలో, వైష్ణవాః = వైష్ణవులుగా, మతాః = తలంచబడుచూ, నానావేశధరాః = అనేక వేషములను ధరించి, కౌలాః = కౌలాచారులు, మహీతలే = భూమిపై, విచరన్తి = ద్రిమ్మరుచుందురు.

**తాత్పర్యం :** ఓ దుర్గా! కుమారీపూజ, కౌలభోజనం ఈ రెండే తంత్రశాస్త్రగ్రంథాలలో ప్రధానాంశాలుగా పేర్కొనబడినవి. **కౌలాచారులు లోపల శాక్తేయులైయుండి, పైకి శైవులుగా ప్రవర్తిస్తూ, సభలో వైష్ణవులుగా మాట్లాడుతూ, అట్లే భావించబడుతూ, అనేక వేషధారులై భూమిపై తిరుగుతూంటారు.**

కుమారీ అని దుర్గాదేవి పేరు. కనుక దుర్గాపూజ చెప్పబడింది. అయితే, దుర్గాదేవిగా భావింపబడుతూ 12 సం.ల వయస్సు గలిగి అవివాహితయైన ఆడపిల్లను పూజించటం కద్దు. ఆ బాలికకున్నూ కుమారియని పేరు.

**కౌలం** అంటే కులసంబంధమైనది. కులం అంటే, **కులం శక్తిరితి ప్రోక్తం, అకులం శివ ఉచ్యతే । కులేఽకులశ్చ సంబంధః కౌలమిత్యభిధీయతే ॥**, అన్న ప్రమాణాన్ని బట్టి **కులం శక్తిగాను, అకులం శివుడుగాను భావింపబడుతున్నందున, శివశక్తుల సంయోగమే కౌలం అని నిర్వచనం.** ఇట్లా కౌలాచారి శాక్తేయుడు, శైవుడూ కూడా. శక్తియొక్క అభివ్యక్తియే ప్రకృతి, సృష్టి. దాని నధిష్ఠించియున్నది శివుడు కనుక వీరిద్దరూ శాశ్వతులే అన్న విశిష్టాద్వైతవైష్ణవం వీరికి సమర్థనీయమే. లోకప్రసిద్ధమైన మతత్రయం వీరి కనుసరణీయమే. ఇది, **నానావేశధరాః** అనటంలోని ఔచిత్యం. ✳

శ్లో॥ **జన్మాన్తరసహస్రేషు యస్య వంశే ప్రజాయతే ।**
**కులీనస్తత్ కులం జ్ఞేయం పవిత్రం నగనన్దిని! ॥** **18**

శ్లో॥ **పాదప్రక్షాలనం యత్ర కులీనః క్రియతే యది ।**
**తస్య దేహశ్చ గేహశ్చ పవిత్రఞ్చ న సంశయః ॥** **19**

**ప్రతిపదార్థం :** నగనన్దిని! = ఓ పార్వతీ!, యస్య = ఎవనియొక్క, వంశే = వంశమున, జన్మాంతరసహస్రేషు = వేయితరములలో, కులీనః = కౌలాచారముగలవాడు, ప్రజాయతే = జన్మించునో, తత్‌కులమ్ = ఆ వంశము, పవిత్రమ్ = పవిత్రమైనదిగా, జ్ఞేయమ్ = తెలియదగును. కులీనః = కౌలాచారపరాయణుడు, పాదప్రక్షాలనమ్ = కాళ్ళుకడుగుట, యత్ర = ఎక్కడగాని, యది క్రియతే = చేసినట్లయితే, తస్య = వానియొక్క, గేహః చ = ఇల్లునూ, దేహః చ = శరీరమున్నూ, పవిత్రం చ = పవిత్రమే, న సంశయః = సందేహము లేదు.

**తాత్పర్యం :** ఓ పార్వతీ! ఏ వంశంలో వెయ్యి తరములు కౌలము నాశ్రయించినవాడు జన్మించునో, ఆ వంశము పవిత్రమైనదని ఎఱుగ దగినది. కౌలాచారతత్పరుడెవని యింట కాళ్ళు కడుగునో, ఆ ఇల్లు పవిత్రము, ఆ ఇంటి యజమాని పవిత్రుడు. ఈ విషయంలో సందేహం లేదు. ✳

శ్లో॥ **యోనిలమ్పటః కులీనశ్చ యస్మిన్ దేశే విరాజతే ।**
**స దేశః పూజ్యతే దేవైర్బ్రహ్మవిష్ణుశివాదిభిః ॥** **20**

శ్లో॥ **కులీనం ప్రతి దానఞ్చ చానన్తాయోపపద్యతే ।**
**పశుహస్తే ప్రదానఞ్చ సర్వత్ర నిష్ఫలం భవేత్ ॥** **21**

**ప్రతిపదార్థం :** యోనిలమ్పటః = శివపూజకుడైన, కులీనః = కౌలాచారసంపన్నుడు, యస్మిన్ దేశే = ఏ దేశమందు, విరాజతే = నివసించునో, సః దేశః = ఆ దేశము, బ్రహ్మ = బ్రహ్మ, విష్ణు = విష్ణువు, శివ = శివుడు, ఆదిభిః = మొదలగు, దేవైః = దేవతలచేత, పూజ్యతే = పూజించబడును, చ = మరియు, కులీనం ప్రతి = కౌలాచార తత్పరునకిచ్చు, దానం చ = దానమున్నూ, అనన్తాయ = అనంతఫలమును, ప్రతిపద్యతే = కలిగించును, పశుహస్తే = సాధారణ జీవబుద్ధిగలవానికి, ప్రదానం చ = ఇవ్వబడిన దానమేమో, సర్వత్ర = అన్నిట, నిష్ఫలమ్ = ఫలవంతము కానిది, భవేత్ = అగును.

**తాత్పర్యం :** శక్తిపూజకుడైన కౌలాచారసంపన్నుడే దేశంలో నివసిస్తాడో, ఆ దేశం త్రిమూర్తులకూ తక్కిన దేవతలకు గూడ పూజనీయమవుతుంది. కౌలాచారికిచ్చిన దానం అనంతఫలప్రదం కాగా కేవల జీవబుద్ధిగలవానికిచ్చిన దానం పూర్తిగా నిష్ఫల మవుతుంది. *

**శ్లో॥ కులీనస్య చ మాహాత్మ్యం మయా వక్తుం న శక్యతే ।**
**కులీనఞ్చాపి సంతోష్య ముక్తః కోటికులైః సహ ॥ 22**

**శ్లో॥ కేవలం కులయోగేన ప్రసీదామి న సంశయః ।**
**చతుర్థాశ్రమిణాం మధ్యే చావధూతాశ్రమో మహాన్ ॥ 23**

**ప్రతిపదార్థం :** చ = మరియు, కులీనస్య = కౌలాచారునియొక్క, మాహాత్మ్యమ్ = మహత్వము, మయా = నాచేత, వక్తుమ్ = చెప్పుటకు, న శక్యతే = అలవికాదు, అపి చ = పైగా, కులీనమ్ = కౌలాచారుని, సంతోష్య = సంతోషపెట్టి, కోటికులైః సహ = కోటిమంది కులజులతో కూడ, ముక్తః = ముక్తుడు (అగును), (అహం = నేను), కులయోగేన కేవలమ్ = కులయోగం చేత మాత్రమే, ప్రసీదామి = ప్రసన్నుడనగుచున్నాను, న సంశయః = సందేహము లేదు, చతుర్థాశ్రమిణాం మధ్యే = సన్యాసులందరిలో, అవధూతాశ్రమః = అవధూతాశ్రమము, మహాన్ = గొప్పది.

**తాత్పర్యం :** కౌలాచారతత్పరుని శక్తి ఇంతయని వివరించటం నాకు సాధ్యం కాదు. వానిని సంతోషపెట్టిన ఫలంగా తాను ముక్తుడు కావటమే కాక తన వంశం వారిని కోటి మందిని కూడ ముక్తులను చేస్తాడు. నేను అటువంటి కులాచారునికి మాత్రమే ప్రసన్నుడనవుతాను. నిస్సంశయంగా సంన్యాసాశ్రమం స్వీకరించినవారిలోకెల్ల అవధూతాశ్రమం గొప్పది.

బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సంన్యాసాశ్రమాలు నాలుగిటిలో చివరిది కనుక సంన్యాసం చతుర్థాశ్రమం. అవధూత దిగంబరసంన్యాసి, 'అహం' స్వరూపము నెరిగినవాడు. *

**శ్లో॥ తత్రాహం కులయోగేన మహాదేవత్వమాగతః ।**
**తత్రాపి చ మహాదేవి! యోనిపూజనతత్పరః ॥ 24**

**శ్లో॥ తవ యోనిప్రసాదేన త్రిపురం హతవాన్ పురా ।**
**ద్రౌపదీయోనిమాశ్రిత్య పాణ్డవా జయినో రణే ॥ 25**

**ప్రతిపదార్థం :** అహమ్ = నేను, తత్ర కులయోగేన = ఆ శక్తిసంయోగముచేత, మహాదేవత్వం ఆగతః = మహాదేవత్వమును పొందినవాడనైనాను. మహాదేవి! = ఓ మహాదేవీ!, తత్ర అపి చ = ఆ మహాదేవత్వమునందుండియును, యోనిపూజనతత్పరః = యోనిపూజలో నిమగ్నుడనై, తవ = నీయొక్క, యోనిప్రసాదేన = శక్తి ప్రసన్నతవలన, పురా = పూర్వము, త్రిపురమ్ = త్రిపురాసురులను, హతవాన్ = నాశము జేసినాను. పాణ్డవాః = పాండవులు, ద్రౌపదీయోనిమ్ = ద్రౌపది శక్తిని, ఆశ్రిత్య = ఆశ్రయించి, రణే = యుద్ధమున, జయినః = జయమునందిన వారైరి.

**తాత్పర్యం :** కులయోగంతో నేను మహాదేవుడనైనాను. ఆ మహాదేవత్వంలో కూడ, శక్తిపూజను వదలక చేయుచున్నాను. నీ శక్తి ప్రభావంతోనే పూర్వం త్రిపురాసురసంహారం చేసినాను. పాండవులు యుద్ధంలో గెలిచినది ద్రౌపదీశక్తితోనే.

మహాదేవత్వం అన్నది దేవతలలో శ్రేష్ఠుడన్న గుర్తింపు. ఇది శక్తిమంతుడన్న గుర్తింపు. ఆ శక్తికి మూలం మహాదేవియైన దుర్గ. త్రిపురుని సంహరించిన శక్తి ఆమెయే. మయుడనే దానవుడు బంగారంతో ఒకటి, వెండితో ఒకటి, ఇనుముతో ఒకటి, మూడు పురములను నిర్మించి ఇవ్వగా, వానిలో దానవులు ఆశ్రయం పొంది, అజేయులై లోకాలను పీడించ నారంభించగా, దేవతల కోరిక మేరకు మహాదేవుడు వారిని ఆ పురములతో సహా నాశము జేసినట్లు పురాణోక్తి. *

**శ్లో॥ అభావే కన్యకాయోనిం వధూయోనిం తథైవ చ ।**
**భాగినీయోనిమాశ్రిత్య శిష్యాణాం యోనిమాశ్రయేత్ ॥ 26**

**శ్లో॥ ప్రత్యహం పూజయేద్యోనిమన్యథా యన్త్రమర్చయేత్ ।**
**వృథా పూజా న కర్తవ్యా యోనిపూజాం వినా ప్రియే! ।**
**అన్యథా జపమాత్రేణ విహరేత్ క్షితిమణ్డలే ॥ 27**

**ప్రతిపదార్థం :** అభావే = కులయోనిలేనప్పుడు, కన్యకాయోనిమ్ = కన్యకాశక్తిని, వధూయోనిమ్ = వధువుయోనిని, తథా ఏవ చ = అట్లే, భాగినీయోనిమ్ = చెల్లెలిశక్తిని, శిష్యాణాం యోనిమ్ = శిష్యురాండ్ర శక్తిని, ఆశ్రిత్య = ఆశ్రయించి, ప్రతి + అహమ్ = ప్రతిరోజూ, యోనిమ్ = శక్తిని, పూజయేత్ = పూజింపదగును, అన్యథా = లేనిచో, యన్త్రమ్ = దేవతాప్రతీకమైన యంత్రాన్ని, అర్చయేత్ = పూజింపదగును; అన్యథా =

అదియు అసాధ్యమైనచో, క్షితిమణ్డలే = పుడమిపై, జపమాత్రేణ = జపము మాత్రము చేయుచు, విహరేత్ = సంచరింపదగును, ప్రియే = ఓ ప్రియురాలా!, యోనిపూజాం వినా = శక్తిపూజ చేయక, వృథా = వ్యర్థముగా, పూజా = అన్యదేవతాపూజ, న కర్తవ్యా = చేయదగదు.

**తాత్పర్యం :** స్వకీయమైన కులయోని లేనప్పుడు, కన్యకాశక్తినిగాని, అన్యవధూ (పరకీయ) యోనినిగాని, భగినీయోనినిగాని, శిష్యురాలిశక్తినిగాని ఆశ్రయింప వచ్చును. ఈ శక్తిపూజ యేమరక ప్రతిరోజూ చేయవలసినది. ఒకవేళ, దేవతాప్రతీకగా పై జెప్పిన వారెవ్వరూ లభించనప్పుడు ఆ శక్తియంత్రాన్ని పూజించ వచ్చును. అదికూడ అసాధ్యమైతే, కేవలం ఆ దేవతాకమైన మంత్రాన్ని జపిస్తూండవలె. అంతేతప్ప, శక్తిపూజ జేయకుండ అన్యదేవతాపూజ చేయరాదు. చేసిననూ వృథయే. *

**ఇతి యోనితన్త్రే చతుర్థోఽధ్యాయః సమ్పూర్ణమ్ ॥**

---

# పంచమోఽధ్యాయః

**శ్రీమహాదేవ ఉవాచ** = శ్రీమహాదేవుడిట్లనెను.

**శ్లో॥ మహావిద్యాముపాస్యైవ యది యోనిం న పూజయేత్ ।**
**పురశ్చర్యా శతేనాపి తస్య మన్త్రో న సిద్ధ్యతే ॥ 1**

**ప్రతిపదార్థం :** మహావిద్యామ్ = మహావిద్యను, ఉపాస్య ఏవ = ఉపాసించియును, యోనిమ్ = యోనిరూపశక్తిని, యది న పూజయేత్ = పూజింపకున్నచో, తస్య = వానికి, మన్త్రః = మంత్రము, పురశ్చర్యాశతేన అపి = పురశ్చరణ నూరుసార్లు చేసినను, న సిద్ధ్యతే = సిద్ధింపదు.

**తాత్పర్యం :** మహావిద్యనుపాసించికూడ శక్తినారాధించకున్న, ఆ సాధకునకు పురశ్చరణశతము చేతగూడ మన్త్రము సిద్ధించదు.

**మహావిద్య** యనగా **శ్రీచక్రాధిదేవత**. ఆ దేవత మహాశక్తిస్వరూపిణి. ఈమె పదిరూపాలతో విలసిల్లుతూంటుంది. దశవిద్యలుగా ఉపాసింపబడుతూంటుంది. వీరందరినీ పూజించటం కులాచారపద్ధతి. ఈ శక్తిపూజ **యోనిరూపసృజనశక్తి**పూజతో సంపన్నం కావలసియున్నది, అని తాత్పర్యం.

**పురశ్చరణ** అంటే మంత్రోపదేశం తరువాత ఆహార వ్యవహార విహార

విషయాలలో నియమపాలనం చేస్తూ గుర్వాజ్ఞననుసరించి నిర్ణీతకాలంలో నిర్ణీతజప సంఖ్యను పూర్తిచేయటం. ✻

**శ్లో॥ పుష్పాఞ్జలిత్రయం దత్వా యోనిగర్తే మహేశ్వరి! ।**
**జన్మాన్తరసహస్రాణాం పూజా తస్య ప్రజాయతే ॥ 2**

**ప్రతిపదార్థం :** మహేశ్వరి! = ఓ మహేశ్వరీ!, యోనిగర్తే = త్రికోణగర్తంలో, పుష్పాఞ్జలి-త్రయమ్ = ముమ్మారు పుష్పాంజలిని, దత్వా = సమర్పించి, తస్య = వానియొక్క, పూజా = పూజ జన్మాన్తరసహస్రాణామ్ = వేయిజన్మలు, ప్రజాయతే = ఫలించును.

**తాత్పర్యం :** ఓ మహేశ్వరీ! యోనిపూజావిధిలో సాధకుడు త్రికోణగర్తంలో ముమ్మారు పుష్పాంజలిని సమర్పిస్తే, వాని పూజాఫలం వేయిజన్మలవరకు వాని వెన్నంటి యుంటుంది. ✻

**శ్లో॥ గురురేవ శివస్సాక్షాత్తత్పత్నీ తత్స్వరూపిణీ ।**
**తస్యా రమణమాత్రేణ కౌలికో నారకీ భవేత్ ॥ 3**

**ప్రతిపదార్థం :** గురుః ఏవ = గురువే, సాక్షాత్ = కంటిముందున్న, శివః = శివుడు, తత్ = వానియొక్క, పత్నీ = భార్య, తత్ = వానిదైన, స్వరూపిణీ = రూపాంతరమే (అతడు శివుడు, ఆమె శివా), తస్యాః = ఆమెయొక్క, రమణమాత్రేణ = రమించిన మాత్రమున, కౌలికః = కులాచారుడు, నారకీ = నరకనివాసిగా, భవేత్ = అగును.

**తాత్పర్యం :** గురువు కంటిముందున్న శివుడే. గురుని భార్య పార్వతియే. కాబట్టి ఆమెతో రమిస్తే, ఆ పాపానికి నరకప్రాప్తి తప్పదు.

యోనిపూజలో శక్తిపీఠంగా గురుపత్ని నిషిద్ధస్త్రీ. ఆమె మాతృసమురాలు. ✻

**శ్లో॥ సర్వసాధారణీం యోనిం మర్దయేత్సాధకోత్తమః ।**
**తిలకం యోనితత్త్వేన తస్య భాలే ప్రదృశ్యతే ।**
**తత్ర దేవాసురాః యక్షాః భువనాని చతుర్దశ ॥ 4**

**ప్రతిపదార్థం :** సాధకోత్తమః = ఉత్తమసాధకుడు, సర్వసాధారణీం యోనిమ్ = అతి సామాన్యస్త్రీయోనిని, మర్దయేత్ = మర్దించదగును, తస్య = వానియొక్క, భాలే = నుదుటిపై, యోనితత్త్వేన = శక్తితత్త్వంతో, తిలకమ్ = తిలకచిహ్నము, ప్రదృశ్యతే = గోచరమగును, తత్ర = అక్కడ, దేవ + అసురాః = దేవదానవులు, యక్షాః = యక్షులు, చతుర్దశ భువనాని = పదునాలుగు లోకములు, (ఉండును).

**తాత్పర్యం :** ఉత్తమసాధకుడు సామాన్య స్త్రీయోనినే మర్దించదగును. వాని నుదుటిపై శక్తితత్త్వచిహ్నంగా తిలకం గోచరమైనచో, అచట దేవతలు, రాక్షసులు, యక్షులు, పదునాలుగు లోకములూ వసించును. ✻

**శ్లో॥ శ్రాద్ధే నిమంత్రయేద్విప్రాన్ కులీనాన్యత్ర సుందరి!**
**తత్ శ్రాద్ధం సఫలం తస్య పితరః స్వర్గవాసినః ।**
**నన్దన్తి పితరస్తస్య గాథాం గాయన్తి తే ముదా**
**అపి చాస్మత్కులే జాతః కులజ్ఞానీ భవిష్యతి ॥ 5**

**ప్రతిపదార్థం :** సుందరి != ఓ సుందరీ!, కులీనాన్ = కౌలాచారులగు, విప్రాన్ = బ్రాహ్మణులను, యత్ర శ్రాద్ధే = ఏ శ్రాద్ధమునందు, నిమంత్రయేత్ = ఆహ్వానించి పూజింతురో, తత్ శ్రాద్ధమ్ = ఆ శ్రాద్ధము, సఫలమ్ = ఫలవంతము, తస్య = వానియొక్క, పితరః = పూర్వులు, స్వర్గవాసినః = స్వర్గవాసులు (అగుచూ), తస్య = వానియొక్క, పితరః = పితరులు, నన్దన్తి = ఆనందింతురు, తే = వారు, ముదా = సంతోషముతో, గాథామ్ = ఆ చరిత్రను, గాయన్తి = పాడుచున్నారు, అపి చ = పైగా, అస్మత్ కులే = ఆ వంశమున, జాతః = పుట్టినవాడు, కులజ్ఞానీ = కౌలాచారజ్ఞాన వంతుడుగా, భవిష్యతి = అగుచున్నాడు.

**తాత్పర్యం :** ఓ సుందరీ! కౌలాచారులైన బ్రాహ్మణులను భోక్తలుగా పితృస్థానీయులుగా యే శ్రాద్ధమున నియోగింతురో, ఆ శ్రాద్ధము సఫలమై, శ్రాద్ధము నర్పించినవాని పూర్వులు స్వర్గవాసులై, ఆనందముతో ఆ గాథను గానము చేయుదురు. అదియుగాక, ఆ వంశములో పుట్టినవాడు కులాచారజ్ఞానం గలవాడవుతాడు.

గాథా అంటే ప్రాకృతభాషలో రచింపబడిన గీతం. పితరులు పాటలుకట్టి పాడుదురని భావం. తస్య పితరః స్వర్గవాసినః అనటంలో ఆంతర్యం, అప్పటివరకు వారి వారి కర్మఫలంగా స్వర్గవాసులు కానివారు ఈ శ్రాద్ధము కారణముగా తరింతురని. ✻

**శ్లో॥ యస్యా యోనౌ సాధకేన్ద్రః పూజనం క్రియతే దృఢమ్ ।**
**తద్యోనావధిష్ఠితాం దేవీం సాధకో భావయే త్సదా ॥ 6**

**ప్రతిపదార్థం :** సాధకేన్ద్రః = సాధకశ్రేష్ఠుడు, దృఢమ్ = చెదరని ఏకాగ్రతతో, యస్యాః = ఏ స్త్రీయొక్క, యోనౌ = యోనియందు, పూజనమ్ = పూజను, క్రియతే = చేయునో, తత్ యోనౌ = ఆ యోనియందు, అధిష్ఠితాం దేవీమ్ = అధిష్ఠాతృదేవతను, సదా = ఎల్లవేళల, సాధకః = సాధకుడు, భావయేత్ = మనసునందుంచవలెను.

**తాత్పర్యం :** సాధకుడు యే స్త్రీయోనిని నిత్యము ఆరాధించునో, ఆ యోని నధిష్ఠించి యున్న దేవతను ఎల్లప్పుడును అతడు స్మరణయందుంచవలెను. ✻

**శ్లో॥ యోనితత్త్వం మహాదేవి! సదా గాత్రే ప్రమర్దయేత్ ।**
**తద్గాత్రం సఫలం తస్య చాపి కోటికులైస్సహ ॥ 7**

**ప్రతిపదార్థం :** మహాదేవి! = ఓ మహాదేవీ!, సదా = ఎల్లప్పుడు, గాత్రే = శరీరమునందు, యోనితత్త్వమ్ = శక్తితత్త్వమును, ప్రమర్దయేత్ = ఇంకిపోవునట్లు మర్దించవలెను. తస్య అపి గాత్రమ్ = వానియొక్క శరీరము, తత్ = వానియొక్క, కోటికులైః సహ = వంశజులు కోటిమందితో సహ, సఫలమ్ = ధన్యమగును.

**తాత్పర్యం :** ఓ మహాదేవీ! శక్తితత్త్వాన్ని సాధకుడు శరీరంలో నరనరాన ప్రసరించునట్లు సాధన చేయవలెను. అట్లు సాధన చేసినవాని శరీరము వాని వంశంలో పుట్టిన కోటిమందితో సహ ధన్యమవుతుంది. *

**శ్లో॥ స్వలిఙ్గభగగర్తే చ ప్రవిశేచ్ఛ స్వయం యది ।**
**తదైవ మహతీపూజా లిఙ్గయోని సమాగమే ॥** 8

**ప్రతిపదార్థం :** స్వయం చ = (సాధకుడు) తానే, భగగర్తే = యోనిగుంతలో, స్వలిఙ్గ = తనదైన లింగముతో, యది ప్రవిశేత్ = ప్రవేశించినట్లయిన, తదా ఏవ = అప్పుడు, లిఙ్గయోని = లింగయోనుల, సమాగమే = కలయికలో, మహతీ పూజా = గొప్పదైన పూజ (అగును).

**తాత్పర్యం :** యోనిపూజా సమయంలో సాధకుడు తన లింగమును యోనిద్వారంలో ప్రవేశింపజేసినప్పుడు, లింగయోని సమాగమంలో గొప్పపూజ అవుతుంది, అంటే, యోనిపూజ కది పరాకాష్ఠ. *

**శ్లో॥ శుక్రోత్సారణకాలే చ జపపూజాపరాయణః ।**
**తత్ శుక్రం యోనితత్త్వఞ్చ మిశ్రయిత్వా విధానతః ।**
**యోనిగర్తే సాధకేన్ద్రః ప్రదద్యాద్ధృతివృద్ధయే ॥** 9

**ప్రతిపదార్థం :** చ = మరియు, జపపూజాపరాయణః = జపము, పూజ చేయుటయందు లగ్నమైన, సాధకేన్ద్రః = సాధకశ్రేష్ఠుడు, శుక్ర + ఉత్సారణకాలే = వీర్యస్ఖలనమగు సమయమున, తత్ శుక్రమ్ = ఆ వీర్యమును, యోనితత్త్వం చ = శక్తితత్త్వమును, విధానతః = శాస్త్రోక్తప్రకారము, మిశ్రయిత్వా = కలిపి, యోనిగర్తే = యోనిగుంతలో, ధృతివృద్ధయే = వైభవము వర్ధిల్లుటకై, ప్రదద్యాత్ = సమర్పించదగును.

**తాత్పర్యం :** జపము, పూజ చేయువాడు వీర్యస్ఖలన సమయంలో ఆ వీర్యాన్ని శక్తితత్త్వ భావనతో శాస్త్రోక్తరీతిలో యోనిగుంతలో ఉంచవలెను. ఫలంగా వానికి లౌకిక జీవనం వైభవోపేతంగా నడుస్తుంది.

ఇట పుణ్యానందముని విరచిత **'కామకలావిలాసం'** అనుసంధానము చేసుకొందురుగాక. శుక్లశోణమిశ్రబిందుజ్ఞానము చెప్పబడినది. *

**శ్లో॥ తదా శ్రీచరణాద్దేవీం సముత్పతితేఽఙ్గనే ।**
**పూజాకాలే చ దేవేశి! చాన్యాలాపం వివర్జయేత్ ॥ 10**

**ప్రతిపదార్థం :** తదా = అప్పుడు, అఙ్గనే = ఆ స్త్రీయందలి, దేవీమ్ = దేవతను, శ్రీచరణాత్ = శ్రీపాదములబట్టి, సముత్పతితే = నమస్కరించవలెను. దేవేశి! = ఓ పార్వతీ!, చ = మరియు, పూజాకాలే = పూజాసమయమున, అన్యాలాపమ్ = అన్యప్రసంగము, వివర్జయేత్ = విడువదగును.

**తాత్పర్యం :** ఆ తరువాత తనకు సహకరించిన స్త్రీయందు తన ఇష్టదేవత అధిష్ఠించి యున్నది కనుక, ఆమె పాదములకు నమస్కరించవలెను. ఈ పూజాసమయంలో మరియే ఇతర విషయములగూర్చిగాని ముచ్చటించరాదు. ✻

**శ్లో॥ కామశాస్త్రప్రసంగేన తద్యోనిం లాలయేద్బుధః ।**
**మాతృయోనిం పురస్కృత్య యది పూజాం కరోతి యః ॥ 11**

**శ్లో॥ పూజయిత్వా విధానేన మైథునం న సమాచరేత్ ।**
**పరిత్యజ్య తద్యోనిం క్షతమాత్రం చ తాడయేత్ ॥ 12**

**ప్రతిపదార్థం :** బుధః = బుద్ధిమంతుడు, తద్యోనిమ్ = ఆ యోనిని, కామశాస్త్ర ప్రసంగేన = కామశాస్త్రము ననుసరించి, లాలయేత్ = సంతోషపెట్టవలెను. యః = ఎవడు, మాతృయోనిమ్ = మాతృశక్తిని, పురస్కృత్య = ముందుంచుకొని, పూజామ్ = పూజను, కరోతి యది = చేయుచున్నట్లయిన, విధానేన = శాస్త్రవిహితముగా, పూజయిత్వా = పూజించి, తద్ యోనిమ్ = ఆ యోనిని, పరిత్యజ్య = విడిచి, క్షతమాత్రమ్ = తన కులస్త్రీయోనిని, తాడయేత్ = మర్దించదగును, చ = మరియు, మైథునమ్ = సంభోగము, న సమాచరేత్ = చేయదగదు.

**తాత్పర్యం :** పై శ్లోకసందర్భంలో, ఆ యోనిని కామశాస్త్రరీత్యా తృప్తిపరచవలెను. ఒకవేళ ఎవడైన మాతృశక్తిని భావించి మాతృయోనిని పూజించినట్లయిన, ఆతడు మైథునేచ్ఛను విడచి పూజింపదగును. మైథునము తన భార్యతో చేయవలెను. ✻

**శ్లో॥ యది భాగ్యవశేనాపి బ్రాహ్మణీ మిలితా ప్రియే! ।**
**తద్యోని తత్త్వమాదాయ చాన్యయోనిం ప్రపూజయేత్ ॥ 13**

**ప్రతిపదార్థం :** ప్రియే = ఓ ప్రియురాలా!, భాగ్యవశేన అపి = అదృష్టమువలననైన, బ్రాహ్మణీ = బ్రాహ్మణస్త్రీ, మిలితా యది = కలిసినట్లయిన, తత్ = ఆమెయొక్క, యోనితత్త్వమ్ = శక్తితత్త్వమును, ఆదాయ = తీసికొనివచ్చి, అన్యయోనిమ్ = వేరు యోనిని, ప్రపూజయేత్ = పూజింపవలెను.

**తాత్పర్యం :** అదృష్టంవలన బ్రాహ్మణస్త్రీ ఈ పూజకై లభించినట్లయిన, ఆమె యోనిని ముందుగా పూజించి తదుపరి అన్యస్త్రీయోనిని పూజింపవలెను. ✻

**శ్లో॥ పఞ్చతత్త్వం వినా దేవి! పశుదీక్షా వృథా భవేత్ ।**
**ఓంకారోచ్చారణాద్ధోమాత్ శాలగ్రామశిలార్చనాత్ ।**
**బ్రాహ్మణీగమనాచ్చైవ శూద్రో చణ్డాలతాం వ్రజేత్ ॥ 14**

**ప్రతిపదార్థం :** దేవి! = ఓ దేవీ!, పంచతత్త్వం వినా = పంచమకారముల ఉపయోగము లేనిదై, పశుదీక్షా = పశుదీక్ష లేక ఇంద్రియతృప్తి కొరకైన దీక్షయై, వృథా భవేత్ = వ్యర్థమగును. శూద్రః = శూద్రుడు, ఓంకార+ఉచ్చారణాత్ = ఓంకారమును పలికినందువలన, హోమాత్ = హోమము చేసినందువలన, శాలగ్రామశిలా అర్చనాత్ = సాలగ్రామశిలను అర్చించినందువలన, బ్రాహ్మణీగమనాత్ = బ్రాహ్మణస్త్రీ సంగమము వలన, చ ఏవ = కూడను, చణ్డాలతామ్ = చండాలత్వమును, వ్రజేత్ = పొందును.

**తాత్పర్యం :** ఓ దేవీ! పంచమకారాలు లేని దీక్ష పశుదీక్ష, అనగా ఇంద్రియలాలస మాత్రం, అవుతుంది. దైవత్వం లోపిస్తుంది. శూద్రుడు ఓంకారాన్ని పలికినా, హోమం చేసినా, సాలగ్రామాన్ని పూజించినా, బ్రాహ్మణస్త్రీని సంగమించినా గాని చండాలు డవుతాడు. ✻

**శ్లో॥ శక్తిం కులగుహం దేవి! చాశ్రయేద్బహుయత్నతః ।**
**పశుదీక్షాం సమాదాయ యది పూజాపరాయణః ।**
**తస్య దీక్షా చ విద్యా చ నరకాయోపపద్యతే ॥ 15**

**ప్రతిపదార్థం :** దేవి! = ఓ దేవీ!, కులగుహం శక్తిమ్ = కులస్త్రీయోని నధిష్ఠించిన శక్తిని, బహుయత్నతః = ప్రయత్నపూర్వకముగ, ఆశ్రయేత్ = పూజింపదగును. పూజాపరాయణః = పూజాదీక్షితుడు, పశుదీక్షామ్ = పశుదీక్షను, సమాదాయ = స్వీకరించి, యది (పూజయేత్) పూజించినట్లయిన, తస్య = వానియొక్క, దీక్షా చ = దీక్షయును, విద్యా చ = మంత్రజపమున్ను, నరకాయ = నరకప్రాప్తికే , ఉపపద్యతే = కారణమగును.

**తాత్పర్యం :** ఓ దేవీ! ఇంటి ఇల్లాలి యోని నధిష్ఠించిన శక్తినే పూజింపదగును. పూజకుడు ఒకవేళ పూజలో ఉండదగిన దైవత్వభావనను వదలి ఇంద్రియోన్ముఖుడై భోగలాలసుడైతే, వాని దీక్ష, మంత్రజపము నిష్ఫలములే కాక, వాని పూజ పాపకార్యమై వానిని నరకమున పడద్రోయును. ✻

**శ్లో॥ తస్మాత్ సర్వప్రయత్నేన కులీనం గుహమాశ్రయేత్ ।**
**కులీనం గుహమాశ్రిత్య యది పూజాం సమాచరేత్ ॥ 16**

**శ్లో॥ తదా యోనిః ప్రసన్నా స్యాత్ కృష్ణే రాధాభగం యథా ।**
**సీతాభగం రామచంద్రే తవ యోనిర్మయి ప్రియే ॥ 17**

**ప్రతిపదార్థం :** తస్మాత్ = ఆ కారణమువలన, సర్వప్రయత్నేన = అన్నివిధముల ప్రయత్నించి, కులీనం గుహమ్ = తన ఇల్లాలి సహకారముతో ఆమె యోనిని, ఆశ్రయేత్ = పూజించవలెను, కులీనం గుహమ్ = తన ఇల్లాలి యోనిని, ఆశ్రిత్య = ఆశ్రయించి, పూజామ్ = పూజను, యది సమాచరేత్ = చక్కగా నిర్వహించినట్లయిన, తదా = అప్పుడు, యోనిః = ఆదిశక్తి, రాధాభగమ్ = రాధయోని, యథా కృష్ణే = కృష్ణునియందెట్లో, సీతాభగమ్ = సీతయోని (యథా), రామచంద్రే = రామచంద్రునియందెట్లో, ప్రియే = ఓ ప్రియురాలా!, తవ = నీయొక్క, యోనిః = యోని, (యథా) మయి = నాయందెట్లో, (అట్లే), ప్రసన్నా స్యాత్ = ప్రసన్నురాలగును.

**తాత్పర్యం :** అందువలన ఓ ప్రియురాలా! ఈ పూజావిధానంలో సాధకుడు తన భార్య సహకారంతో ఆమె యోనిని ఆశ్రయించినట్లయితే, రాధయోని కృష్ణునియందు, సీతయోని శ్రీరామునియందు, నీయోని నాయందు ప్రసన్నలైనట్లు, ఆ సాధకునకు ఆదిశక్తి ప్రసన్నత లభిస్తుంది. *

**శ్లో॥ యోనికున్తలమాదాయ యది రాజగృహం వ్రజేత్ ।**
**తస్య కార్యాణి సర్వాణి ఫలవన్తి న సంశయః ॥ 18**

**ప్రతిపదార్థం :** యోనికున్తలమ్ = యోనిపైగల కేశమును, ఆదాయ = తీసికొని, (సాధకుడు) రాజగృహమ్ = రాజుగారి ఇంటికి, యది వ్రజేత్ = వెళ్ళినట్లయితే, తస్య = వానియొక్క, సర్వాణి కార్యాణి = పనులన్నియు, ఫలవన్తి = ఫలించుచున్నవి, న సంశయః = అనుమానము లేదు.

**తాత్పర్యం :** యోనిపైగల కేశమును తీసికొని సాధకుడు రాజగృహమునకు పోయినచో, వాని కార్యములన్నియు గట్టెక్కును. నిశ్చయము.

రాజగృహం అంటే, అధికారి గృహం అని భావంగా స్వీకరించవలె. *

**శ్లో॥ తదా లిఙ్గఞ్చ సంపూజ్య పూజయేత్ శక్తిరూపిణీమ్ ।**
**తిలకం యోనితత్త్వేన పుష్పేణ ధారయేద్యది ।**
**స నిర్భర్స్యయమం మన్త్రీ దుర్గాలోకే మహీయతే ॥ 19**

**ప్రతిపదార్థం :** చ = మరియు, లింగమ్ = లింగమును, సంపూజ్య = చక్కగా పూజించి, తదా = అప్పుడు, శక్తిరూపిణీమ్ = శక్తికి రూపాంతరమైన యోనిని, పూజయేత్ = పూజింపదగును. యోనితత్త్వేన = శక్తితత్త్వంతో, పుష్పేణ = పుష్పంతో, తిలకమ్ =

తిలకమును, యది ధారయేత్ = ధరించినట్లయిన, సః మన్త్రీ = ఆ మంత్రవేత్త, యమమ్ = యముని, నిర్భర్త్స్య = భయపెట్టి, దుర్గాలోకే = దుర్గాదేవి నివాసమైన లోకంలో, మహీయతే = ప్రకాశించును.

**తాత్పర్యం :** ముందుగా లింగాన్ని పూజించి, తరువాత శక్తిరూపిణియైన యోనిని పూజించి, శక్తితత్త్వంతో సహజపుష్పాన్ని తిలకంగా ధరించినట్లయిన, ఆ మంత్రవేత్త యముని భయపెట్టి దుర్గాలోకంలో నివసిస్తాడు.

పుష్పం అంటే సందర్భోచితమైన అర్థం, యోని నుండి సహజంగా స్రవించిన ద్రవం. ❋

**పార్వత్యువాచ** = పార్వతీదేవి ఇట్లనెను.

**శ్లో॥ కయా చ విధయా పూజ్యా యోనిరూపా జగన్మయీ ।**
**కిం కృతే చ ప్రసన్నా స్యాత్ వద మే కరుణానిధే! ॥ 20**

**శ్లో॥ స్వయం వా పూజయేద్యోనిం చాథవా సాధకేన చ ।**
**తత్సర్వం శ్రోతుమిచ్ఛామి పరం కౌతూహలం మమ ॥ 21**

**ప్రతిపదార్థం :** కరుణానిధే! = సముద్రమంత కరుణగలవాడా!, జగన్మయీ = లోకమంతా వ్యాపించియున్న, యోనిరూపా = యోనిరూపశక్తి, కయా విధయా = ఏవిధానంచేత, పూజ్యా = పూజింపదగినది?, చ = మరియు, కిం కృతే = ఏ నిమిత్తము, ప్రసన్నా స్యాత్ = ప్రసన్నురాలగును?, మే = నాకు, వద = చెప్పుము, యోనిమ్ = యోనిని, స్వయమ్ = తానే, పూజయేత్ వా = పూజింపదగునా?, అథవా = లేకున్న, సాధకేన చ = సాధకునిచేతగూడ, పూజయేత్ వా = పూజింపదగునా?, తత్ సర్వమ్ = అదియంతయు, శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను, మమ = నాకు, పరమ్ = మిక్కిలి, కౌతూహలమ్ = కుతూహలము.

**తాత్పర్యం :** ఓ కరుణాసముద్రా! లోకమంతా నిండియున్న యోనిరూపశక్తిని పూజించే విధానమేమి? ఆమె ఎందు నిమిత్తం ప్రసన్నురాలవుతుంది? తానే స్వయంగా పూజించవలెనా? లేక, వేరు సాధకునితో పూజ చేయించవచ్చునా? ఆ వివరాలన్నీ వినాలని నాకు ఉత్సాహంగా ఉన్నది. విశదీకరించండి.

ఆదిశక్తి సృష్టిలో రెండు విధాలుగా సాకారమవుతుందని శాక్తేయులంటారు : 1) నామరూపాలతోడి జీవసృష్టి, 2) నామరూపనాశకమైన శక్తి. మొదటిదానికి యోని సంకేతం, కాగా రెండవదానికి శ్మశానం సంకేతం. ఈ రెండున్నూ దైవత్వపు శక్తి ఆవిష్కరణలే. ❋

**శ్రీ మహాదేవ ఉవాచ** = శ్రీమహాదేవుడిట్లనెను.

**శ్లో॥ సాధకేన పూజితవ్యా యోనిరూపా జగన్మయీ ।**
**తస్య లిఙ్గం సముద్ధృత్య పూజయేత్ శక్తిరూపిణీ ॥ 22**

**ప్రతిపదార్థం :** సాధకేన = సాధకునిచేత, యోనిరూపా = యోనిరూపముగల, జగన్మయీ = జగత్తునధిష్ఠించిన శక్తి, పూజితవ్యా = పూజింపదగినది, తస్య = వానియొక్క, లిఙ్గమ్ = లింగమును, సముద్ధృత్య = ఎత్తిపట్టి, శక్తిరూపిణీ = శక్తిరూపమున నున్న సహకారిణి, పూజయేత్ = పూజింపదగును.

**తాత్పర్యం :** జగత్తునిండా వ్యాపించియున్న యోనిరూపశక్తిని సాధకుడు పూజింపవలెను. ఆ శక్తి ప్రతినిధిగా వానికి సహకరిస్తూన్న స్త్రీ ఆ సాధకుని లింగాన్ని పట్టి యెత్తి పూజింపవలెను. ✻

**శ్లో॥ భగరూపా మహామాయా లిఙ్గరూపస్సదాశివః ।**
**తయోః పూజనమాత్రేణ జీవన్ముక్తో న సంశయః ॥ 23**

**ప్రతిపదార్థం :** భగరూపా = యోనిరూపము గలది, మహామాయా = మహామాయ, లిఙ్గరూపః = లింగరూపమున నున్నవాడు, సదాశివః = సదాశివుడు, తయోః = వారియొక్క, పూజనమాత్రేణ = పూజచేసినమాత్రమున, జీవన్ముక్తః = జీవించియుండగనే సాధకుడు మోక్షమును పొందును, న సంశయః = సందేహములేదు.

**తాత్పర్యం :** యోనిరూపమున సృష్టిని కొనసాగిస్తూన్న స్త్రీశక్తి మహామాయ. లింగరూపమున ఆమెకు సహకరించే పురుషుడు సదాశివుడు. కాబట్టి యోనిని, లింగాన్ని ఆ తత్త్వదృష్టితో పూజించినట్లయిన, ఆతడు ఆత్మసాక్షాత్కారాన్ని సాధించి ప్రాకృతిక బంధాలనుండి ముక్తుడవుతాడు.

ప్రకృతికే మాయయని పేరు. ఈ మాయ పరమపురుషుని సృజనశక్తి. సృష్టి స్థితిలయాల నీమెయే నిర్వహిస్తుంది. ఈమెయే ఆదిశక్తి. ఈమె సహకారం లేకుండా పరమాత్మకు వ్యక్తత లేదు. కనుక వాని అభివ్యక్తియే మాయ లేక ప్రకృతి.

లింగము వ్యక్తావ్యక్తస్థితికి, అనంతత్వానికి ప్రతీక, శుద్ధాత్మసంకేతం. ఇది మాయలో చేరినప్పుడే వ్యక్తచేతన కాగలదు. ఈ సత్యాన్ని తెలిసికొన్న సాధకునకు మాయ విసిరే ఇంద్రియాల ఇంద్రజాలపు వల ఎట్టి ప్రతిబంధకాలను గాని కల్పించలేదు. ఇంద్రియదాస్యం నుండి ఆతడు ముక్తుడవుతాడు. ✻

**శ్లో॥ పుష్పాదికబలిశ్చైవ పూజాసామగ్రీ ఏవ చ ।**
**యది నైవ తదా దుర్గే కారణేన ప్రపూజయేత్ ॥ 24**

**ప్రతిపదార్థం :** దుర్గే = ఓ దుర్గా!, పుష్పాదిక = పుష్పము మొదలుగా, బలిః చ ఏవ = నైవేద్యమువరకున్ను, పూజసామగ్రీ ఏవ చ = పూజకవసరమైన వస్తువులేవియు, యది న ఏవ = లేనట్లయితే, తదా = అప్పుడు, కారణేన = మద్యముతో, ప్రపూజయేత్ = పూజింపవలెను.

**తాత్పర్యం :** ఓ దుర్గా! పూజకవసరమైన పుష్పాది వస్తువులు నైవేద్యమున్నూ, యేదీ అందుబాటులో లేనప్పుడు మద్యంతో పూజింపవచ్చును. *

**శ్లో॥ మనునా కేవలేనాపి తదా యోనిం ప్రపూజయేత్ ।**
**ప్రాణాయామో యోనిగర్తే షడఙ్గం మాయయా ప్రియే ॥ 25**

**ప్రతిపదార్థం :** మనునా కేవలేన అపి = (మద్యం కూడ లేకపోయినచో) ఒక్క మంత్రజపముతోడనే, తదా = అప్పుడు, యోనిమ్ = యోనిని, ప్రపూజయేత్ = పూజింపదగును. ప్రియే = ఓ ప్రియురాలా!, యోనిగర్తే = యోని కేంద్రస్థానంలో, ప్రాణాయామః = ప్రాణాయామము (చేసి), మాయయా = మాయాబీజముతో, షడఙ్గమ్ = షడంగన్యాసము (చేయవలెను).

**తాత్పర్యం :** మద్యం కూడ లేని సమయంలో కేవలం మంత్రజపంతోడనే యోనిని పూజించవలె. పూజను వదలరాదు. యోనికేంద్రంలో ప్రాణాయామం చేసి, మాయాబీజంతో షడంగన్యాసం చేయవలె.

**ప్రాణాయామము :** శ్వాసక్రియను పూరక, కుంభక, రేచకములు అను ప్రక్రియలద్వారా అదుపుచేసి ప్రాణశక్తిని స్వాధీనము చేసికొనటం. **మాయాబీజము : 'హ్రీం'** అను బీజాక్షరం.

**షడంగం :** రెండు తొడలు, రెండు భుజములు, నడుము, తల – ఇవి ఆరు షడంగములు. వీనిని తాకుతూ 'హ్రీం' అను బీజాక్షరాన్ని ఉచ్చరిస్తూ, మనస్సులో ఆదిశక్తి భద్రకాళిని స్మరించటం షడంగన్యాసం. దీని విధానం ఇట్లా : **ఓం హ్రాం హృదయాయ నమః, ఓం హ్రీం శిరసే స్వాహా, ఓం హ్రూం శిఖాయై వషట్, ఓం హ్రైం కవచాయ హుం, ఓం హ్రౌం నేత్రత్రయాయ వౌషట్, ఓం హ్రః కరతలకరపృష్ఠాభ్యాం అస్త్రాయ ఫట్** – ఈ మంత్రాలను ఈ వరుసలో ఉచ్చరిస్తూ, వరుసగా హృదయాన్నీ, శిరస్సునూ, శిఖనూ, నాభిని, నేత్రాలనూ, అరచేతినీ, అరచేతి వెనుక భాగాన్నీ తాకవలె. *

**శ్లో॥ యోనిమూలే శతం జప్త్వా లిఙ్గయోనిం ప్రమార్జయేత్ ।**
**సర్వేషాం సాధనానాం చ సుసమం పరికీర్తితమ్ ॥ 26**

**ప్రతిపదార్థం :** యోనిమూలే = యోనిమూలమునందు, శతమ్ = నూరు సార్లు, జప్త్వా

= జపించి, లిఙ్గయోనిమ్ = లింగముతో కూడిన యోనిని, ప్రమార్జయేత్ = శోధించదగును, సర్వేషాం సాధనానాం చ = సాధనలన్నింటికి గూడ, సుసమమ్ = సరళమైనదిగా, ప్రకీర్తితమ్ = (ఇది) కొనియాడబడినది.

**తాత్పర్యం :** యోనిమూలంలో అష్టోత్తరశతం మంత్రజపం చేసి, లింగముతో యోనిని శోధించదగును. సాధనలన్నింటిలోకి ఇది సరళసాధనయని ఖ్యాతి పొందినది ఈ సాధన పద్ధతి.

జపవిధానంలో నూరు అంటే నూటయెనిమిదిగా భావించబడుతుంది. ఇది సంప్రదాయం. ✳

**శ్లో॥ ఏతత్తన్త్రఞ్చ దేవేశి! న ప్రకాశ్యం కదాచన ।**
**న దేయం పరశిష్యేభ్యోఽభక్తేభ్యో విశేషతః ।**
**యోనితత్త్వం మహాదేవి! తవ స్నేహాత్ప్రకాశితమ్ ॥ 27**

**ప్రతిపదార్థం :** దేవేశి = ఓ దేవతలకీశ్వరీ!, ఏతత్ తన్త్రం చ = ఈ తంత్రమున్ను, కదాచన = ఒకప్పుడైనను, న ప్రకాశ్యమ్ = బయలుపరచరాదు, పరశిష్యేభ్యః = ఇతర గురువుల నాశ్రయించినవారికి, విశేషతః = విశేషించి, అభక్తేభ్యః = భక్తులు కానివారికి, న దేయమ్ = ఇవ్వదగినది కాదు, మహాదేవి! = ఓ మహాదేవీ!, తవ స్నేహాత్ = నీ స్నేహము కారణముగా, యోనితత్త్వమ్ = శక్తితత్త్వము, ప్రకాశితమ్ = వివరించబడినది.

**తాత్పర్యం :** దేవతలను శాసించు ఓ మహాదేవీ! ఈ తంత్రం ఎప్పటికీ బయలుపరచరాని రహస్యమే. అయినను, నీవు కోరితే కాదనలేని స్నేహం మనది. కనుక శక్తితత్త్వాన్ని వివరించినాను. ఈ తంత్రవిషయం ఇతర గురువుల శిష్యులకివ్వరాదు. అట్లే, తన శిష్యులయినను, భక్తినలేనివారికివ్వరాదు. ✳

**ఇతి యోనితన్త్రే పంచమోఽధ్యాయః సమ్పూర్ణమ్ ॥**

---

# షష్ఠోఽధ్యాయః

**శ్రీమహాదేవ ఉవాచ** = శ్రీ మహాదేవు డిట్లనెను.

**శ్లో॥ స్నానకాలే చ దేవేశి! యది యోనిం నిరీక్షయేత్ ।**
**సఫలం జీవనం తస్య సాధకస్య సునిశ్చితమ్ ॥ 1**

**శ్లో॥ స్వయోనిం పరయోనిం వా వధూయోనిం విశేషతః ।**
**అభావే కన్యకాయోనిం శిష్యాయోనిం నిరీక్షయేత్ ॥ 2**

**ప్రతిపదార్థం :** దేవేశి! = ఓ దేవతల శాసకురాలా!, స్నానకాలే = స్నానము చేయువేళలో, యోనిమ్ = యోనిని, యది నిరీక్షయేత్ = దర్శించినట్లయిన, తస్య సాధకస్య = ఆ సాధకునియొక్క, జీవనమ్ = జీవితము, సునిశ్చితమ్ = నిచ్చయముగా, సఫలమ్ = ఫలవంతము, చ = మరియు, స్వయోనిమ్ = తన భార్య యోనిని, వా = లేక, పరయోనిమ్ = అన్యస్త్రీయోనిని, వధూయోనిమ్ = వధువు యోనిని, విశేషతః = విశేషముగ, కన్యకా యోనిమ్ = కన్య యోనిని, అభావే = లభించనప్పుడు, శిష్యాయోనిమ్ = శిష్యురాలి యోనిని, నిరీక్షయేత్ = దర్శింపవలెను.

**తాత్పర్యం :** ఓ దేవేశీ! స్నానం చేసే సమయంలో యోనిని దర్శించిన సాధకుని జీవితం ధన్యం. తన భార్యగాని, అన్యస్త్రీగాని, వధువుగాని, కన్యగాని, శిష్యురాలుగాని యీ విషయమున సహకరింపవచ్చును. ✳

**శ్లో॥ ఏతత్తన్త్రం మహాదేవి! యస్య గేహే విరాజతే ।**
**నాగ్నిచౌరభయం తస్య చాన్తే చ మోక్షభాగ్భవేత్ ॥ 3**

**ప్రతిపదార్థం :** మహాదేవి! = ఓ మహాదేవీ!, యస్య = ఎవనియొక్క, గేహే = ఇంటిలో, ఏతత్ తన్త్రమ్ = ఈ యోనితంత్రము, విరాజతే = ఉండునో, తస్య = వానికి, అగ్ని = నివాసమున, చౌరభయమ్ = దొంగతనమువలని భయము, న = లేదు, అన్తే చ = దేహావసానమందు, (సః = అతడు), మోక్షభాక్ = మోక్షార్హుడు, భవేత్ = అగును.

**తాత్పర్యం :** ఓ మహాదేవీ! ఏ సాధకుని ఇంట ఈ యోనితంత్రగ్రంథముండునో వాని ఇంట దొంగతనము జరుగదు. వాని దేహాంతమున మోక్షప్రాప్తి కలుగును. ✳

**శ్లో॥ పశ్వాది యోనిమాశ్రిత్య అభావే చ ప్రపూజయేత్ ।**
**యోనిపూజనమాత్రేణ సాక్షాద్విష్ణుర్న సంశయః ॥ 4**

**ప్రతిపదార్థం :** చ = మరియు, అభావే = (కులస్త్రీయోని) లభించని సమయంలో, పశు +ఆది = జంతువు మొదలుగాగల, యోనిమ్ = యోనిని, ఆశ్రిత్య = ఆశ్రయించి, ప్రపూజయేత్ = పూజింపదగును, యోనిపూజనమాత్రేణ = యోనిని పూజించిన మాత్రాన, సాక్షాద్ = సాక్షాత్తు, విష్ణుః = విష్ణువగును, న సంశయః = నిశ్చయము.

**తాత్పర్యం :** భార్య అందుబాటులో లేనప్పుడు, జంతుయోనినైన ఆశ్రయించి పూజ చేయవచ్చును. యోనిపూజ మాత్రమున సాధకుడు విష్ణుసమానుడగుట నిశ్చయము.

భక్తిభావప్రధానమైన పూజావిధిలో మట్టి విగ్రహమునకు బంగారువిగ్రహమునకు అభేదమైనట్లే మానుషయోనికి జంతుయోనికి భేదమెన్నరాదు. సమానఫలదములే. ✳

**శ్లో॥ స్వర్గలోకే చ పాతాలే సమ్పూజ్య చ సురాసురైః ।**
**వీరసాధనకర్మాణి దుఃఖలభ్యాని కేవలమ్ ॥ 5**

**ప్రతిపదార్థం :** స్వర్గలోకే = స్వర్గలోకములో, చ = మరియు, పాతాలే = పాతాళ లోకమున, సుర + అసురైః = దేవతలచేత, రాక్షసులచేత, సమ్పూజ్య చ = చక్కగా పూజింపబడియు, వీరసాధనకర్మాణి = వీరసాధనకర్మలు, కేవలమ్ దుఃఖలభ్యాని = దుఃఖప్రాప్తములు మాత్రమే.

**తాత్పర్యం :** అన్యసాధనల ఫలముగా ఎవరైన స్వర్గలోకవాసమునూ దేవతలచే గౌరవమును పొందవచ్చును. లేక, పాతాళమున నాగలోకవాసమునూ రాక్షసులచే గౌరవమునూ పొందవచ్చును. కాని యోనిత్రంతసాధన వీరసాధన కర్మలతో కూడినది సిద్ధించుట మాత్రము దుఃఖభాజనము.

క్షుద్రవిద్యాసాధనగా భావింపబడే యీ తంత్రవిద్య సాధించుటలోని క్లేశము గూర్చి ఇది హెచ్చరిక. *

**శ్లో॥ సుగమం సాధనం దుర్గే! తవ స్నేహాత్ప్రకాశితమ్ ।**
**యోనితత్త్వం సమాదాయ సంగ్రామం ప్రవిశేద్యది ।**
**జిత్వా సర్వానరీన్ దుర్గే! విజయీ చ న సంశయః ॥ 6**

**ప్రతిపదార్థం :** దుర్గే! = ఓ దుర్గా!, సుగమం సాధనమ్ = సులభమైన సాధనము, తవ = నీదైన, స్నేహాత్ = స్నేహమువలన, ప్రకాశితమ్ = బయలుపరుపబడినది, దుర్గే = ఓ దుర్గా!, యోనితత్త్వమ్ = శక్తితత్త్వమును, సమాదాయ = స్వీకరించి, సంగ్రామమ్ = యుద్ధమును, యది ప్రవిశేద్ = ప్రవేశించినట్లయిన, సర్వాన్ అరీన్ = శత్రువులందఱను, జిత్వా = జయించి, విజయీ చ = విజయుడే యగును, న సంశయః = అనుమానము లేదు.

**తాత్పర్యం :** ఓ దుర్గా! నీయందలి ప్రేమవలన సులభమైన ఈ సాధనగూర్చి చెప్పియున్నాను. శక్తితత్త్వాన్ని గ్రహించి రణభూమిలో ప్రవేశించినవాడు శత్రువులను ఓడించి నిశ్చయంగా విజయుడవుతాడు. *

**శ్లో॥ కిం గఙ్గాస్నానమాత్రేణ కిం వా తీర్థనిషేవణాత్ ।**
**నాస్తి యోనౌ సమా భక్తేరన్యత్సర్వం వృథా భవేత్ ॥ 7**

**ప్రతిపదార్థం :** గంగాస్నానమాత్రేణ = గంగలో స్నానం చేసినంత మాత్రమున, కిమ్ = ఏమి లాభము?, తీర్థనిషేవణాత్ = పుణ్యతీర్థసేవనంవలన, కిం వా = ఏమి లాభము?, యోనౌ = యోనియందలి, భక్తేః = భక్తికి, సమా = సమమైనది, అన్యత్ = వేరొకటి, న అస్తి = లేదు, సర్వమ్ = అంతయు, వృథా = వ్యర్థము, భవేత్ = అగును.

**తాత్పర్యం :** గంగాస్నానం చేసిననూ, పుణ్యతీర్థాలు సేవించిననూ లాభం లేదు. అంతయూ వ్యర్థమే. యోనిభక్తికి సమానమైన భక్తి మరియొకటి లేనేలేదు. *

**శ్లో॥ పఞ్చవక్త్రైశ్చ దేవేశి! యోనిమాహాత్మ్యమేవ చ ।**
**తదా వక్తుం న శక్నోమి శృణుష్వ నగనన్దిని! ।**
**తవ యోనిప్రసాదేన మహాదేవత్వమాగతః ॥ 8**

**ప్రతిపదార్థం :** దేవేశి! = ఓ దేవతల శాసకురాలా!, యోనిమాహాత్మ్యమ్ = యోనియొక్క గొప్పతనమును, వక్తుమ్ = చెప్పుటకు, పఞ్చవక్త్రైః చ = ఐదుముఖములతోగూడ, తదా ఏవ = అప్పుడైనను, న శక్నోమి = సమర్థుడను కాను, నగనన్దిని = ఓ పార్వతీ!, శృణుష్వ = వినుము, తవ = నీయొక్క, యోనిప్రసాదేన = యోని (శక్తి) ప్రసన్నతచేత, మహాదేవత్వమ్ = మహాదేవస్థానమును, ఆగతః = పొందినవాడనైతిని.

**తాత్పర్యం :** ఓ దేవేశ్వరీ! పార్వతీ! ఐదుముఖములతో గూడ ప్రయత్నించినను యోని మహత్వమును వర్ణించి చెప్పుటకు నేను అసమర్థుడనే. నీ శక్తిప్రసన్నతచేత నేను మహాదేవుడనైనాను.

మహాదేవ శబ్దానికి వ్యుత్పత్త్యర్థం దేవతలలో శ్రేష్ఠుడు, అని. ఆ ఖ్యాతికి కారణం పార్వతీశక్తియే యని శివుని భావం. *

**శ్లో॥ నవీనకున్తలాం యోనిం మర్దయేద్యో హి సాధకః ।**
**స ముక్తో హి మహద్దుఃఖాత్ ఘోరసంసారసాగరాత్ ॥ 9**

**శ్లో॥ బహునా కిమిహోక్తేన శృణు పార్వతి! సున్దరి! ।**
**వక్తుం కోఽపి యోనితత్త్వం లోకే కోఽపి ప్రశస్యతే ॥ 10**

**ప్రతిపదార్థం :** యః హి సాధకః = ఏ సాధకుడైతే, నవీనకున్తలామ్ = క్రొత్తగా మొలిచిన వెంట్రుకలుగల, యోనిమ్ = యోనిని, మర్దయేత్ = మర్దించునో, సః హి = ఆతడే, ఘోరసంసారసాగరాత్ = ఘోరమైన సంసారమను సముద్రమునుండి, మహత్ దుఃఖాత్ = గొప్ప దుఃఖమునుండి, ముక్తః = ముక్తుడు, సున్దరి! పార్వతి! = అందమైన ఓ పార్వతీ!, శృణు = వినుము, ఇహ = ఇప్పుడు, బహునా ఉక్తేన = ఎన్నియో చెప్పినందుచే, కిమ్ = ఏమి లాభము?, యోనితత్త్వమ్ = శక్తితత్త్వమును, వక్తుమ్ = చెప్పుటకు, లోకే = లోకమున, కః అపి కః అపి = ఎంతటివాడైన, ఎవడు, ప్రశస్యతే = సమర్థుడగును?

**తాత్పర్యం :** ఏ సాధకుడు క్రొత్తగా మొలిచిన వెంట్రుకలు గల యోనిని మర్దించునో వాడు భయంకరమైన సంసారసముద్రాన్ని తరించగలడు, కడపట ముక్తుడు కాగలడు. ఓ పార్వతీ! లోకంలో ఎంతటివాడైనా యోనితత్త్వాన్ని విశదీకరించుటకు ఎవడూ సమర్థుడు కాడు. *

**శ్లో॥ శివం విష్ణుం వినా దేవి! కః క్షమో వర్ణితుం భవేత్ ।**
**క్షమస్వ మమ దౌర్బల్యం మాతర్దుర్గే! క్షమస్వ మామ్ ।**
**చాపల్యాత్త్వం మయా కిఞ్చిద్వర్ణితం తవ సన్నిధౌ ॥ 11**

**ప్రతిపదార్థం :** దేవి! = ఓ దేవీ!, శివం విష్ణుం వినా = శివుడు విష్ణువు కాక, వర్ణితుమ్ = వివరించుటకు, కః = ఎవడు, క్షమః = సమర్థుడు, భవేత్ = అగును?, చాపల్యాత్ = చపలబుద్ధివలన, తవ సన్నిధౌ = నీ సమక్షమున, మయా = నాచేత, కిఞ్చిత్ = కొంచెము, వర్ణితమ్ = వర్ణింపబడినది, మాతః దుర్గే = అమ్మా దుర్గా!, త్వమ్ = నీవు, మమ = నాయొక్క, దౌర్బల్యమ్ = బలహీనతను, క్షమస్వ = క్షమించుము, మామ్ = నన్ను, క్షమస్వ = క్షమించుము.

**తాత్పర్యం :** దేవీ! శివుడు, విష్ణువు కాక సమగ్రంగా వర్ణించి చెప్పుటకు మరెవడును సమర్థుడు కాడు. నేను చంచలబుద్ధినై నీ సమక్షంలో కొంత వివరించుటకు పూనుకొన్నాను. నా బలహీనతను మన్నించు. నన్ను మన్నించు, తల్లీ దుర్గా!

ఈ మాటలంటూన్నది మహాదేవుడు, అంటే శివుడే కదా! మరి, శివుడికి సాధ్యమంటూనే, తాను శివుడు కానట్లు, చాపల్యమూ బలహీనత కారణంగా తన అసమర్థతను మరచి ఆమె సమక్షంలో యేదో చెప్పే ప్రయత్నం చేసినట్లు ఈ ప్రకటన కర్థమేమి? శివుడు, మహాదేవుడు, సదాశివుడు, రుద్రుడు ఇత్యాది పేర్లన్నీ శివశబ్ద పర్యాయాలుగానే శబ్దార్థకోశాలు సూచిస్తూన్నాయి. కాని ఈ శబ్దాల వ్యుత్పత్తులు వేరైనట్లు వీరి మూర్తులు వేరు, వీరి వీరి గుణకర్మలు వేరు, అంటారు విజ్ఞులు. ఈ విషయాన్నిక్కడ స్మరించవలె నని తోస్తూన్నది.

తన భార్యగా ఆమెను గుర్తిస్తూ కూడా, మాతర్దుర్గే (అమ్మా దుర్గా!) అన్న సంబోధన సమంజసమా? అంటే, తన భార్యలోని జగన్మాతృదుర్గాంశను స్మరించి యీ సంబోధన. ✻

**శ్రీదేవ్యువాచ** = శ్రీదేవి ఇట్లనెను.

**శ్లో॥ దేవదేవ! జగన్నాథ! సృష్టిస్థిత్యన్తకారక! ।**
**వీరసాధనకర్మాణి శ్రుతాని త్వన్ముఖాత్ప్రభో! ॥ 12**

**శ్లో॥ సుగమం సాధనం దేవ! శ్రుతం బహువిధం మయా ।**
**యత్త్వయా కథితం దేవ! కలౌ తచ్చ కథం భవేత్ ।**
**విశ్వాసోఽత్ర మహాదేవ! సంశయోఽభూత్సదా మమ ॥ 13**

**ప్రతిపదార్థం :** దేవదేవ = ఓ దేవదేవ!, జగన్నాథ = ఓ జగత్పతీ!, సృష్టిస్థితి+అన్త =

సృష్టి, స్థితి, లయములను, కారక = చేయువాడా!, త్వత్ + ముఖాత్ = నీనోట, ప్రభో = ఓ స్వామీ!, వీరసాధనకర్మాణి = శక్తిసాధనపద్ధతులు, శ్రుతాని = వినబడినవి. దేవ! = ఓ దేవా!, మయా = నాచేత, బహువిధమ్ = అనేకరీతుల, సుగమమ్ = సులభమైన, సాధనమ్ = సాధనపద్ధతి, శ్రుతమ్ = వినబడినది, దేవ! = ఓ దేవా!, యత్ = ఏది, త్వయా = నీచేత, కథితమ్ = చెప్పబడినదో, తత్ చ = అదియైతే, కలౌ = కలియుగమున, కథమ్ = ఎట్లు, భవేత్ = సంభవించును?, అత్ర = ఈ విషయమున, మహాదేవ! = ఓ మహాదేవ!, సదా = ఎల్లప్పుడు, మమ = నాయొక్క, విశ్వాసః = నమ్మకము, సంశయః = సంశయముగా, అభూత్ = అయినది.

**తాత్పర్యం :** దేవదేవా! జగన్నాథ! సృష్టించువాడవు, పోషించువాడవు, నశింపజేయు వాడవును నీవు. నీవు చెప్పగా శక్తిసాధనలగూర్చి విన్నాను. సులభసాధ్య పద్ధతులేయైనను, వానిని యీ కలియుగములో అనుసరించి సాఫల్యమును పొందుట సంభవమా? అని నాకు పదే పదే శంక కలుగుతూండేది పూర్వం.

**సంశయోఽభూత్** అని భూతకాలరూపాన్ని ప్రయోగించటం బట్టి దేవి పార్వతికి ఆ సంశయం తీరిపోయినట్లు భావించవచ్చు. *

మహాదేవ ఉవాచ = మహాదేవు డిట్లనెను.

**శ్లో॥ శృణు పార్వతి! చార్వఙ్గి! శృణుష్వ నగనన్దిని ।**
**శృణు త్వం పరయా భక్త్యా సావధానం శృణుష్వ మే ॥** 14

**ప్రతిపదార్థం :** చారు + అఙ్గి! = అందమైన అవయవములుగల, పార్వతి! = ఓ పార్వతీ!, శృణు = వినుము, నగనన్దిని = పర్వతరాజగు హిమవంతుని ఆనందింపజేయు హైమావతీ!, శృణుష్వ = వినుము, త్వమ్ = నీవు, పరయా భక్త్యా = పరమభక్తితో, సావధానమ్ = శ్రద్ధగా మనసు పెట్టి, మే = నావి (నా మాటలు), శృణు శృణుష్వ = వినుము వినుము.

**తాత్పర్యం :** ఓ అందమైన పర్వతరాజపుత్రీ, పార్వతీ! నా మాటలు శ్రద్ధగా మనసుంచి భక్తితో వినుము. *

**శ్లో॥ యస్మై కస్మై న దాతవ్యం ప్రాణాన్తేఽపి న సంశయః ।**
**స్వయోనిరివ దేవేశి! గోపనీయం సదా ప్రియే! ॥** 15

**శ్లో॥ నిగూఢం తే ప్రవక్ష్యామి సత్యం సత్యం సునిశ్చితమ్ ।**
**యస్యానుష్ఠానమాత్రేణ భవాబ్ధౌ న నిమజ్జతి ॥** 16

**ప్రతిపదార్థం :** దేవేశి! = దేవతల కీశ్వరీ!, స్వయోనిః ఇవ = తన శక్తిని వలె, సదా =

ఎల్లవేళల, గోపనీయమ్ = దాచియుంచదగినది, ప్రియే = ఓ ప్రియురాలా!, ప్రాణాన్తే అపి = ప్రాణము పోవునపుడైన, యస్మై కస్మై = ఎవనికో ఒకనికి (అయోగ్యునికి), న దాతవ్యమ్ = ఇవ్వదగినది కాదు, న సంశయః = అనుమానము లేదు, యస్య = దేనియొక్క, అనుష్ఠానమాత్రేణ = అనుష్ఠానముచేత, భవ+అబ్ధౌ = సంసారసాగరమున, న నిమజ్జతి = మునుగకుండునో, (అట్టి) సునిశ్చితం సత్యమ్ = నిశ్చయమైన సత్యమును, నిగూఢమ్ = రహస్యమైనదానిని, తే = నీకు, ప్రవక్ష్యామి = చెప్పుచున్నాను, సత్యమ్ = నిజము.

**తాత్పర్యం :** దేవతల కారాధ్యురాలా, ఓ ప్రియురాలా! అతిరహస్యము, స్వయోనివలె కాపాడుకోదగినది, సత్యము, అయిన విషయమును నీకు చెప్పుచున్నాను. ఎవనికో ఒకనికి యోగ్యతలెంచక ప్రాణాపాయస్థితిలోనైన ఇవ్వరానిదిది. దీనిని అనుష్ఠించిన మాత్రంచేత సంసారసముద్రంలో మునుగక తరింతురు. ఇది సత్యము.

సాధారణంగా మంత్రవిద్యనుపాసించినవారు తమ విద్యను వేరొకని కుపదేశించటం విధిగా పాటిస్తారు. ఒకవేళ యోగ్యుడైనవాడు లభించకుంటే, యోగ్యత తెలుసుకునేంత వ్యవధి లేకుంటే, తనకు మరణమాసన్నమవుతూన్న సమయంలో ఎవరికో ఒకరికి భగవంతునిపై భారంవేసి తన మంత్రాన్ని ఉపదేశించటం సంభవం. కనుక యోనితంత్రం విషయంలో ఏమరుపాటు అసలే కూడదని ఈ హెచ్చరిక. ✻

**శ్లో॥ యోనిరూపా మహామాయా లిఙ్గరూపస్సదాశివః ।**
**రేతసా తర్పణం తస్యా మద్యైర్మాంసైశ్చ సున్దరి ॥ 17**

**ప్రతిపదార్థం :** సున్దరి = ఓ సుందరీ!, యోనిరూపా = యోనిరూపముగలది, మహామాయా = మహాప్రకృతి, లిఙ్గరూపః = లింగరూపముగలవాడు, సదాశివః = సదాశివుడు, తస్యాః = ఆమెకు, ఆ ప్రకృతికి, రేతసా = వీర్యముతో, చ = మరియు, మద్యైః = వివిధములైన మధువులతో, మాంసైః = మాంసములతో, తర్పణమ్ = నైవేద్యము.

**తాత్పర్యం :** ఓ సుందరీ! యోనిరూపమున ఉన్న స్త్రీ ఆద్యాప్రకృతి. లింగరూపమున ఉన్న పురుషుడు సదాశివుడు. ఆద్యాప్రకృతిని సంతోషపెట్టేవి రేతస్సు, మద్యం, మాంసం వీటిని నైవేద్యంగా సమర్పించవలె. ✻

**శ్లో॥ యోన్యాం లిఙ్గం సముత్క్షిప్య తత్త్వమాదాయ సున్దరి! ।**
**యోనౌ కిఞ్చిద్వినిక్షిప్య శక్తౌ సర్వం సమర్పయేత్ ॥ 18**

**శ్లో॥ తత్త్వేన తోషయేద్దేవీం భగరూపాం జగన్మయీమ్ ।**
**ప్రత్యాద్యాతేన దేవేశి! బ్రహ్మహత్యా వ్యపోహతి ॥ 19**

**ప్రతిపదార్థం :** సున్దరి! = అందమైన, దేవేశి! = ఓ దేవేశ్వరీ!, యోన్యామ్ = యోనియందు, లిఙ్గమ్ = లింగమును, సముత్క్షిప్య = చక్కగా ఉంచి, తత్త్వమ్ = సారమును, ఆదాయ = తీసికొని, కిఞ్చిత్ = కొంచెముగ, యోనౌ = యోనియందు, వినిక్షిప్య = ఉంచి, సర్వమ్ = అంతటిని, శక్తౌ = శక్తియందు, సమర్పయేత్ = సమర్పించవలెను. భగరూపామ్ = యోనిరూపమున ఉన్న, జగన్మయీం దేవీమ్ = జగత్తునిండ వ్యాపించియున్న దేవీ దుర్గను, తత్త్వేన = ఆ సారముతో, తోషయేత్ = సంతోషపెట్టవలెను, ప్రత్యాద్యాతేన = విరుద్ధముగ ప్రవర్తించుటచేత, బ్రహ్మహత్య = బ్రహ్మహత్యాపాతకము, వ్యపోహతి = సంక్రమించుచున్నది.

**తాత్పర్యం :** ఓ దేవేశ్వరీ, సుందరీ! యోనియందు లింగమునుంచి, వాని స్రావముల దీసికొని, కొద్దిగా యోనియందుంచి, మిగతదంతయును యోనిరూపశక్తికే సమర్పించవలెను. భగరూపముదాల్చినది జగద్ధాత్రీ ఆద్యాప్రకృతి శక్తి. ఆమెను ఆనందింప జేయవలెను. ఇందుకు భిన్నముగ వ్యవహరించినచో, వానికి బ్రహ్మహత్యాపాతకమంటును. *

**శ్లో॥ నాల్పపుణ్యరతాం దుర్గే! విశ్వాసో జాయతే ధ్రువమ్ ।**
**విశ్వాసాత్ సిద్ధిమాప్నోతి విశ్వాసాన్మోక్షమేవ చ ।**
**అవిశ్వాసాచ్చ దేవేశి! నరకం జాయతే ధ్రువమ్ ॥ 20**

**ప్రతిపదార్థం :** దేవేశి! దుర్గే! = దేవతల శాసించు ఓ దుర్గా!, అల్పపుణ్యరతామ్ = పుణ్యమున ఆసక్తి అల్పమైనవారికి, ధ్రువమ్ = నిశ్చయముగా, విశ్వాసః = విశ్వాసము, న జాయతే = కలుగదు, విశ్వాసాత్ = నమ్మకమునుండి, సిద్ధిమ్ = సిద్ధిని, ఆప్నోతి = పొందుచున్నాడు, విశ్వాసాత్ = నమ్మకమునుండి, మోక్షం ఏవ చ = మోక్షమును గూడ, అవిశ్వాసాత్ చ = అపనమ్మకమునుండి మాత్రము, ధ్రువమ్ = నిశ్చయముగా, నరకమ్ = నరకము, జాయతే = కలుగును.

**తాత్పర్యం :** ఓ దుర్గా! పుణ్యకర్మలయందాసక్తి అధికముగ గలవారికే విశ్వాసమేర్పడును, అల్పపుణ్యులకు కాదు. విశ్వాసమువలన సిద్ధి, మోక్షము కలుగుతవి. అవిశ్వాసం నరకమునకు దారి.

**శ్లో॥ సర్వసాధనమధ్యే తు యోనిసాధనముత్తమమ్ ।**
**భుక్త్వా పీత్వా చ దేవేశి యది యోనిం ప్రపూజయేత్ ।**
**కోటిజన్మార్జితం పాపం తత్క్షణాదేవ నశ్యతి ॥ 21**

**ప్రతిపదార్థం :** దేవేశి = ఓ దేవేశ్వరీ!, సర్వసాధనమధ్యే తు = అన్ని సాధనలలోనైతే, యోనిసాధనమ్ = యోనిసాధనము, ఉత్తమమ్ = శ్రేష్ఠము, భుక్త్వా = తిని, పీత్వా చ = త్రాగి కూడ, యోనిమ్ = యోనిని (శక్తిని), యది ప్రపూజయేత్ = పూజించినట్లయిన,

కోటిజన్మ + అర్జితమ్ = కోటిజన్మలలో సంపాదించికొన్న, పాపమ్ = పాపము, తత్ క్షణాత్ ఏవ = ఆ క్షణములోనే, నశ్యతి = నశించును.

**తాత్పర్యం :** ఓ దేవేశ్వరీ! సాధనలలోకెల్ల యోని (శక్తి) సాధన సర్వోత్తమము. తింటూ త్రాగుతూ కూడ శక్తిని పూజించినట్లయిన కోటిజన్మల పాపం ఆ నిమిషమే నశిస్తుంది. ✻

**శ్లో॥ భోగేన లభతే మోక్షం భోగేన లభతే సుఖమ్ ।**
**తస్మాత్ సర్వప్రయత్నేన సాధకో భోగవాన్ భవేత్ ।**
**యోనినిన్దా ఘృణాలజ్జాం వర్జయేన్మతిమాన్ సదా ॥ 22**

**ప్రతిపదార్థం :** భోగేన = భోగముచే, మోక్షమ్ = మోక్షము, లభతే = లభించును, భోగేన = భోగముచే, సుఖమ్ = సుఖము, లభతే = లభించును, తస్మాత్ = ఆ కారణము వలన, సర్వప్రయత్నేన = అన్నివిధముల ప్రయత్నముతో, సాధకః = సాధకుడు, భోగవాన్ = భోగిగా, భవేత్ = అగును, యోనినిన్దా = యోని (శక్తి) ని నిందించుట, ఘృణా = విముఖత, ద్వేషము, లజ్జామ్ = సిగ్గు, అనువీనిని, మతిమాన్ = మతిమంతుడు, సదా = ఎల్లప్పుడు, వర్జయేత్ = విడువదగును.

**తాత్పర్యం :** భోగమువలన సుఖమూ మోక్షమూ లభిస్తాయి. అందువలన, సాధకుడు ఎంతైన ప్రయత్నించి భోగికావలె. శక్తిరూపంగా గుర్తించక యోనిని నిందించుట, దానిని ద్వేషించుట, సిగ్గుజూపుట అనువానిని బుద్ధిమంతుడు విడిచిపెట్టును. ✻

**శ్లో॥ కులాచారప్రసంగేన యది యోనిం న పూజయేత్ ।**
**కిం తస్య సాధనైర్లక్షైస్సర్వం తస్య వృథా భవేత్ ॥ 23**

**ప్రతిపదార్థం :** కులాచారప్రసంగేన = కులాచారముననుసరించి, యోనిమ్ = యోనిని, యది న పూజయేత్ = పూజించనట్లయిన, తస్య = వానియొక్క, సాధనైః లక్షైః = లక్ష సాధనలచేత, కిమ్ = ఏమి లాభము? తస్య = వానికి, సర్వమ్ = అంతయు, వృథా = వ్యర్థము, భవేత్ = అగును.

**తాత్పర్యం :** కులాచారం ప్రకారం యోనిపూజ చేయకుంటే, వాడు లక్ష సాధనలు చేసినప్పటికి అంతా వ్యర్థమే, లాభమేమియు లేదు. ✻

**శ్లో॥ సూక్ష్మాంశునా యోనిగర్తం మార్జనం కురుతే యది ।**
**తస్య దేహస్య గేహస్య పాపం వినశ్యతి ధ్రువమ్ ।**
**కిం గంగాస్నానమాత్రేణ కిం వా తీర్థనిషేవణాత్ ॥ 24**

**ప్రతిపదార్థం :** సూక్ష్మాంశునా = చిన్న బిందువులతో, యోనిగర్తమ్ = యోనిగుంతను, మార్జనమ్ = శోధించుట, యది కురుతే = చేసినట్లయిన, తస్య = వానియొక్క, దేహస్య

= శరీరముయొక్క, గేహస్య = ఇంటియొక్క, పాపమ్ = పాపము, వినశ్యతి = నశించును, ధ్రువమ్ = నిశ్చయము, గంగాస్నానమాత్రేణ = గంగానదిలో స్నానం చేసినంత మాత్రమున, కిమ్ = ఏమి లాభము?, తీర్థనిషేవణాత్ = పుణ్యతీర్థముల సేవించినందు వలన, కిం వా = లాభమేమి?

**తాత్పర్యం :** పై శ్లోకాలలో ప్రస్తావించిన తత్త్వమును కొన్ని చిన్న బిందువులతో నయినను యోనిగుంతలో శోధించిన సాధకుని దేహగతమైన పాపము, గృహగతమైన పాపము కూడ నశిస్తాయి. ఊరకే గంగాస్నానంచేసిననూ, తీర్థయాత్రలుచేసిననూ నిష్ప్రయోజనమే. ✻

**శ్లో॥ పూజ్యతే సాధకేన్ద్రేణ భగరూపా సదా ప్రియే! ।**
**బహునా కిమిహోక్తేన శృణుష్వ ప్రాణవల్లభే! ॥** 25

**శ్లో॥ పూజనం సాధకానాఞ్చ సర్వసాధారణం ప్రియే! ।**
**పఞ్చతత్త్వం వినా దేవి! చతుర్థఞ్చ వృథా భవేత్ ॥** 26

**ప్రతిపదార్థం :** ప్రియే! ప్రాణవల్లభే! = ప్రియమైన ఓ ప్రాణేశ్వరీ!, సాధకానాం చ = సాధకులకైతే, పూజనమ్ = పూజచేయట అన్నది, సర్వసాధారణమ్ = అందరున్నూ చేసేదే, సాధకేన్ద్రేణ = సాధకశ్రేష్ఠునిచే, సదా = ఎల్లప్పుడు, భగరూపా = యోనిరూపశక్తి, పూజ్యతే = పూజింపబడును, ప్రియే! = ఓ ప్రేయసీ!, దేవి! = ఓ దేవీ!, ఇహ =ఇప్పుడింక, బహునా ఉక్తేన = ఎన్నియో మాటలతో, కిమ్ = ఏమి లాభము, శృణుష్వ = వినుము, పఞ్చతత్త్వం వినా = పంచమకారములు లేక, చతుర్థఞ్చ = కౌలాచారుల పూజావిధానము, వృథా భవేత్ = వ్యర్థమగును.

**తాత్పర్యం :** ప్రాణములకు ప్రాణమైన ఓ దేవీ! సాధకులందరూ పూజ చేసేవారే. సాధకశ్రేష్ఠుడేమో ఎల్లప్పుడూ యోనిరూపశక్తిని పూజిస్తాడు. పలుమాటలేల, దేవీ? విను. పంచమకారాలు లేకుండ కౌలాచారులనుసరించే సాత్త్వికపూజావిధి వలన లాభం లేదు. వృథాశ్రమయే అవుతుంది.

కౌలాచారులు తాత్త్వికతకే అధిక ప్రాధాన్యమిచ్చి, పంచమకారాలైన మద్య మాంస మత్స్య ముద్రా మైథునాలను భౌతికక్రియగా నిర్వహించక, వానికన్నిటికి సాంకేతికార్థాలను ప్రతిపాదించి వానియందే దృష్టిని నిలుపుతారు, కనుక వారిది కేవలం భావనాచారమే. అందువలన యోనితన్త్రం వలన రాదగిన భోగరూపమైన అనుభవం (చూ. శ్లో. 22) వారికి రాదు. వారి సాధన కేవలం సన్యాసుల సాధనవలె సాగుతుంది, ఒక తపశ్చర్యగా ఉంటుంది. ఆ దృష్ట్యా సద్యః ఫలాన్నివ్వదు. ✻

**శ్లో॥ పఞ్చమాత్తు పరం నాస్తి శాక్తానాం సుఖమోక్షయోః ।**
**వినా శక్త్యా చ యత్పానం తత్సర్వం విఫలం భవేత్ ॥** 27

**ప్రతిపదార్థం :** శాక్తానామ్ = శాక్తేయులకు, సుఖమోక్షయోః = సుఖభోగమునకు గాని మోక్షసాధనకుగాని, పఞ్చమాత్ తు = పంచమకారములలో ఐదవదైన మైథునముకంటె, పరమ్ = మించినది, న అస్తి = లేదు, యత్ పానమ్ = ఏ పానము, వినా శక్త్యా = శక్తిలేనిదో, తత్ సర్వమ్ = అదియంతయు, విఫలం భవేత్ = ఫలములేని దగును.

**తాత్పర్యం :** శాక్తేయుల సాధన ఐహికము, ఆముష్మికము, రెండున్నూ లక్ష్యముగ సాగేది, కేవలము ఆముష్మికసాధన కాదు. కనుక వారికి పంచమకారములలో చివరిదైన మైథునం పరమం భోగం. మైథునం శక్తితో సంగమం. అది లేకుండ మద్యసేవనం వలన ఫలం లేదు. ✻

**శ్లో॥ శక్త్యుచ్ఛిష్టం పిబేద్ద్రవ్యం వీరోచ్ఛిష్టం చ చర్వణమ్ ।**
**ఏవం కృత్వా మహాయోనిం పూజయిత్వా దివానిశమ్ ।**
**భుక్త్వా పీత్వా మహేశాని విహరేత్ క్షితిమణ్డలే ॥ 28**

**ప్రతిపదార్థం :** శక్తి ఉచ్ఛిష్టమ్ = శక్తి ఎంగిలిచేసి విడిచిన, ద్రవ్యమ్ = ద్రవమును, పిబేత్ = త్రాగును, వీర+ఉచ్ఛిష్టమ్ =శివరూపుడైన సాధకుడు ఎంగిలిచేసి విడిచిన దానిని, చర్వణమ్ = నమలుట, ఏవమ్ = ఈ విధముగా, కృత్వా = చేసి, మహాయోనిమ్ = యోనిశక్తిని, దివానిశమ్ = పవలు, రాత్రి, పూజయిత్వా = పూజించి, భుక్త్వా = తిని, పీత్వా = త్రాగి, మహేశాని, ఓ మహేశ్వరీ!, క్షితిమణ్డలే = భూమండలమున, విహరేత్ = సంచరించును.

**తాత్పర్యం :** శక్తి యెంగిలి త్రాగి, వీరుని యెంగిలి తిని, ఇట్లు యోనిశక్తిని రేబవళ్ళు పూజించి, భూమండలంపై సంచరించును. ✻

**శ్లో॥ విధృత్య తులసీమాల్యం కుర్యాచ్చ హరిమన్దిరమ్ ।**
**కథోపకథనం వాపి శ్రీహరేర్గుణకీర్తనమ్ ।**
**హరినామ్నా జాతభావో విహరేత్ పశుసన్నిధౌ ॥ 29**

**ప్రతిపదార్థం :** పశుసన్నిధౌ = కేవల జీవభావసాధకుని సాంగత్యము యేర్పడినప్పుడు, తులసీమాల్యమ్ = తులసిదళముల మాలను, విధృత్య = ధరించి, హరిమన్దిరమ్ = విష్ణుమందిరమును తన మందిరముగ, కుర్యాత్ = చేసికొనదగును, చ = మరియు, శ్రీహరేః = విష్ణువుయొక్క, గుణకీర్తనమ్ = గుణములను కొనియాడుట, వా అపి = మరియును, కథోపకథనమ్ = హరికథాకథనశ్రవణములు, (కుర్యాత్ = చేయవలెను), జాతభావః = హరిని మనసున నిలిపి, హరినామ్నా = హరిపేరుతో, విహరేత్ = సంచరించవలెను. ✻

**శ్లో॥ గుప్తా గుప్తతరా పూజా ప్రకటాత్ హానిరేవ చ ।**
**వరం పూజా న కర్తవ్యా పశోరగ్రే చ పార్వతి! ॥** 30

**ప్రతిపదార్థం :** పూజా = ఈ యోనితంత్రపూజావిధానము, గుప్తా = రహస్యము, గుప్తతరా = అతిరహస్యము, ప్రకటాత్ = ప్రకటముగ చేయుటవలన, హానిః ఏవ చ = నష్టమే, పార్వతి! = ఓ పార్వతీ!, పశోః = ఇంద్రియలోలునియొక్క, అగ్రే చ = సమక్షముననైతే, పూజా = పూజ, న కర్తవ్యా = చేయకుండుట, వరమ్ = శ్రేష్ఠము.

**తాత్పర్యం :** ఈ యోనిపూజావిధానం అతిరహస్యం. బహిరంగముగ చేయుట హానికరము. ఓ పార్వతీ! ఇంద్రియలాలసుడైనవాని సమక్షమున ఈ పూజ చేయకుండుటే శ్రేష్ఠము.

కారణము విదితమే. ఇంద్రియలోలునకు ఈ పూజలో దైవత్వము కాక అశ్లీలతయే గోచరించును. *

**శ్లో॥ పుష్పాఞ్జలిత్రయేణాపి యది యోనిం ప్రపూజయేత్ ।**
**తస్యాలభ్యాని కర్మాణి న సన్తి భువనత్రయే ॥** 31

**ప్రతిపదార్థం :** పుష్పాఞ్జలి త్రయేణ అపి = ముమ్మారు పుష్పాంజలితోనైన, యోనిమ్ = యోనిరూపశక్తిని, యది ప్రపూజయేత్ = పూజించినట్లయిన, తస్య = వానికి, భువనత్రయే = మూడు లోకములలో, అలభ్యాని కర్మాణి = లభించని కర్మలు, న సన్తి = ఉండవు.

**తాత్పర్యం :** ముమ్మారు పుష్పాంజలి బట్టి పూజించినచో, ఆ సాధకునికి ఫలించని కార్యములు ముల్లోకములలో ఉండవు. *

**ఇతి యోనితన్త్రే షష్ఠోఽధ్యాయః సమ్పూర్ణమ్ ॥**

---

# సప్తమోఽధ్యాయః

**శ్రీమహాదేవ ఉవాచ** = శ్రీమహాదేవు డిట్లనెను.

**శ్లో॥ అథ వక్ష్యే మహేశాని! వీరసాధనముత్తమమ్ ।**
**యస్య విజ్ఞానమాత్రేణ జీవన్ముక్తశ్చ సాధకః ॥** 1

**ప్రతిపదార్థం :** అథ = తరువాత, మహేశాని! = ఓ మహేశ్వరీ! ఉత్తమమ్ = శ్రేష్ఠమైన, వీరసాధనమ్ = వీరసాధనమును గూర్చి, వక్ష్యే = చెప్పుదును, యస్య = దేనియొక్క, విజ్ఞానమాత్రేణ = జ్ఞానముచేత, సాధకః = సాధకుడు, జీవత్ + ముక్తః = జీవించి యుండగనే ముక్తడగును.

**తాత్పర్యం :** అటు తరువాత, ఓ మహేశ్వరీ! ఉత్తమ వీరసాధన గూర్చి వివరించెదను. దీని గురించి తెలిసికొన్నంత మాత్రమున సాధకుడు జీవన్ముక్తుడు కాగలడు. *

**శ్లో ॥ దివ్యస్తు దేవవత్ప్రాణో వీరశ్చోద్ధతమానసః ।**
**యద్దేశే విద్యతే వీరః సదేశః పూజ్యతే సురైః ॥ 2**

**ప్రతిపదార్థం :** దివ్యః తు = దివ్యభావ సాధకుడైతే, దేవవత్ = దేవతలవలె, ప్రాణః = ప్రాణప్రదుడవును; వీరః చ = వీరభావసాధకుడేమో, ఉద్ధతమానసః = ప్రచండ స్వతంత్ర మనస్కు డగును; యత్ దేశే = ఏ దేశంలో, వీరః = వీర సాధకుడు, విద్యతే = ఉండునో, సః = ఆ దేశము, సురైః = దేవతలచే, పూజ్యతే = పూజింపబడును.

**తాత్పర్యం :** దివ్యభావసాధకుడు దేవతలతో సమానుడువుతాడు. వీరభావసాధకుడేమో మానసికంగా ప్రచండస్వభావుడు, ఆవేశపరుడు, స్వతంత్రుడు. వీరసాధకుడు యే దేశంలో నివసిస్తే ఆదేశం దేవతలకున్నూ పూజనీయమవుతుంది.

శక్తి సాధకులు పశుభావసాధకులు, వీరభావసాధకులు, దివ్యభావసాధకులని మూడు విధాలు, పశుసాధకులు శరీరసాధనలే సర్వస్వంగా భావిస్తారు. వీరసాధకులు ఉగ్రస్వభావులు. భోగమోక్షాలను రెండిటిని ఒకే సాధనతో సాధించాలని భావిస్తారు. దివ్యభావసాధకులు సాత్త్వికులు, తీవ్రమైన భౌతికభోగాలకు దూరంగా ఉంటూ ఆత్మసాక్షాత్కారానికై ప్రయత్నించేవారు. ఈ క్రమంలో వీరిని తామసికులు, రాజసికులు, సాత్త్వికులుగా గుణవిభజన చేస్తారు. *

**శ్లో ॥ వీరదర్శనమాత్రేణ తీర్థకోటిఫలం లభేత్ ।**
**వీరహస్తే జలం దత్త్వా ముక్తః కోటికులైస్సహ ॥ 3**

**ప్రతిపదార్థం :** వీరదర్శనమాత్రేణ = వీరభావసాధకుని దర్శించిన మాత్రమున, తీర్థకోటిఫలమ్ = కోటి తీర్థయాత్రల ఫలము, లభేత్ = చేకూరును; వీరహస్తే = వీరభావుని చేతిలో, జలం దత్త్వా = నీరుపోసినచో, కోటికులైః సహ = కోటిమంది వంశజులతో కూడ, ముక్తః = ముక్తుడగును.

**తాత్పర్యం :** వీరభావసాధకుని దర్శనమే కోటి తీర్థయాత్రల ఫలాన్నిస్తుంది. వాని చేతిలో నీరు పోస్తే కోటిమంది వంశజులతో మోక్షాన్ని పొందుతాడు. *

**శ్లో ॥ వీరం సంతోష్య దేవేశి! కిమలభ్యం జగత్త్రయే ।**
**వీరాణాం జపకాలస్తు సర్వకాలః ప్రశస్యతే ॥ 4**

**ప్రతిపదార్థం :** దేవేశి! = ఓ దేవేశ్వరీ! వీరమ్ = వీరభావసాధకుని, సంతోష్య = సంతోష పరచినచో, జగత్ త్రయే = ముల్లోకములలో, అలభ్యమ్ = లభించనిది, కిమ్

= ఏమి?,వీరాణామ్ = వీరులకు, జపకాలః తు = జపముచేయదగిన కాలమైతే, సర్వకాలః = అన్ని వేళలుగా, ప్రశస్యతే = ప్రసిద్ధమైనది.

**తాత్పర్యం :** వీరభావసాధకుని సంతోషపరచిన వానికి లభించని దేదీ లేదు. వీరులు జపము చేయదగిన సమయము ప్రత్యేకించి లేదు, అన్ని వేళల జపించవచ్చును. ✻

**శ్లో ॥ బిల్వమూలే శ్మశానే వా ప్రాన్తరే వా గృహేఽథవా ।**
**ఏకలిఙ్గే మహాయోనౌ జప్యతే సాధకోత్తమైః ॥ 5**

**ప్రతిపదార్థం :** బిల్వమూలే = బిల్వవృక్షము క్రింద, వా = లేక, శ్మశానే = శ్మశానమున, వా = లేక, ప్రాన్తరే = వనప్రాన్తంలో, వా = లేక, గృహే = ఇంటియందు, అథవా = కాకున్న, ఏకలిఙ్గే = ఒకే లింగముగల, మహాయోనౌ = శక్తిపీఠమున, సాధకోత్తమైః = ఉత్తమ సాధకులచే, జప్యతే = జపించబడును.

**తాత్పర్యం :** ఉత్తమసాధకులు మారేడుచెట్టు క్రింద గాని, శ్మశానంలో గాని, వనప్రాంతంలో గాని, ఇంటిలో గాని, ఒకే లింగమున్న యోనిపీఠమందిరంలోగాని జపం చేస్తారు. ✻

**శ్లో ॥ సర్వేషామన్నమాశ్రిత్య కుర్యాత్ స్వోదరపూరణమ్ ।**
**మద్యం మాంసం వినా దేవి క్షణోర్ధ్వం న జీవతి ॥ 6**

**ప్రతిపదార్థం :** సర్వేషామ్ = అందరియొక్క, అన్నమ్ = అన్నమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, స్వ= తనదైన, ఉదర = కడుపును, పూరణమ్ = నింపుకొనుట, కుర్యాత్ = చేయదగును, మద్యమ్ = మద్యము, మాంసమ్ = మాంసము, వినా = లేకుండ, దేవి = ఓ దేవీ! క్షణ + ఊర్ధ్వమ్ = నిమిషమునకు మించి, న జీవతి = జీవించియుండడు.

**తాత్పార్యం :** బ్రహ్మచారివలె, సంన్యాసివలె, వీరభావసాధకుడు అన్ని వర్ణముల వారి ఇండ్లలో భిక్షాటన చేసి ఆకలి తీర్చుకొనును. ఓ దేవీ! మద్యమాంసములు లేకుండ అతడు ఒక్క క్షణమైన జీవించలేడు. ✻

**శ్లో ॥ తస్మాత్ భుక్త్వా చ పీత్వా చ విహరేత్ క్షితిమణ్డలే ।**
**సర్వేషామన్నమాసాద్య భోజనం చాకుతోభయమ్ ॥ 7**

**ప్రతిపదార్థం :** తస్మాత్ = అందువలన, భుక్త్వా చ = తినియును, పీత్వా చ =త్రాగియును, క్షితిమణ్డలే = భూమండలమున, విహరేత్ = సంచరించును; సర్వేషామ్ = అందరియొక్క, అన్నమ్ = అన్నమును, ఆసాద్య = స్వీకరించి, భోజనమ్ = భోజనము; అకుతోభయమ్ = నిర్భయము.

**తాత్పర్యం :** అందువలన తినియును, త్రాగియును, నిషేధములు లేకుండ అన్ని వర్ణముల వారినుండి భోజనము స్వీకరించి నిర్భయముగా, భూమండలమున సంచరించును.

**అకుతోభయమ్**, నిర్భయము, ఎందుకనగా, సమాజములో అందరకును ఆహార విషయమున విధినిషేధములున్నవి. వీరికి అవేమియు లేవు. ✻

**శ్లో ॥ మైథునఞ్చ మహేశాని! సర్వయోనౌ ప్రశస్యతే।**
**కదాచిచ్చన్దనేనాపి కదాచిత్సురయాపి వా ॥ 8**

**ప్రతిపదార్థం :** మహేశాని! = మహేశ్వరీ!, మైథునం చ = మైథునమున్నూ, సర్వయోనౌ = అన్ని యోనులందు, ప్రశస్యతే = ప్రసిద్ధవ్యవహారముగనున్నది; కదాచిత్ = ఒకప్పుడు, చన్దనేన అపి = చందనలేపముతోను, కదాచిత్ = మరియొక్కప్పుడు, సురయా అపి వా = మద్యపుమైపూతతోను.

**తాత్పర్యం :** ఓ మహేశ్వరీ! వీరసాధకునకు అన్ని ప్రాణుల యోనులయందును మైథునము చెప్పిబడినది, ఆచారమందున్నది. ఆతడొకప్పుడు చందనం పూసికొనియు, మరొకప్పుడు మద్యం పూసికొనియు సంచరించును. ✻

**శ్లో ॥ లేపనఞ్చ సదా కుర్యాత్పఙ్కేన రజసాపి వా ।**
**సదానన్దమయో దుర్గే! వీరశ్చాపి విరాజతే ॥ 9**

**ప్రతిపదార్థం :** దుర్గే! = ఓ దుర్గా!, వీరః చ = వీరభావసాధకుడేమో, సదా = ఎల్లప్పుడు, పంకేన = బురదతో, వా = లేక, రజసా అపి = ధూళితోగాని, లేపనం చ = మైపూతను, కుర్యాత్ = చేయును, సదా = ఎప్పుడును, ఆనన్దమయః = ఆనందమయుడై, విరాజతే = ప్రకాశించుచుండును.

**తాత్పర్యం :** ఓ దుర్గా! వీరభావసాధకుడు ఎప్పుడును బురదనుగాని ధూళినిగాని మైపూతగా పూసికొని ఆనందముతో ప్రకాశించుచుండును. ✻

శ్లో .8 ఉత్తరార్ధం ఈ శ్లోకంతో కలిపి అన్వయం.

**శ్లో ॥ తత్సాధనమహం వక్ష్యే సర్వం సర్వార్థసాధనమ్ ।**
**స్నానాదిర్మానసశ్శౌచో మానసః ప్రవరో జపః ॥ 10**

**శ్లో ॥ పూజనం మానసం దివ్యం మానసం తర్పణాదికమ్ ।**
**సర్వమేవ శుభః కాలో నాశుభో విద్యతే క్వచిత్ ॥ 11**

**ప్రతిపదార్థం :** సర్వ + అర్థసాధనమ్ = అన్ని పురుషార్థములను సాధించగల, తత్ సాధనమ్ = ఆ సాధనమును, సర్వమ్ = అంతయు, అహమ్ = నేను, వక్ష్యే = చెప్పుదును, స్నాన+ఆదిః = స్నానము మొదలగునవి, మానసః = మానసికములే, చ = మరియు, శౌచః = శుచిగా ఉండుట, మానసః = మనః సంబంధి, పూజనమ్ = పూజచేయుట, మానసమ్ = మానసికము, దివ్యమ్ = దివ్యమైన, తర్పణ+ఆదికమ్ = నైవేద్యము

మొదలుగా గలవి, మానసమ్ = మానసికము, ప్రవరః = అగ్ని నాహ్వానించుట, జపః = జపము; కాలః = కాలము, సర్వం+ఏవ = అంతయు, శుభః = శుభప్రదమే, అశుభః = శుభముకానిది, క్వచిత్ = ఏదియు, న విద్యతే = లేదు, ఉండదు.

**తాత్పర్యం :** అన్ని పురుషార్థములను సాధించగల సాధనమేదో దానినంతయు చెప్పుదును. స్నానము, శౌచము, జపము, పూజ, నైవేద్యము, అన్నియు దివ్యములు, మానసికములు, వీనికి నియతకాలము లేదు. అన్ని వేళలా చేయవచ్చును. దుర్ముహూర్తములు, వర్జ్యములు లేవు. కాలగతిలో కొన్ని సమయములు శుభములని, కొన్ని అశుభములని ఉండవు. అన్నీ శుభప్రదములే.

స్నానాదికములన్నిటికి భౌతికకార్యరూపములున్నవి, అవి ఈ వీరసాధకులాచరించక పోయిననూ లోపము, దోషము లేదు. **కాలము శివస్వరూపము, సర్వము శుభప్రదమే.** ✻

**శ్లో ॥ న విశేషో దివారాత్రౌ న సన్ధ్యాయాం మహానిశి ।**
**వస్త్రాసనస్నానగేహదేహస్పర్శాదికేష్వపి ॥ 12**

**శ్లో ॥ శుద్ధిం విచారయేన్నాత్ర నిర్వికల్పం మనశ్చరేత్ ।**
**దిక్కాలనియమో నాస్తి స్థిత్యాది నియమో న చ ॥**
**న జపే కాలనియమో నార్చాదిషు బలిష్వపి ॥ 13**

**ప్రతిపదార్థం :** దివారాత్రౌ = పవలురాత్రులందు, న విశేషః = విశేషములేదు; సన్ధ్యాయామ్ = సంధ్యాసమయంలో, మహానిశి = అర్ధరాత్రియందు, న = లేదు; వస్త్ర = కట్టుగుడ్డలలో, ఆసన = కూర్చొను పీఠము విషయమున, స్నాన = స్నానమున, గేహ = ఇంటివిషయంలో, దేహస్పర్శాదికేషు అపి = దేహమును తాకుట మొదలగు విషయములలోను, శుద్ధిమ్ = శుభ్రతను, న విచారయేత్ = ఆలోచించుట లేదు; అత్ర = ఈ విషయములలో, మనః = మనస్సు, నిర్వికల్పమ్ = చలింపక , చరేత్ = సంచరించును, దిక్ + కాల = దేశము కాలము గురించి, నియమః = నియమము, న అస్తి = లేదు; స్థితి + ఆది = నివాసము, మొదలగువాని గురించి, చ = కూడ, నియమః = నియమము, న = లేదు; జపే = జపించుటయందు, కాలనియమః = ఈ యా సమయమన్న విధి న = లేదు; అర్చా+ఆదిషు = పూజ మొదలగు వాని యందు, బలిషు అపి = నైవేద్యములయందు గూడ, న = లేదు.

**తాత్పర్యం :** రాత్రికీ పగటికీ విశేషభేదం లేదు. అట్లే సంజవేళకు అర్ధరాత్రికి గూడ. వస్త్రధారణ, ఆసనసేకరణ, స్నానం, దేహగృహాదుల పరిశుభ్రత, ఈ ఆలోచనలేక, **నిర్మలమైన మనస్సుతో ఎప్పుడూ ఉంటాడు వీరభావసాధకుడు.** ఏ దేశమైన, యేకాలమైన తానుండుటకు, తన

సాధనలకు తగినదే, మంత్రజపము చేయుటకు నియతమైన కాలమొకటి లేదు. పూజ విషయమునగూడ ఇట్లే నైవేద్యమునకు విధినిషేధములు లేవు. *

**శ్లో ॥ స్త్రీద్వేషో నైవ కర్తవ్యా విశేషాత్పూజనం స్త్రియాః ।**
**స్త్రియం గచ్ఛన్ స్పృశన్పశ్యన్యత్ర కుత్రాపి సాధకః ।**
**దత్త్వా భక్ష్య జపేన్మన్త్రం భక్ష్యద్రవ్యం యథారుచి ॥ 14**

**శ్లో ॥ స్వేచ్ఛానియమః సంప్రోక్తో వీరసాధనకర్మణి ।**
**స్త్రియో దేవాః స్త్రియః ప్రాణాః స్త్రియః పరమభూషణమ్ ॥ 15**

**ప్రతిపదార్థం :** స్త్రీద్వేషః = స్త్రీని ద్వేషించుట, కర్తవ్యా న+ఏవ = చేయనేకూడదు; విశేషాత్ = విశేషముగా, స్త్రియాః = స్త్రీయొక్క, పూజనమ్ = పూజ, (కర్తవ్యా = చేయదగినది), స్త్రియమ్ = స్త్రీని, సాధకః = సాధకుడు, యత్ర కుత్ర అపి = ఎక్కడో ఒక చోట, గచ్ఛన్ = కూడుచు, స్పృశన్ = తాకుచు, పశ్యన్ = చూచుచు, భక్ష్య = భక్ష్యమును, దత్త్వా = ఇచ్చి, మన్త్రః = మంత్రము, జపేత్ = జపించవలెను; భక్ష్యద్రవ్యమ్ = భక్ష్యపదార్థము, యథారుచి = ఆ స్త్రీ రుచిని బట్టి, స్త్రియః = స్త్రీలు, దేవాః = దేవతలు, స్త్రియః = స్త్రీలు, ప్రాణాః = ప్రాణములు, స్త్రియః = స్త్రీలు, పరమభూషణమ్ = గొప్ప ఆభరణము; వీరసాధనకర్మణి = వీరభావ సాంప్రదాయిక సాధన క్రియల విషయమున, స్వేచ్ఛా నియమః = నియమరాహిత్యము, సంప్రోక్తః = చక్కగ చెప్పబడినది.

**తాత్పర్యం :** స్త్రీ ద్వేషము కూడదు, స్త్రీని విశేషించి పూజించవలె. సాధకుడు తన సంచారంలో స్త్రీని చూడటం, తాకటం, కూడటం, ఏది జరిగిననూ, మానసికంగా మంత్రజపం సాగుతూంటుంది. స్త్రీకి భక్ష్యాన్నిచ్చి గౌరవించాలి. ఆమెరుచికి తగిన పదార్థాన్నే ఇవ్వవలె. వీరసాధకునకు స్త్రీలు దేవతలు, స్త్రీలు ప్రాణాలు, స్త్రీలు ఆభరణాలు, వాని సాధనలలో స్వేచ్ఛయున్నది. ఇది ఇట్లే చేయవలె నను నియమంలేదు. *

**శ్లో ॥ స్త్రీసఙ్గినా సదా భావ్యమన్యథా స్వస్త్రియామపి ।**
**తదుక్తం భావసర్వస్వే సర్వతన్త్రేషు గోపితమ్ ॥ 16**

**ప్రతిపదార్థం :** సదా = ఎల్లవేళల, స్త్రీసఙ్గినా = స్త్రీ సంగమముతో, భావ్యమ్ = భావించ దగును; అన్యథా = లేకున్న, స్వస్త్రియాం అపి = తన స్త్రీయందైనను, తత్ = ఈ విషయము, భావసర్వస్వే = భావసర్వమునందు, ఉక్తమ్ = చెప్పబడినది; సర్వతన్త్రేషు = అన్ని తంత్రగ్రంథములలో గోపితమ్ = దాచియుంచబడినది.

**తాత్పర్యం :** స్త్రీసంగమము నెప్పుడూ భావమునందుంచవలె. అనగా శక్తితో కలయికను భావించవలె. లేకుంటే, తన స్త్రీతో సంగమమును భావించవలె, ఈ విషయం

భావసర్వస్వం అను గ్రంథంలో చెప్పబడినది. తన్త్రశాస్త్రాలన్నిటిలోనూ రహస్యముగా దాచియుంచబడినది. *

**శ్లో ॥ వీరసిద్ధివిధానన్తు తవ స్నేహాత్ప్రకాశితమ్ ।**
**ద్రవ్యభక్షణకాలే చ చాదౌ శక్తౌ నివేదయేత్ ॥ 17**

**శ్లో ॥ అథవా ప్రథమం భాగం నిక్షిపేజ్జలమధ్యతః ।**
**శ్మశానే ప్రాన్తరే గత్వా శక్త్యా యుక్తోఽపి సాధకః ॥ 18**

**శ్లో ॥ భుక్త్వా ద్రవ్యం జపేన్మన్త్రం జప్త్వా మైథునమాచరేత్ ।**
**శుక్రోత్సరణకాలే చ శృణు పార్వతి! సున్దరి! ॥ 19**

**శ్లో ॥ యోనితత్త్వం సమాదాయ తిలకం క్రియతే యది ।**
**శతజన్మార్జితం పాపం తత్క్షణాదేవ నశ్యతి ॥ 20**

**ప్రతిపదార్థం :** తవ = నీయొక్క, స్నేహత్ = స్నేహమువలన, వీరసిద్ధివిధానం తు = వీరభావసాధన విధానం మాత్రం, ప్రకాశితమ్ = బహిరంగపరచబడినది. ద్రవ్యభక్షణకాలే = మాంసాది పదార్థాలను తినునప్పుడు, ఆదౌశక్తౌ చ = ఆదిశక్తియందు, నివేదయేత్ = నివేదించవలె;, అథవా = కాకున్న, ప్రథమం భాగమ్ = మొదటి భాగమును, జలమధ్యతః = నీటి మధ్యలో, నిక్షిపేత్ = ఉంచవలె; శ్మశానే = శ్మశానమున, ప్రాన్తరే = వనప్రాంతమున, శక్త్యా = శక్తితో, యుక్తః అపి = కూడియుండినను, గత్వా = వెళ్ళి, ద్రవ్యమ్ = మాంసాది పదార్థమును, భుక్త్వా = తిని, మన్త్రమ్ = మంత్రమును, జపేత్ = జపించవలెను; జప్త్వా = జపించి, మైథునమ్ = సంభోగము, ఆచరేత్ = చేయవలెను; శుక్ర + ఉత్సరణకాలే చ = వీర్యస్ఖలన సమయమున, యోనితత్త్వమ్ = యోనిస్రావమును, సమాదాయ = తీసికొని, తిలకం = తిలకధారణ, యది క్రియతే = చేసినట్లయిన, సున్దరి! పార్వతి! = అందమైన ఓ పార్వతీ ! శతజన్మ = నూరుజన్మలలో, అర్జితం పాపమ్ = కూడగట్టుకొన్న పాపము, తత్క్షణాత్ ఏవ = ఆ క్షణమే, నశ్యతి = నశించును.

**తాత్పర్యం :** నీ యందలి ప్రేమవలన బహిరంగ పరచినాను. వీరభావసాధకుడు మాంసాది ద్రవ్యభక్షణకాలంలో ముందుగా శక్తికి నివేదించవలె. లేకున్న, ప్రథమ భాగాన్ని శక్తితో కూడిన వాడై నీటి మధ్య విడువలె. శ్మశానమునకో లేక వనప్రాంతమునకో వెళ్ళి, మాంసాదులను తిని, మంత్రము జపించి, మైథునము చేసి, వీర్యస్ఖలన మయ్యే సమయంలో యోనిస్రావాన్ని తీసి తిలకధారణ చేసి నట్లయితే శతజన్మల పాపం క్షణమే నశిస్తుంది. *

**శ్లో ॥ ప్రేతభూమేరభావే చ శూన్యాలయగతేఽపి చ ।**
**తద్భావే జపేన్మన్త్రీ చ నిచ్ఛిద్రగృహమధ్యతః ॥ 21**

**ప్రతిపదార్థం :** ప్రేతభూమేః = శ్మశానముయొక్క, అభావే చ = లేమిలోనయితే, శూన్యాలయగతే అపి చ = నిర్జనప్రదేశమునకు వెళ్ళి కూడ, తత్ భావే = ఆ భావన చేసి, నిచ్ఛిద్ర = రంధ్రములులేని, గృహమధ్యతః = ఇంటి నడుమ, మన్త్రీ = మంత్రసాధకుడు, జపేత్ = జపించును.

**తాత్పర్యం :** శ్మశానం లభించనప్పుడు, నిర్జనప్రదేశంలో గాని, రంధ్రములులేని ఇంటిమధ్య గాని సాధకుడు మంత్రజపము చేయవలెను. ✻

**శ్లో ॥ ప్రాణాన్తే చ మహేశాని! న వదేత్పశుసన్నిధౌ ।**
**వీరనిన్దా వృథా పాపం వృథా మైథునమేవ చ ॥ 22**

**శ్లో ॥ వృథాన్నం వర్జయేన్మన్త్రీ వీరసాధనకర్మణి ।**
**మద్యం మాంసం తథా మత్స్యం ముద్రా మైథునమేవ చ ।**
**పఞ్చతత్త్వం వినా దుర్గే! న వీరో జాయతే భువి ॥ 23**

**ప్రతిపదార్థం :** మహేశాని! = ఓ మహేశ్వరీ! ప్రాణాన్తే చ = ప్రాణము పోవునప్పుడు కూడ, పశుసన్నిధౌ = ఇంద్రియలోలుని సమక్షమున, న వదేత్ = చెప్పరాదు; వీరనిన్దా = వీరసాధకుని నిందించుట, వృథా = వ్యర్థం; మైథునం ఏవ చ = మైథునం కూడ, వృథా = వ్యర్థం; పానమ్ = మద్యం త్రాగటం, వృథా = వ్యర్థం ; మన్త్రీ = మంత్రము జపించువాడు, అన్నమ్ = అన్నమును, వృథా = వ్యర్థంగా, వర్జయేత్ = వదిలిపెట్టును; వీరసాధనకర్మణి = వీరసాధన క్రియలు, మద్యమ్ = మద్యము, మాంసమ్ = మాంసము, తథా = అట్లే, మత్స్యమ్ = మత్స్యము, ముద్రా = ముద్ర, మైథనం ఏవ చ = మైథునమున్ను, (అనునవి) పంచతత్త్వమ్ = పంచమకారములు,వినా = లేకయున్న, దుర్గే! = ఓ దుర్గా! వీరః = వీరభావసాధకుడు, భువి = భూమిపై , న జాయతే = ఉండడు.

**తాత్పర్యం :** ఓ మహేశ్వరీ! వీరభావసాధనల రహస్యము మరణమాసన్నమైన సమయంలో నైన పశుభావసాధకుని సమక్షంలో చెప్పరాదు. వీరనిందకుడతడు. ఆతడు ఇంద్రియ లాలసతో మాత్రమే పంచమకారాలను స్వీకరిస్తాడు. పంచతత్త్వం లేకుండ వీరసాధనలూ లేవు. కాని వానియందొక ఆముష్మికదృష్టిలేనప్పుడు అవి యన్నీ వ్యర్థమే. ✻

**శ్లో ॥ అతిగుహ్యతమం దేవి! వీరాణాం సాధనం ప్రియే! ।**
**కిం ద్రవ్యసాధనైర్లక్షైః కిం వీరసాధనైస్తథా ॥ 24**

**శ్లో ॥ కిం కోటి శతజపైశ్చ పురశ్చర్యాశతైస్తథా ।**
**కిం తీర్థసేవనైర్లక్షైః కిం వా తన్త్రాదిసేవనైః ॥ 25**

**శ్లో ॥ కిం పూజాశతలక్షైశ్చ కిం దానైస్తపసాపి వా ।**
**భగం వినా మహేశాని! సర్వఞ్చైవ వృథా భవేత్ ॥ 26**

**ప్రతిపదార్థం :** ప్రియే! దేవి! = ప్రియమైన ఓ దేవీ!, వీరాణాం సాధనమ్ = వీరభావుకుల సాధన, అతిగుహ్యతమమ్ = చాల రహస్యమైనది, ద్రవ్యసాధనైః లక్షైః = లక్షద్రవ్య-సాధనలతో, కిమ్ = ఏమి లాభము? తథా = అట్లే, వీరసాధనైః = వీరసాధనలతో, కిం = ఏమి లాభము? కోటి = కోటి సంఖ్యలో, శతజపైః చ = అష్టోత్తరశతజపములతో గూడ, కిం = లాభమేమి?, తథా = అట్లే, పురశ్చర్యాశతైః = నూరు పురశ్చర్యలతోనూ; లక్షైః తీర్థసేవనైః = లక్షపుణ్యతీర్థముల మునుగుటతో, కిమ్ = ఏమి లాభము? తన్త్ర+ఆది = తంత్రములాది, సేవనైః = పాటించుటతో, కిమ్ = ఏమగును? శతలక్షైః పూజా = కోటిపూజలుచేసినను, కిం చ = మరేమున్నది? దానైః = దానములతో, తపసా అపి వా = లేక తపస్సుతోను కూడ, కిమ్ = ఏమి?, మహేశాని = ఓ మహేశ్వరీ!, భగం వినా = యోనిశక్తిపూజలేక, సర్వం చ+ఏవ = అంతయును, వృథా = నిష్ఫలము, భవేత్ = అగును.

**తాత్పర్యం :** ఓ ప్రియమైన దేవీ, మహేశ్వరీ! వీరసాధకుల సాధన అతిరహస్యమైనది, ద్రవ్య సాధనలు, వీరసాధనలు, జపసంఖ్య, పురశ్చరణసంఖ్య, పుణ్యతీర్థాలలో స్నానాదికం, తంత్ర సాధనలు, పూజలు దానాలు, తపస్సు, ఇన్నీ ఉన్నప్పటికి ప్రయోజనం శూన్యం. యోనిశక్తిసాధన సాధనతో కూడి నప్పుడే వీనికి విలువ. *

**శ్లో ॥ యోనిపూజనమాత్రేణ సర్వసాధనభాగ్భవేత్ ।**
**తర్పణం యోనితత్త్వేన పితరః స్వర్గగామినః ।**
**లాలయేచ్చ సదా యోనిం కున్తలాకర్షనాదినా ॥ 27**

**ప్రతిపదార్థం :** యోనిపూజనమాత్రేణ = యోనిని పూజించిన మాత్రమున, సర్వసాధనభాక్ = సమస్తసాధనలు చేసినంత యోగ్యత, భవేత్ = కలుగును, సదా = ఎల్లప్పుడు, కున్తల+ఆకర్షణ+ఆదినా = వెంట్రుకలను సవరించుట మొదలగు చర్యలతో, యోనిమ్ = యోనిని, లాలయేత్ = లాలింపపదగును; యోనితత్త్వేన = యోనిస్రావముతో, తర్పణమ్ = తర్పణలిచ్చిన, పితరః = పితరులు, స్వర్గగామినః = స్వర్గమునకు పోదురు.

**తాత్పర్యం :** యోనిపూజ యొక్కటి నిర్వహిస్తే, అన్ని సాధనల ఫలమున్నూ లభిస్తుంది. కనుక యోనిని సదా కేశాకర్షణ వంటి చర్యలతో లాలించవలె. యోనిస్రావంతో తర్పణలిస్తే, ఆ సాధకుని పితరులు స్వర్గమునకు పోవుదురు. *

**శ్లో ॥ క్రోడే కృత్వా మహాయోనిం తాణ్డవం కురుతే యది।**
**తదా జన్మాయుతైః పాపైర్ముక్తిః కోటికులైస్సహ ॥ 28**

**ప్రతిపదార్థం :** మహాయోనిమ్ = యోనిరూపమహాశక్తిని, క్రోడే కృత్వా = హృదయంలో పొదువుకొని, తాణ్డవమ్ = తాండవనృత్యమును, కురుతే యది = చేసినట్లయిన, తదా

= అప్పుడు, జన్మ + అయుతైః = పదివేల జన్మలచే పొందిన, పాపైః = పాపములనుండి, కోటికులైః సహ = కోటిమంది వంశజులతో కూడి, ముక్తిః = ముక్తి (లభించును).

**తాత్పర్యం :** యోనిరూపపరాశక్తిని హృదయంలో హత్తుకొని సాధకుడు తాండవం చేసినట్లయిన, ఆతడు పదివేల జన్మల పాపంనుండి తన వంశజులు కోటిమందితో సహ ముక్తుడవుతాడు.

శివపరివారంలోని తండుడనువాడు చేసిన నూతన భంగిమలు గల నృత్యానికి తాండవమని పేరు వచ్చింది.

ఈ శ్లోకాలలోని అయుత, కోటి, లక్ష ఇత్యాది సంఖ్యాపరమైన శబ్దాలకు 'లెక్కలేనన్ని' అని అర్థం. **క్రోడీకరణం** అంటే **కౌగిలింత**. ✻

**శ్లో ॥ శిష్యాణాం కన్యకాయోనిం వధూయోనిం విశేషతః ।**
**కేవలం గన్ధపుష్పేణ పూజయేద్భక్తిభావతః ।**
**ఇహ లోకే సుఖం భుక్త్వా దేవలోకే మహీయతే ॥ 29**

**ప్రతిపదార్థం :** శిష్యాణామ్ = శిష్యురాండ్రయొక్క, కన్యకాయోనిమ్ = కన్యయోనిని, విశేషతః = విశేషించి, వధూయోనిమ్ = వధువుయోనిని, భక్తిభావతః = భక్తితో, కేవలం గన్ధపుష్పేణ = గంధపుష్పాలతో మాత్రము, పూజయేత్ = పూజింపవలెను. ఇహలోకే = ఈ లోకంలో, సుఖమ్ = సుఖమును, భుక్త్వా = అనుభవించి, దేవలోకే = దేవలోకంలో, మహీయతే = గౌరవింపబడును.

**తాత్పర్యం :** శిష్యురాండ్ర కన్యయోనిని, విశేషించి వధువు యోనిని భక్తితో కేవలం గంధపుష్పాల పూజించవలెను. ఇందువలన ఆ సాధకుడు ఈ లోకంలో సుఖించి దేవలోకంలో గౌరవం పొందుతాడు.

వధూయోని అంటే. పెండ్లికూతురుయోని లేక కోడలి యోని లేక ఏ స్త్రీయైన ఒక స్త్రీయోని, అని అర్థం చేయవచ్చు. వీరసాధకులకు నిషేధాలు లేవు కనుక ఏ అర్థన్నయినా సమర్థించవచ్చు. ✻

**శ్లో ॥ అభావే గన్ధపుష్పాభ్యాం కారణేనాపి పూజయేత్‌।**
**పూజాకాలే చ దేవేశి! యది కోఽప్యత్రాగచ్ఛతి ।**
**దర్శయేద్వైష్ణవీం పూజాం విష్ణోర్న్యాసం తథా స్తవమ్ ॥ 30**

**ప్రతిపదార్థం :** దేవేశి! = ఓ దేవేశ్వరీ!, అభావే గన్ధపుష్పాభ్యామ్ = గంధపుష్పాలు లేకున్న, కారణేన అపి = మద్యముతో గూడ, పూజయేత్ = పూజించవలెను, చ = మరియు, పూజాకాలే = పూజించే సమయంలో, అత్ర = అక్కడకు, కః అపి = ఎవరైన,

యది ఆగచ్ఛతి = వచ్చినట్లయిన, విష్ణోః = విష్ణువుయొక్క, న్యాసమ్ = న్యాసమును, తథా = అట్లే, స్తవమ్ = స్తోత్రమును, వైష్ణవీమ్ = విష్ణువు యొక్క, పూజామ్ = పూజను, దర్శయేత్ = చేయవలెను.

**తాత్పర్యము :** ఓ దేవేశ్వరీ ! గంధపుష్పాలు లేనప్పుడు, సాధకుడు మద్యంతోనైన పూజించవలెను. మరియు, పూజ చేస్తూన్న సమయంలో అక్కడకు ఎవరైన హఠాత్‌గా వస్తే, ఆ దోషపరిహారార్థం , విష్ణున్యాసము, విష్ణుస్తోత్రము, విష్ణుపూజను చేయవలెను. ✻

**ఇతి యోనితన్త్రే సప్తమోఽధ్యాయః సమ్పూర్ణమ్॥**

---

# అష్టమోఽధ్యాయః

**శ్రీమహాదేవ ఉవాచ** = శ్రీమహాదేవుడిట్లనెను.

**శ్లో ॥ ఊర్వశ్యాద్యశ్చ యే నార్యః త్రిషు లోకేషు విద్యతే ।**
**వీరసాధనకాలే చ తాసాం నాథస్స కౌలికః ॥ 1**

**ప్రతిపదార్థం :** ఊర్వశీ = ఊర్వశి, ఆద్యః చ = మొదలైన, యే నార్యః = ఏ స్త్రీలు, త్రిషు లోకేషు = మూడులోకములందు, విద్యతే = ఉందురో, తాసామ్ = వారికి, సః కౌలికః = ఆ కౌలికాచారసాధకుడు, వీరసాధనకాలే చ = వీరభావసాధనచేయు సమయముననైతే, నాథః = భర్త.

**తాత్పర్యం :** మూడు లోకాలలోను ఊర్వశి మొదలగు స్త్రీలు ఎవరుంటారో, వారందరూ ఈ కౌలాచారసాధకునకు వీరసాధనకాలంలో భార్యలే.

ఊర్వశి దేవవేశ్య కనుక, ఊర్వశ్యాదులనటంవలన భోగకాంతలు చెప్పబడుతూన్నారని భావించవలె. ఈ కౌలికుడు వారిని తన భార్యలుగ భావించి మానసికంగా యోనిపూజ నిర్వహిస్తాదని తాత్పర్యం. ✻

**శ్లో ॥ మైథునేన వినా ముక్తిర్నేతి శాస్త్రస్య నిర్ణయః ।**
**శ్రుతిస్మృతిపురాణాని కృతాని వివిధం మయా ॥ 2**

**ప్రతిపదార్థం :** మైథునేన వినా = మైథనం లేకుండ, ముక్తిః = మోక్షము,న = లేదు, ఇతి = అని, శాస్త్రస్య = శాస్త్రముయొక్క, నిర్ణయః = నిర్ణయము; మయా = నాచేత, వివిధమ్ = అనేక రీతులుగా, శ్రుతి = వేదాలు, స్మృతి = స్మృతులు, పురాణాని = పురాణాలు, కృతాని = చేయబడినవి.

**తాత్పర్యం :** శాస్త్రం మైథునంలేని సాధనకు మోక్షం ఫలంగా చెప్పలేదు. నేను వేదాలు,

స్మృతులు, పురాణాలు, అనేకంగా రచించినాను.

**శ్రుతులు :** 1) ఋగ్వేదము, 2) యజుర్వేదము, 3)సామవేదము, 4) అథర్వణవేదము.

**స్మృతులు :** ధర్మశాస్త్రాలు : మనుస్మృతి, పరాశరస్మృతి ఇత్యాదులు కాలానుగుణంగా మారుతూన్న సాంఘికస్థితిగతులను అదుపుచేసే క్రమంలో యేర్పడినవి.

**పురాణాలు :** 1) బ్రహ్మ, 2) పద్మ, 3) విష్ణు, 4) శివ, 5) భాగవత, 6) నారదీయ, 7)మార్కండేయ, 8) అగ్ని, 9) భవిష్య, 10) బ్రహ్మవైవర్త, 11) లింగ, 12) వరాహ, 13) స్కంద, 14) వామన, 15) కూర్మ, 16) మత్స్య, 17) గరుడ, 18) బ్రహ్మాండ పురాణాలు.

వివిధం అనటం వలన క్రియావిశేషణంగా అన్వయం. విశేషణమైతే వివిధాని అను రూపం ఉండవలె. ✻

**శ్లో ॥ పశూనాం బుద్ధినాశాయ శృణుష్వ ప్రాణవల్లభే ।**
**పరమానన్దరూపేణ భజేద్యోనిం సకున్తలామ్ ॥** 3

**ప్రతిపదార్థం :** ప్రాణవల్లభే = ప్రాణేశ్వరీ ! శృణుష్వ = వినుము, పశూనామ్ = ఇంద్రియ-లోలుపులైన వారి, బుద్ధినాశాయ = పశుబుద్ధినశించుటకై, పరమానన్దరూపేణ = మిక్కిలి ఆనందముతో, సకున్తలాం యోనిమ్ = కేశములుగల యోనిని, భజేత్ = సేవింపదగును.

**తాత్పర్యం :** ప్రాణేశ్వరీ! విను పశుబుద్ధి నశింపుకై పరమానందంతో కేశములుగల యోనిని సేవించవలెను. ✻

**శ్లో ॥ విశేషతః కలియుగే యోనిరూపాం జగన్మయీమ్ ।**
**యో జపేత్పరయా భక్త్యా తస్య ముక్తిః కరే స్థితా ॥** 4

**ప్రతిపదార్థం :** కలియుగే = కలియుగమున, విశేషతః = విశేషముగ, యోనిరూపామ్ = యోనిరూపముగల, జగన్మయీమ్ = జగద్వ్యాపి శక్తిని, యః = ఎవడు, పరయా భక్త్యా = పరమభక్తితో, జపేత్ = జపించునో, తస్య = వానికి, ముక్తిః = మోక్షము, కరే = చేతిలో, స్థితా = ఉన్నది.

**తాత్పర్యం :** విశేషించి కలియుగంలో యోనిరూప జగచ్ఛక్తిని పరమ భక్తితో పూజించిన వానికి మోక్షము అరచేతనున్నది. ✻

**శ్లో ॥ సాధకానాం సహస్రాణి ఉపాస్యానాఞ్చ కోటిశః ।**
**తేషాం భాగ్యవశేనాపి కాలీసాధనతత్పరః ॥** 5

**ప్రతిపదార్థం :** సాధకానామ్ = సాధకులయొక్క, సహస్రాణి = వేలసంఖ్య, ఉపాస్యానాం చ = ఉపాసకులయొక్కయు, కోటిశః = కోటిమంది, తేషామ్ = వారియొక్క, భాగ్యవశేన

అపి = అదృష్టం చేతనైనను, కాళీసాధనతత్పరః = కాళీసాధనకు అంకితమైన వాడు.

**తాత్పర్యం :** సాధకులు వేలు సంఖ్యలో ఉండవచ్చు, ఉపాసకులున్నూ కోటి మంది ఉండవచ్చు, కాని వారిలో కాళీసాధన తత్పరుడుండటం అదృష్టంగా భావించబడుతుంది. ✻

**శ్లో ॥ కాలీ చ జగతాం మాతా సర్వశాస్త్రవినిశ్చితా ।**
**కాలికాస్మృతిమాత్రేణ సర్వపాపైః ప్రతిముచ్యతే ॥** 6

**ప్రతిపదార్థం :** చ = మరియు , కాలీ = కాళి, జగతామ్ = జగత్తులకు, మాతా = తల్లి (అని), సర్వశాస్త్ర = అన్ని శాస్త్రములచేత, వినిశ్చితా = విశేషముగ, నిశ్చయింపబడినది; కాలికాస్మృతిమాత్రేణ = కాళికాదేవిని స్మరించిన మాత్రమున, సర్వపాపైః = అన్ని పాపములచేత, ప్రతిముచ్యతే = విడువబడును.

**తాత్పర్యం :** కాళిజగత్తులన్నిటికినీ తల్లి, ఇది శాస్త్రాలన్నీ చేసిన నిర్ణయం. కాళీమాతను స్మరిస్తే చాలు పాపాలన్నీ నశిస్తవి. ✻

**శ్లో ॥ సత్యం సత్యం పునః సత్యం సత్యమేవ సునిశ్చితమ్ ।**
**జప్త్వా మహామనుం కాల్యాః కాలీపుత్రో న సంశయః ॥** 7

**ప్రతిపదార్థం :** సత్యమ్ = నిజము, సత్యమ్ = నిజము, పునః = మరల, సత్యమ్ = నిజము, సత్యంఏవ = నిజమే, సునిశ్చితమ్ = నిశ్చయముగా, కాల్యాః = కాళీమాత యొక్క, మహామనుమ్ = మహామంత్రమును, జప్త్వా = జపించి, కాలీపుత్రః = కాళీపుత్రుడు (అగును) న సంశయః = అనుమానము లేదు.

**తాత్పర్యం :** ముమ్మాటికీ నిజం, నిశ్చయంగా నిజం. కాళీమాత మహామంత్రాన్ని జపాంచిన సాధకుడు నిస్సందేహంగా కాళీపుత్రుడువుతాడు.

కాళీమాత మహామంత్రం లేక మహావిద్య లేక **ద్వావింశత్యక్షరీమంత్రం: క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం దక్షిణే కాళికే క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం స్వాహా ॥** ✻

**శ్లో ॥ సా చైవ త్రిపురా కాలీ షోడశీ భువనేశ్వరీ ।**
**ఛిన్నా తారా మహాలక్ష్మీః మాతఙ్గీ కమలాత్మికా ॥** 8

**శ్లో ॥ సున్దరీ భైరవీ విద్యా ప్రకారాణ్యపి విద్యతే ।**
**దక్షిణా తారిణీ సిద్ధిర్నైవ చీనక్రమం వినా ॥** 9

**ప్రతిపదార్థం :** సా చైవ = ఆమెయే (ఆ కాళీయే ), త్రిపురా = త్రిపురసుందరీదేవి, కాలీ = కాళికా దేవి, షోడశీ = షోడశి, భువనేశ్వరీ = భువనేశ్వరి, ఛిన్నా = ఛిన్నమస్తాదేవి,

తారా = తార, మహాలక్ష్మీః = మహాలక్ష్మీ, మాతఙ్గీ = మాతంగి, కమలాత్మికా = కమలాత్మిక, సున్దరీ = త్రిపురసుందరి, భైరవీ = భైరవి, విద్యా = విద్య, దక్షిణా = దక్షిణకాళిక, తారిణీ = తారిణి, అన్యాః = ఇతరములైన, ప్రకారాణి అపి = పర్యాయపదములతో సూచింపబడు పేర్లున్నూ, విద్యతే = ఉన్నవి. చీనక్రమం వినా = చీనక్రమము లేక, చీనాచారము లేక, సిద్ధిః = సిద్ధి, న ఏవ = లేనే లేదు.

**తాత్పర్యం :** ఆ శక్తియే త్రిపురసుందరి, కాళి, షోడశి, భువనేశ్వరి, ఛిన్నమస్తా, తారా, మహాలక్ష్మి, మాతంగి, కమలాత్మిక, భైరవి, విద్యా, దక్షిణా, తారిణీ. ఇవి కాక ఆమెకు ఇతరములైన పేర్లున్నూ ఉన్నవి. చీనాచారపద్ధతిలో ఆమె నారాధిస్తేనే మంత్రసిద్ధి కలుగుతుంది, లేకుంటే లేదు. *

**శ్లో ॥ యస్మిన్మన్త్రే యదాచారః స ఏవ పరమో మతః ।**
**ఫలహానిస్త్వవిశ్వాసాత్ తస్మాద్భావపరో భవేత్ ॥** 10

**ప్రతిపదార్థం :** యస్మిన్ మన్త్రే = ఏ మంత్రమున, యత్ ఆచారః = ఏది ఆచారమో, సఃఏవ = అదియే, పరమః = ఉత్తమముగా, మతః = తలచబడుచున్నది. అవిశ్వాసాత్ = అపనమ్మకమువలన, ఫలహానిః తు = ఫలము నష్టమగునుగూడ; తస్మాత్ = ఆ కారణంగా, భావపరః = పూర్ణభక్తిభావతత్పరుడు, భవేత్ = అగును.

**తాత్పర్యం :** ఒక్కొక్క మంత్రానికి ఒక్కొక్క రూపంతో అధిదేవత, ఆ దేవతారాధనవిధానం వేరు వేరుగా ఉంటాయి. వారినట్లా ఆరాధించటమే ఉత్తమం. ఫలాపేక్షతో ఆరాధించేవారికి అవిశ్వాసం ఫలహానిని కలిగిస్తుంది. కనుక సాధకుడు భక్తిభావతత్పరుడు కావలెను. *

**శ్లో ॥ యదత్ర లిఖితం దేవి! తన్త్రే చ యోనిసంజ్ఞకే ।**
**తత్సర్వం సాధకానాం చ కర్తవ్యం భావమిచ్ఛతా ॥** 11

**ప్రతిపదార్థం :** దేవి! = ఓ దేవీ!, అత్ర = ఇక్కడ, యోనిసంజ్ఞకే తన్త్రే చ = యోనితంత్రమను పేరుగల తంత్రశాస్త్రమునందు, యత్ = ఏది, లిఖితమ్ = వ్రాయబడినదో, తత్ సర్వమ్ = అదియంతయు, భావం ఇచ్ఛతా = సిద్ధిని కోరు, సాధకానాం చ = సాధకులకైతే, కర్తవ్యమ్ = తప్పక చేయదగినది.

**తాత్పర్యం :** ఓ దేవీ! యోనితంత్రమని పేరుగల యీ తంత్రశాస్త్రమున వ్రాయబడినది అంతయును మంత్రసిద్ధిని ఫలముగా కోరుకొను సాధకులకు తప్పక చేయదగును.

**శ్లో ॥ జిహ్వా యోనిముఖం యోనిః శ్రోత్రే చ చక్షుషు ।**
**సర్వత్రాపి మహేశాని! యోనిచక్రం విభావయేత్ ॥** 12

**ప్రతిపదార్థం :** జిహ్వా = నాలుక, అనగా వాక్కు, యోనిముఖమ్ = యోనిద్వారము,

శ్రోత్రే = చెవియందు, చ మరియు, చక్షుషు = కనులందు, యోనిః = యోని, మహేశాని = ఓ మహేశ్వరీ!, సర్వత్ర+అపి = అంతటను, యోనిచక్రమ్ = యోనిచక్రమును, విభావయేత్ = విశేషముగ భావించవలెను.

**తాత్పర్యం :** సాధకుడు , తన వాగింద్రియముతోను, కర్ణేంద్రియముతోను, దృగింద్రియముతోను, సర్వేంద్రియములతోను సర్వత్ర శక్తి ఆవహించి యుండుట దర్శింపవలయును. అది సుసాధ్యమగుటకు తన భావనమందా శక్తిని ప్రతిష్ఠించి పూజింపవలయును. ✻

**శ్లో ॥ యోనిం వినా మహేశాని! సర్వపూజా వృథా భవేత్ ।**
**తథా మన్త్రాః న సిద్ధ్యన్తి సత్యం సత్యం వదామ్యహమ్ ॥ 13**

**ప్రతిపదార్థం :** మహేశాని = ఓ మహేశ్వరీ! యోనిం వినా = యోనిలేక, సర్వపూజా = పూజ అంతయు, వృథా భవేత్ = వ్యర్థమగును; తథా = అట్లే, మన్త్రాః = మంత్రములు, న సిద్ధ్యన్తి = సిద్ధించవు, సత్యం సత్యమ్ = నిశ్చయ సత్యమును, అహమ్ = నేను, వదామి = చెప్పుచున్నాను.

**తాత్పర్యం :** ఓ మహేశ్వరి! యోనిపూజలేనిచో, మిగత పూజలన్నియూ వ్యర్థములే యగును. అట్లే మంత్రములున్నూ ఫలము నివ్వవు, నేను ముమ్మాటికి నిజమునే చెప్పుచున్నాను.

**శ్లో ॥ సర్వాం పూజాం పరిత్యజ్య యోనిపూజాం సమాచరేత్ ।**
**గురుం వినా మహేశాని! మద్భక్తో నాపి సిద్ధ్యతే ॥ 14**

**ఓం యోనిపీఠాయ నమః ॥**

**ప్రతిపదార్థం :** సర్వాం పూజామ్ = పూజనంతయును, పరిత్యజ్య = విడిచివేసి, యోని పూజామ్ = యోనిపూజను, సమాచరేత్ = చేయవలెను. మహేశాని = ఓ మహేశ్వరీ! గురుం వినా = గురువులేకున్న, మమ = నాయొక్క, భక్తః అపి = భక్తుడైనను, న సిద్ధ్యతే = సిద్ధించదు.

**తాత్పర్యం :** ఓ మహేశ్వరీ! అన్ని విధముల పూజాక్రమమును విడిచి, యోనిపూజను మాత్రము నిర్వహించదగును. గురువులేకున్న, నా భక్తునికైనను, మంత్రము ఫలించదు. ✻

**ఇతి యోనితన్త్రేఽష్టమోఽధ్యాయః సమ్పూర్ణమ్॥**

---

## అనుబంధం 1
# యోనిధ్యానమ్

శ్లో ॥ అతిసులలితగాత్రాం హాస్యవక్త్రాం త్రిణేత్రాం
జితజలదసుకాన్తిం పట్టవస్త్రప్రకాశామ్।
అభయవరకరాఢ్యాం రత్నభూషాతిభవ్యాం
సురతరుతలపీఠే రత్నసింహాసనస్థామ్ ॥ 1

శ్లో ॥ హరిహరవిధివన్ద్యాం బుద్ధిశుద్ధిస్వరూపాం
మదనరససమాక్తాం కామినీం కామదాత్రీమ్ ।
నిఖిలజనవిలాసోద్దామరూపాం భవానీం
కలికలుషనిహన్త్రీం యోనిరూపాం భజామి ॥ 2

**ప్రతిపదార్థం :** అతిసులిత = అధికముగమెత్తనైన, గాత్రామ్ =శరీరముగలదానిని, హాస్య = నవ్వుగల, వక్త్రామ్ = ముఖముగలదానిని, త్రిణేత్రామ్ = మూడు కన్నులు గలదానిని, జితజలద = మేఘమును జయించిన, సుకాన్తిమ్ = మంచి దీప్తి గలిగిన దానిని, పట్టవస్త్ర = పట్టుబట్టలతో, ప్రకాశామ్ = వెలుగొందుదానిని, అభయ = అభయముద్రను, వర = వరదముద్రను గల, కర = హస్తములతో, ఆఢ్యామ్ = సంపన్నమైనదానిని, రత్నభూషా = రత్నాభరణములతో, అతిభవ్యామ్ = అతిసుందరమైన దానిని, సురతరుతలపీఠే = కల్పవృక్షపు నీడనున్న పీఠమున, రత్నసింహాసనస్థామ్ = రత్నములు పొదిగిన సింహాసనమందున్న దానిని, హరిహరవిధి = విష్ణువు, శివుడు, బ్రహ్మ, వీరిచే, వన్ద్యామ్ = నమస్కరింపదగినదానిని, బుద్ధిశుద్ధిస్వరూపామ్ = బుద్ధిని పరిశుభ్రము చేయు రూపముగల దానిని, మదనరస = మన్మథ ద్రవముతో, సమ + అక్తామ్ = సమముగా అభిషేకించబడిన దానిని, కామినీమ్ = కామముగల దానిని, కామదాత్రీమ్ = కోరినదిచ్చుదానిని, నిఖిలజన = జనులందరియొక్క, విలాస = ఉల్లాసమునకగు, ఉద్దామరూపామ్ = స్వతంత్రరూపముగల దానిని, భవానీమ్ = భవానిని, కలికలుష = కలియుగపు కాలుష్యమును, నిహన్త్రీమ్ = నశింపజేయు దానిని, యోనిరూపామ్ = యోనిరూపముగల దానిని, భజామి = సేవింతును.

**తాత్పర్యం :** మృదువైన శరీరముతో, నవ్వుముఖముతో, మూడు కన్నులతో, వర్షా మేఘచ్ఛాయను మించిన మేనికాంతితో, పట్టుబట్టల మెరుగుతో, అభయముద్ర, వరదముద్రలతోడి హస్తములతో, రత్నభూషణములుదాల్చి, కల్పవృక్షమూలమున రత్నసింహాసనమున కొలువై, హరిహరబ్రహ్మాది దేవతలందరు వందనములు సేయ, కోరిన దెల్ల ప్రసాదించు అందమైన రూపముగల భవానిని, కలికలుషనాశనిని, యోనిరూప కామినిని, మదనరసాభిషిక్తను, బుద్ధిశుద్ధిస్వరూపను పూజింతును.

ఇతి యోనిం ధ్యాత్వా సంపూజ్య యోన్యుపరి హసౌః ఇతి యోనిమంత్ర–మష్టోత్తరశతం జప్త్వా జపం సమర్ప్య స్తవకవచాదికం పఠేత్ ।

ఇట్లు ధ్యానము చేసి, పూజించి, యోనిపై **'హసౌః'** అనియున్న యోని మంత్రమును అష్టోత్తరశతముగ జపించి, జపమును సమర్పించి, యోనిస్తోత్రాన్నీ, యోని కవచాన్నీ చదువవలెను. *

## అనుబంధం - 2

# యోనిస్తోత్రమ్ - 1

**శ్రీదేవ్యువాచ** = శ్రీదేవి ఇట్లనెను.

శ్లో ॥ **భగవాన్సర్వధర్మజ్ఞ! కులశాస్త్రార్థపారగ! ।**
**సర్వం మే కథితం నాథ! నత్వేకం పరమేశ్వర! ॥** 1

శ్లో ॥ **శ్రీయోనేః స్తవరాజం హి తథా కవచముత్తమమ్ ।**
**శ్రోతుమిచ్ఛామి సర్వజ్ఞ! యది తేఽస్తి కృపా మయి॥** 2

శ్లో ॥ **సారభూతం మహాదేవ! నిగమాన్తర్గతం హర! ।**
**యది న కథ్యతే దేవ! ప్రాణత్యాగం కరోమ్యహమ్ ॥** 3

శ్లో ॥ **దివానిశి మహాభాగ! మమాశ్రుః పతితం భవేత్ ।**
**అతస్తద్దేవదేవేశ! కథ్యతాం మే దయానిధే! ॥** 4

**ప్రతిపదార్థం :** నాథ! = ఓస్వామీ!, భగవాన్ పరమేశ్వర! = భగవంతుడవైన ఓ పరమేశ్వరా!, మహాదేవ! సర్వజ్ఞ! = సర్వమెఱిగిన మహాదేవా!, హర! = ఓ పాపనాశక!, దేవ = ఓదేవ!, మహాభాగ! దేవదేవేశ! = మహాత్ముడవైన ఓ దేవేశ్వరా!, దయానిధే! = దయాసముద్రా!, సర్వధర్మజ్ఞ! = అన్ని ధర్మముల నెఱిగినవాడా! కులశాస్త్రర్థపారగ! = కులశాస్త్రములు అర్థమును సమగ్రముగ తెలిసినవాడా!, మే = నాకు, సర్వమ్ = అంతయు, కథితం = చెప్పబడినది, తు = కాని, ఏకమ్ = ఒక్కటి, న = కాదు; శ్రీయోనేః = శ్రీయోనియొక్క, స్తవరాజం హి = స్తోత్రమే, తథా = అట్లే, కవచం ఉత్తమమ్ = శ్రేష్ఠమైన కవచమును, తే = నీకు, మయి = నాయందు, కృపా = దయ, యది అస్తి = ఉన్నట్లయితే, శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను ; **నిగమాన్తర్గతమ్ = వేదోక్తమైనది**, సారభూతమ్ = సారమైనది, యది న కథ్యతే = చెప్పకపోయినట్లయిన, అహమ్ = నేను, ప్రాణత్యాగమ్ = ప్రాణములు వదలుటను, కరోమి = చేయుదును, దివా = పగలు, నిశి = రాత్రి, మమ+అశ్రుః = నా కన్నీరు, పతితం భవేత్ = భూమిపై జారును; అతః = ఆ కారణమున, తత్ = అది, మే = నాకు, కథ్యతామ్ = చెప్పబడుగాక!

**తాత్పర్యం :** ఓ స్వామీ! భగవాన్ పరమేశ్వరా! మహాదేవా! సర్వజ్ఞా! హరా! దేవా! దేవదేవేశా! మహాభాగా! దయాసముద్రా! సర్వధర్మజ్ఞా! కులశాస్త్రార్థపారగా! నాకు అంతా చెప్పినారు కాని ఒక్కవిషయం మాత్రం చెప్పనేలేదు. శ్రీయోనిస్తోత్రము, శ్రీయోనికవచము వినాలని నా కోరిక. వేదోక్తము, సారభూతమైన వీనిని చెప్పకపోయినట్లయిన ప్రాణములు వదులుదును. పవలు రాత్రి కన్నీరు కారుస్తూంటాను. ఆ కారణంగా నాకు ఇవి చెప్పవలెను. ✻

**శ్రీమహాదేవ ఉవాచ** = శ్రీమహాదేవుడిట్లనెను.

**శ్లో॥ శృణు పార్వతి! వక్ష్యామి దేహత్యాగం కథం కురు ।**
**అత్యన్తగోపనీయం హి నిగమే కథితం పురా ॥ 5**

**శ్లో॥ బ్రహ్మావిష్ణుగ్రహాదీనాం న మయా కథితం పురా ।**
**అకథ్యం పరమేశాని ఇదానీం కిం కరోమి తే ॥ 6**

**శ్లో ॥ తవ స్నేహేన బద్ధోఽహం కథయామి తవ ప్రియే! ।**
**మాతర్దేవి! మహాభాగే! యది కస్మై ప్రకాశ్యతే ।**
**శపథం కురు మే దుర్గే! యది త్వం మత్ప్రియా స్మృతా ॥ 7**

**శ్లో ॥ బ్రహ్మా యది చతుర్వక్త్రైః పఞ్చవక్త్రైః సదాశివః ।**
**వర్ణితుం స్తవరాజఞ్చ న శక్నోతి కదాచన ।**
**సమ్యగ్వక్తుం న శక్నోమి సంక్షేపాత్కథయామి తే ॥ 8**

**ప్రతిపదార్థం :** పార్వతి! = ఓ పార్వతీ!, దేహత్యాగమ్ = ప్రాణాలు విడవటం, కథమ్ = ఎట్లు, కురు = చేయుదువు? అత్యన్త = మిక్కిలి, గోపనీయమ్ = రహస్యముగనుంచదగినది, నిగమే = వేదమున, పురా = పూర్వము , కథితమ్ = చెప్పబడినది, బ్రహ్మావిష్ణుగ్రహాదీనామ్ = బ్రహ్మకు, విష్ణువుకు, నవగ్రహములకు, మొదలగు వారికి, మయా = నాచేత, పురా = పూర్వం, న కథితమ్ = చెప్పబడనిది, అకథ్యమ్ = చెప్పకూడనిది, వక్ష్యామి = చెప్పుచున్నాను, శృణు = వినుము ; తవ = నీయొక్క, స్నేహేన = ప్రేమచే, బద్ధః = బద్ధుడనైన, అహమ్ = నేను, తే = నీకు, కథయామి = చెప్పుచున్నాను; ప్రియే! = ప్రియురాలా! కిం కరోమి = ఏమి చేయుదును? పరమేశాని! = పరమేశ్వరీ! దేవి! = ఓ దేవీ! మాతః = ఓ తల్లీ!, మహాభాగే! = మహాభాగా!, కస్మై = ఎవరికైన, యది ప్రకాశ్యతే = చెప్పబడినట్లుయిన, దుర్గే = ఓ దుర్గా! మే = నాకు, శపథమ్ = వాగ్దానమును, కురు = చేయుము; త్వమ్ = నీవు, మత్ = నాయొక్క, ప్రియా = ప్రియురాలుగా, యది స్మృతా =తలచబడినచో, బ్రహ్మా = బ్రహ్మ, చతుర్ వక్త్రైః = నాలుగు ముఖములతో, పఞ్చముఖైః = ఐదు ముఖములతో, సదాశివః = సదాశివుడు, స్తవరాజం చ =

స్తోత్రమునున్ను, వర్ణితుమ్ = వివరించుటకు, కదాచన = ఒకప్పుడైన . న శక్నోతి = సమర్థుడు కాడు; సమ్యక్ = బాగుగ, వక్తుమ్ = చెప్పుటకు, న శక్నోమి = సమర్థుడను కాను; తే = నీకు సంక్షేపాత్ = క్లుప్తముగ, కథయామి = చెప్పుదును.

**తాత్పర్యం :** ఓ పార్వతీ! దేహత్యాగము చేయుటెట్లు ?! మిక్కిలి రహస్యమైనది, పూర్వము వేదమున చెప్పబడినది, బ్రహ్మవిష్ణుగ్రహములాదిగ పూర్వము చెప్పబడనిది, చెప్పగూడనిది చెప్పుచున్నాను, వినుము, నీ స్నేహమునకు కట్టుబడి నేను నీకు చెప్పుచున్నాను. ఏమి చేయుదును? ఎవరికి గాని చెప్పనని వాగ్దానము చేయుము. నీవు నా ప్రియురాలవు కదా. బ్రహ్మనాలుగు ముఖములతో, సదాశివుడు అయిదు ముఖములతో వివరించలేని దానిని నేను మాత్రము సమగ్రముగ చెప్పగలనా? క్లుప్తముగ చెప్పుదును వినుము.

**అస్య శ్రీయోనిస్తవరాజస్య కులాచార్య ఋషిః కౌలికచ్ఛన్దః । శ్రీయోనిరూపా దశవిద్యాత్మికా దేవతా సర్వసాధనే వినియోగః ॥**

ఈ శ్రీ యోనిస్తవరాజమునకు కులాచార్యులు ఋషి, కౌలికము ఛందస్సు, దశవిద్యాత్మికయైన శ్రీ యోనిరూపిణి దేవత, సర్వసాధనయందు వినియోగము. ✻

శ్లో ॥ **ఓం యోనిరూపే! మహామాయే! సర్వసమ్పత్ప్రదే! శుభే! ।**
**కృపయా సర్వసిద్ధిం మే దేహి దేవి! జగన్మయి! ॥** 1

**ప్రతిపదార్థం :** శుభే! = శుభమగుదావా!, సర్వసమ్పత్ ప్రదే = అన్ని సంపదలను ప్రసాదించుదానా!!, యోనిరూపే! = యోనిరూపముగలదానా!, మహామాయే! = ఓ ఆద్యాప్రకృతీ!, జగన్మయి! = జగత్తున నిండియున్నదానా!; మే = నాకు, కృపయా = దయతో, సిద్ధిమ్ = సాఫల్యమును, దేహి = ఇమ్ము.

**తాత్పర్యం :** శుభమైనదానా! అన్ని సంపదలనిచ్చుదానా! యోనిరూపిణీ! ఓ ఆద్యాప్రకృతీ! లోకమంతా నిండి యున్నదానా! నాకు దయతో సఫలతను ప్రసాదించుము. ✻

శ్లో ॥ **సర్వస్వరూపే! సర్వేశే! సర్వశక్తిసమన్వితే! ।**
**కృపయా సర్వసిద్ధిం మే దేహి దేవి! జగన్మయి! ॥** 2

శ్లో ॥ **మహాఘోరే! మహాకాలి! కులాచారప్రియే! సదా ।**
**కృపయా సర్వసిద్ధిం మే దేహి దేవి జగన్మయి! ॥** 3

శ్లో ॥ **ఘోరదంష్ట్రే! చోగ్రతారే! సర్వశత్రువినాశిని! ।**
**కృపయా సర్వసిద్ధిం మే దేహి దేవి! జగన్మయి! ॥** 4

**ప్రతిపదార్థం :** సర్వస్వరూపే! = అన్నిరూపములు నీవైనదానా!, సర్వేశే! = సర్వేశ్వరీ!, సర్వశక్తిసమన్వితే = అన్ని శక్తులతో కూడినదానా!, మహాఘోరే! = మహాభయంకరీ!,

మహాకాలి! = మహాకాళీ!, సదా = ఎల్లప్పుడు, కులాచారప్రియే = కులాచారసాధన లిష్టపడుదానా!, ఘోరదంష్ట్రే! = భయంకరమైన కోరలు గలదానా!, చ = మరియు, ఉగ్రతారే! = ఉగ్రతారా!, సర్వశత్రువినాశిని! = శత్రువులందఱను నశింపజేయుదానా!, జగన్మయి! = జగమంతా నిండినదానా! దేవి! = ఓ దేవీ!, కృపయా = దయతో, మే = నాకు, సర్వసిద్ధిమ్ = సిద్ధిసర్వస్వమును, దేహి = ప్రసాదించుము.

**తాత్పర్యం :** ఓ జగన్మయి దేవీ! అన్ని రూపములు నీవే, సర్వేశ్వరీ! వివిధరీతుల అభివ్యక్తమగు శక్తి సమస్తము నీ యధీనము. నీవు భయంకరివి, మహాకాళివి, ఘోరదంష్ట్రవు, ఉగ్రతారవు, శత్రునాశినివి, కులాచారప్రియవు. నాకు సర్వసిద్ధిని దయసేయుము. *

**శ్లో ॥ యోనిరూపా! మహావిద్యే! సర్వదా మోక్షదాయినీ ।**
**కృపయా సర్వసిద్ధిం మే దేహి దేవి! జగన్మయి! ॥** 5

**శ్లో ॥ జగద్ధాత్రి! మహావిద్యే! జగదుద్ధారకారిణి! ।**
**కృపయా సర్వసిద్ధిం మే దేహి దేవి! జగన్మయి! ॥** 6

**శ్లో ॥ జగద్ధాత్రి! మహామాయే! యోనిరూపే! సనాతని! ।**
**కృపయా సర్వసిద్ధిం మే దేహి దేవి! జగన్మయి! ॥** 7

**శ్లో ॥ జయదేవి! జగన్మాతః! సృష్టిస్థిత్యన్తకారిణి ! ।**
**కృపయా సర్వసిద్ధిం మే దేహి దేవి! జగన్మయి! ॥** 8

**ప్రతిపదార్థం :** యోనిరూపా = యోనిరూపముగల, మహావిద్యే = ఓ మహావిద్యా!, మోక్షదాయినీ = మోక్షమునిచ్చుదానా!, జగద్ధాత్రి! = జగత్తును ధరించుదానా!, జగత్ + ఉద్ధారకారిణి! = జగమునుద్ధరించుదానా!, మహామాయే! = ఓ ఆద్యాప్రకృతీ!, సనాతని = ఓ శాశ్వతీ!, దేవి! జగన్మాతః = ఓ దేవి, జగన్మాతా!, సృష్టిస్థిత్యన్తకారిణి! = సృష్టిస్థితిలయములను చేయుదానా!, జగన్మయి! = జగత్తంతా నిండినదానా!, మే = నాకు, కృపయా = దయతో, సర్వసిద్ధిమ్ = మంత్రసిద్ధిసర్వస్వమును, దేహి = ప్రసాదించుము.

**తాత్పర్యం :** యోనిరూపమహావిద్యా! మోక్షదాయినీ! జగద్ధాత్రీ! జగదుద్ధారిణీ! మహామాయా! శాశ్వతీ! దేవీ! జగన్మాతా! సృష్టిస్థితిలయములు నీ యధీనములే. నీవు జగన్మయివి. దయతో నాకు మంత్రజపసిద్ధిని ప్రసాదించుము. *

**శ్లో ॥ సిద్ధిదాత్రి! మహామాయే ! సర్వసిద్ధిప్రదాయిని! ।**
**కృపయా సర్వసిద్ధిం మే దేహి దేవి! జగన్మయి! ॥** 9

**శ్లో ॥ మహాలక్ష్మి! మహాదేవి ! మహామోక్షప్రదాయిని ! ।**
**కృపయా సర్వసిద్ధిం మే దేహి దేవి ! జగన్మయి! ॥ 10**

**శ్లో ॥ గౌరీ లక్ష్మీశ్చ మాతఙ్గీ దుర్గా చ నవచణ్డికా ।**
**బగలాముఖి భువనేశీ భైరవీ చ తథా ప్రియే! ।**
**ఛిన్నమస్తా చ కాలీ చ యోనిరూపా! సనాతనీ ।**
**కృపయా సర్వసిద్ధిం మే దేహి దేవి! జగన్మయి! ॥ 11**

**ప్రతిపదార్థం :** సర్వసిద్ధిప్రదాయిని! సిద్ధిదాత్రి! = అన్ని సిద్ధులను ప్రసాదించుదానా!, మహామాయే = ఓ ఆద్యాప్రకృతీ! మహాలక్ష్మి! = ఓ మహాలక్ష్మీ! మహాదేవి! = ఓ మహాదేవీ!, మహామోక్షప్రదాయిని = మోక్షమిచ్చుదానా!, గౌరీ = గౌరి, లక్ష్మీః చ = లక్ష్మియు, మాతఙ్గీ = మాతంగి, దుర్గా చ = దుర్గయును, నవచణ్డికా = నవచండిక, బగలాముఖీ = బగలాముఖి, భువనేశీ = భువనేశ్వరి, భైరవీ = భైరవి, తథా = అట్లే, ఛిన్నమస్తా చ = ఛిన్నమస్త, యోనిరూపా సనాతనీ కాలీ = యోనిరూపా శాశ్వతీ కాళీ, జగన్మయి = జగన్మయీ! దేవి = ఓ దేవీ!, కృపయా = దయతో, మే = నాకు, సర్వసిద్ధిమ్ = సిద్ధులన్నిటిని, దేహి = ప్రసాదించుము.

**తాత్పర్యం :** అన్ని సిద్ధులను ప్రసాదించు ఓ ఆద్యాప్రకృతీ! నీవే మహాలక్ష్మివి, మహాదేవివి, గౌరివి, మాతంగివి, దుర్గవు, నవచండికవు, బగలాముఖివి, భువనేశ్వరివి, భైరవివి, ఛిన్నమస్తవు, కాళివి, శాశ్వతివి, జగన్మయివి, నాకు సర్వసిద్ధులను దయసేయుము. ✻

**శ్లో ॥ కాలీ కపాలినీ కుల్లా కురుకుల్లా విరోధినీ ।**
**నాయికా విప్రచిత్తాద్యా చాన్యా యా నాయికా స్మృతాః ।**
**వసన్తి యోనిమాశ్రిత్య తాభ్యోఽపీహ నమో నమః ॥ 12**

**శ్లో ॥ అణిమాద్యష్టసిద్ధిశ్చ వసత్యస్యాః సమీపతః**
**నమస్తేఽస్తు నమస్తేఽస్తు యోగమోక్షప్రదాయిని! ॥ 13**

**శ్లో ॥ సర్వశక్తిమయే! దేవి! సర్వకల్మషనాశిని ।**
**హే యోనే హర విఘ్నం మే సర్వసిద్ధిం ప్రయచ్ఛ మే ॥ 14**

**ప్రతిపదార్థం :** కాలీ = కాళి, కపాలినీ = కపాలిని, కుల్లాకురుకుల్లా విరోధినీ నాయికా విప్రచిత్తా+ఆద్యాః = ఈ పేర్లుగల నాయికలు మొదలగు, అన్యాః యాః నాయికాః = ఇతరులైన యే నాయికలు, స్మృతాః = గుర్తించబడినారో, యోనిమ్ = యోనిని, ఆశ్రిత్య = ఆశ్రయించి, వసన్తి = నివసించుచున్నారో, తాభ్యః అపి = వారికి గూడ, ఇహ = ఇప్పుడు, నమః నమః = నమస్సులు; అణిమా + ఆది = అణిమా మొదలగు, అష్టసిద్ధిః

చ = ఎనిమిది సిద్ధులున్న, అస్యాః = ఆమెకు, సమీపతః = చేరువలో, వసతి = ఉన్నవి, తే = నీకు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక! యోగమోక్షప్రదాయిని! = ఓ యోగమును మోక్షమును ఇచ్చుదానా!, సర్వశక్తిమయే! = అన్ని శక్తులు గలదానా!, సర్వకల్మషనాశిని = పాపమునంతయు నశింపజేయుదానా !, దేవి = ఓ కాలీదేవీ!, హే యోనే = ఓ యోనీ!, మే = నాయొక్క, విఘ్నమ్ = విఘ్నమును, హర = హరించుము, మే = నాకు, సర్వసిద్ధిమ్ = అన్ని సిద్ధులను, ప్రయచ్ఛ = ఇమ్ము.

**తాత్పర్యం :** కాళీ, కపాలినీ, కుల్లా, కురుకుల్లా, విరోధినీ, విప్రచిత్తా ఇత్యాది అనేక పేర్లతో వ్యవహరింపబడు నాయికలు యోని నాశ్రయించి ఎవరెవరున్నారో వారందరికిన్నీ నమస్సులు. అణిమాది సిద్ధులెవరి అధీనమో ఆమెకు నమస్కారము. పాపనాశిని, యోగమోక్షప్రద సర్వశక్తిమయి, యోనిరూప దుర్గాదేవి నా విఘ్నములను పరిహరించి, నాకు సిద్ధులను ప్రసాదించుగాక! ✻

**శ్లో ॥ ఆధారభూతే ! సర్వేషాం పూజకానాం ప్రియంవదే! ।**
**స్వర్గపాతాలవాసిన్యై యోనయే చ నమో నమః ॥ 15**

**శ్లో ॥ విష్ణుసిద్ధిప్రదే ! దేవి ! శివసిద్ధిప్రదాయిని !।**
**బ్రహ్మసిద్ధిప్రదే! రామచన్ద్రస్య సిద్ధిదే ! ॥**
**శక్రాదీనాఞ్చ సర్వేషాం సిద్ధిదాయై నమో నమః ॥ 16**

**ప్రతిపదార్థం :** సర్వేషాం పూజకానామ్ = పూజించువారందఱికి, ఆధారభూతే = దన్నుగా నిలుచుదానా, ప్రియంవదే! = ఓ ప్రియవచనములు పలుకుదానా!, స్వర్గ = స్వర్గమున, పాతాల = పాతాళమున, వాసిన్యై యోనయే చ = వసించునట్టి యోనులకు గూడ, నమః నమః = నమస్సులు, విష్ణుసిద్ధిప్రదే = విష్ణుమంత్రమును సిద్ధింపజేయుదానా! శివసిద్ధిప్రదాయిని = శివమంత్రమును సిద్ధింపజేయుదానా!, దేవి! = ఓ దేవీ!, బ్రహ్మసిద్ధిప్రదే = బ్రహ్మమంత్రమును సిద్ధింపజేయుదానా!, రామచన్ద్రస్య = రామమంత్రమును, సిద్ధిదే! = సిద్ధింపజేయుదానా, శక్ర+ఆదీనాఞ్చ = ఇంద్రుడు మొదలగు వారి యొక్క మంత్రములను గూడ, సర్వేషామ్ = అందరి మంత్రములను, సిద్ధిదాయై = సిద్ధింపజేయు దేవతకు, నమః నమః = నమస్సులు.

**తాత్పర్యము :** ఓ దేవీ దుర్గా ! నీవు పూజకులందఱికి ఆధారము, సాధకులకు ప్రియమును బలుకు తల్లివి, అష్టాక్షరీమంత్రమును, పంచాక్షరీమంత్రమును, ప్రణవమంత్రమును, ఇంద్రాణి సమస్తదేవతాక మంత్రములను సిద్ధింపజేయ సమర్థురాలవు నీవే. నీకు నమస్సులు. స్వర్గపాతాళలోకములలో నివసించు యోనులకు గూడ నమస్సులు. ✻

# ఫలశ్రుతిః

ఇతి తే కథితం దేవి! సర్వసిద్ధిప్రదాయకమ్ ।
స్తోత్రం యోనేర్మహేశాని! ప్రకాశయామి తే ప్రియే! ॥

సర్వసిద్ధిప్రదం స్తోత్రం యః పఠేత్ కౌలికః ప్రియే! ।
లిఖిత్వా పుస్తకే దేవి! రక్తద్రవ్యైశ్చ సున్దరి! ॥

తస్యాసాధ్యాని కర్మాణి వశ్యాదీని కులేశ్వరి ।
నాస్తినాస్తి పునర్నాస్తి నాస్త్యేవ భువనత్రయే ।
యః పఠేత్ప్రాతరుత్థాయ గాణపత్యం లభేన్నరేః ।
రాత్రౌ కాన్తాసమాయోగే యః పఠేత్సాధకోత్తమః ।
స్తవేనానేన సంస్తుత్య సాధకః కిం న సాధయేత్ ।
సాలఙ్కృతాం స్వకాన్తాఇఞ్చ లీలాహావవిభూషితామ్ ।
రక్తవస్త్రపరీధానాం కృత్వా సంపూజ్య సాధకః ।
భోజయిత్వా తతో దేవి స్వయం భుఞ్జీత తత్పరః ।
మత్స్యమాంసాదికాన్ భుక్త్వా క్రోడే కృత్వా స్వయోషితమ్ ।
రాత్రౌ యది జపేన్మన్త్రం సా దుర్గా ససదాశివః ।
భవత్యేవ న సన్దేహో మమ వక్త్రాద్వినిర్గతమ్ ॥

యేన దత్తం మయి స్తోత్రం స ఏవ మద్గురుః స్మృతః ।
తస్యైవ మది భక్తి స్యాత్ స భవేజ్జగదీశ్వరః ॥

నమోఽస్తు స్తవరాజాయ నమః స్తవప్రకాశినే ।
యత్రాస్తే స్తవరాజోఽయం తత్రాస్తే శ్రీ సదాశివః ॥

ఇతి శక్తికాగమసర్వస్వే హరపార్వతీసంవాదే శ్రీయోనిస్తవరాజః సమాప్తః ॥

**తాత్పర్యం :** ఓ ప్రియురాలా ! ఇట్లీ యోని స్తోత్రమును నీ కొరకు బహిరంగపరచినాను ఇది సర్వసిద్ధిప్రదము. కౌలాచారపరాయణుడెవరైన దీనిని చదివినను, ఎఱ్ఱని ద్రవముతో పుస్తకములో వ్రాసినను, వానికి వశీకరణాది మంత్రములు స్వాధీనమగును. ఉదయమే నిద్ర లేచి పఠించిన నరునకు గణనాయకత్వము లభించును. ఈ స్తవరాజుము చేత దేనినైన సాధించగలడు. సాధకుడు తన భార్యకు ఎఱ్ఱని చీరను కట్టబెట్టి, అలంకరించి, శృంగారచేష్టలు గల ఆమెను పూజించి, ఆమె భుజించిన తరువాత తాను మత్స్యమాంసాదులను భుజించి, ఆమెను కౌగిటపొదివి, రాత్రివేళ మంత్రమును జపించినట్లయిన, ఆతడు సదాశివుడును ఆమె దుర్గయు అగును. నా యీ మాట పొల్లుబోదు. నాకు మంత్రమిచ్చిన యాతడే నా గురువు. వానికి భక్తి యున్నచో, వాడే

జగదీశ్వరుడగును. స్తవరాజమునకు నమస్కారము. స్తవప్రకాశకునకు నమస్కారము. ఈ స్తవరాజ మెక్కడ ఉండునో అక్కడ శ్రీ సదాశివుడును.

ఇట్లు శక్తికాగమసర్వస్వమున హరపార్వతీసంవాదమున శ్రీ యోనిస్తవరాజము సమాప్తము॥ *

---

## అనుబంధం 3

# యోనిస్తోత్రమ్ - 2

**శ్లో ॥ శృణు దేవి! సురశ్రేష్ఠే! సురాసురనమస్కృతే! ।**
**ఇదానీం శ్రోతుమిచ్ఛామి స్తోత్రం సుదుర్లభం ప్రియే! ।**
**యస్యావబోధనాద్దేహే దేహీ బ్రహ్మమయో భవేత్ ॥ 1**

**ప్రతిపదార్థం :** దేవి! = ఓ దేవీ!, సురశ్రేష్ఠే! = దేవతలలో శ్రేష్ఠురాలా!, సుర + అసుర = దేవతలచే, దానవులచే, నమస్కృతే! = నమస్కరింపబడుదానా! ఇదానీమ్ = ఇప్పుడు, సుదుర్లభమ్ = చాల దుర్లభమైన, స్తోత్రం హి = స్తోత్రమునే, శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను, యస్య = ఏ స్తోత్రము యొక్క అవబోధనాత్ = జ్ఞానమువలన, దేహీ = శరీరధారి, దేహే = శరీరము నందు, బ్రహ్మమయః = బ్రహ్మభూతుడుగ, భవేత్ = అగును.

**తాత్పర్యం :** ఓ దేవీ! నీవు దేవతలలో ఉత్తమురాలవు. దేవదానవులచే నమస్కరింపబడు దానవు. దుర్లభమైన యోనిస్తోత్రమును నేనిప్పుడు వినగోరుచున్నాను. ఈ స్తోత్రజ్ఞానము కలుగుట వలన శరీరధారికి శరీరము నందుండగనే బ్రహ్మత్వము చేకూరును. *

**శ్రీపార్వత్యువాచ** = శ్రీ పార్వతి ఇట్లనెను.

**శ్లో ॥ శృణు దేవ! సురశ్రేష్ఠ! సర్వబీజస్య సమ్మతమ్ ।**
**న వక్తవ్యం కదాచిత్తు పాషణ్డే నాస్తికే నరే ॥ 2**

**శ్లో ॥ మమైవ ప్రాణసర్వస్వం లతాస్తోత్రం దిగమ్బర!।**
**అస్య ప్రపఠనాద్దేవ! జీవన్ముక్తోఽపి జాయతే ॥ 3**

**ప్రతిపదార్థం :** సురశ్రేష్ఠ! = దేవతలలో ఉత్తముడవైన, దేవ! = ఓ స్వామీ! శృణు = వినుము; సర్వబీజస్య = అన్ని బీజములకు, సమ్మతమ్ = సారమైనది; కదాచిత్ తు = ఒకప్పుడైనను, పాషండే = స్వధర్మద్రోహియైన, నాస్తికే నరే = నాస్తికమానవునకు, న వక్తవ్యమ్ = చెప్పరానిది, మమ = నాయొక్క ప్రాణసర్వస్వం ఏవ = ప్రాణసర్వస్వమేయైన,

లతాస్తోత్రం = లతాస్తోత్రమును, దిగమ్బర! = దిగంబరా! (వినుము ), అస్య = దీనియొక్క, ప్రపఠనాత్ = పఠించుటవలన, దేవ = ఓ దేవా!, జీవన్ముక్తః అపి = జీవించియుండగనే ముక్తుడుగ, జాయతే = అగును.

**తాత్పర్యం :** ఓదేవా! దేవదేవా! దిగంబరా! అన్ని బీజములకు సారమైన దీనిని వినుము. ఈ లతాస్తోత్రము ఎప్పుడు గాని స్వధర్మద్రోహియైన నాస్తికునకు చెప్పరానిది. ఇది నా ప్రాణమే. దీనిని పఠించుటవలన జీవి జీవించియుండగనే ముక్తి నొందును. ✻

**శ్లో ॥ భగరూపా జగన్మాతా సృష్టిస్థితిలయాన్వితా ।**
**దశవిద్యా స్వరూపాత్మా యోనిర్మాం పాతు సర్వదా ॥ 4**

**శ్లో ॥ కోణత్రయయుతా దేవీ స్తుతినిన్దావివర్జితా ।**
**జగదానన్దసమ్భూతా యోనిర్మాం పాతు సర్వదా ॥ 5**

**ప్రతిపదార్థం :** భగరూపా = భగరూపముగలది, సృష్టిస్థితిలయాన్వితా = సృష్టిస్థితిలయములతో కూడినది, జగన్మాతా = లోకాలకు తల్లియైనది. దశవిద్యా స్వరూపాత్మా = దశవిద్యాస్వరూపమున నున్న ఆత్మయైనది (లేక, దశవిద్యా = దశవిద్యయని కీర్తింపబడినది; స్వరూపాత్మా = ఆత్మయే తన రూపమైనది), యోనిః = యోని, మామ్ = నన్ను, సర్వదా = ఎల్లప్పుడును, పాతు = రక్షించుగాక !, కోణత్రయయుతా = త్రికోణములు గలది, దేవీ = దుర్గాదేవి, స్తుతినిన్దావివర్జితా = స్తుతినిందలేనిది, జగదానన్దసమ్భూతా = జగత్తునకు ఆనందమగునది, యోనిః = యోని, మామ్ = నన్ను, సర్వదా = ఎల్లప్పుడు పాతు = కాపాడుగాక !

**తాత్పర్యం :** భగరూపము, సృష్టిస్థితిలయములతో కూడినది, జగన్మాత దశవిద్య యని పేరుగలది, ఆత్మస్వరూపమైనది, త్రికోణము గలది, స్తుతినిన్దలకు అతీతమైనది జగదానందముగలది, యోని(శక్తి) నన్ను ఎల్లప్పుడు కాపాడుగాక! ✻

**శ్లో ॥ రక్తరూపా జగన్మాతా యోనిమధ్యే సదా స్థితా ।**
**బ్రహ్మవిష్ణుశివప్రాణా యోనిర్మాం పాతు సర్వదా ॥ 6**

**శ్లో ॥ కార్తికీ కున్తలారూపా యోన్యుపరి సుశోభితా ।**
**భుక్తిముక్తిప్రదా యోనిః యోనిర్మాం పాతు సర్వదా ॥ 7**

**ప్రతిపదార్థం :** యోనిమధ్యే = త్రికోణప్రదేశమున, సదా = ఎల్లప్పుడు , స్థితా = నెలకొన్నదగు, రక్తరూపా = రక్తరూపముగల, జగన్మాతా = జగదంబ, బ్రహ్మవిష్ణుశివప్రాణా = బ్రహ్మవిష్ణుశివులకు ప్రాణమైనది, యోనిః = యోని, మామ్ = నన్ను, సర్వదా =

ఎల్లవేళల, పాతు = కాపాడుగాక!, యోని+ఉపరిశోభితా = యోని పైభాగమున వెలుగొందు, కున్తలారూపా = కేశముల రూపమునగల, కార్తికీ = కార్తిక పూర్ణిమాదేవత, భుక్తిముక్తి ప్రదా = జీవశక్తిని, మోక్షమును ప్రసాదించునది, యోనిః = యోని, యోనిః = అట్టి యోని, మామ్ = నన్ను , సర్వదా = ఎల్లప్పుడు, పాతు = రక్షించుగాక !

**తాత్పర్యం :** యోనిలోని రక్తరూపమున ఎప్పుడూ ప్రవించు జగన్మాత బ్రహ్మవిష్ణుశివ దేవుల ప్రాణశక్తి. యోనిపై కేశరూపమున విరాజిల్లునది కార్తిక పూర్ణిమాధిదేవత. భుక్తి అనగా జీవశక్తిప్రద, మోక్షప్రద, అట్టి యోని దేవత నన్ను సదా కాపాడుగాక!. *

**శ్లో॥ వీర్యరూపా శైలపుత్రీ మధ్యస్థానే విరాజితా ।**
**బ్రహ్మవిష్ణుశివశ్రేష్ఠా యోనిర్మాం పాతు సర్వదా ॥ 8**

**శ్లో ॥ యోనిమధ్యే మహాకాలీ ఛిద్రరూపా సుశోభనా ।**
**సుఖదా మదనాగారా యోనిర్మాం పాతు సర్వదా ॥ 9**

**శ్లో ॥ కాల్యాదియోగినీ దేవీ యోనికోణేషు సంస్థితా ।**
**మనోహరా దుఃఖలభ్యా యోనిర్మాం పాతు సర్వదా ॥ 10**

**ప్రతిపదార్థం :** వీర్యరూపా = వీర్యరూపము గలది, శైలపుత్రీ = శైలజా, హైమవతీ, మధ్యస్థానే = మధ్యప్రదేశమున, విరాజితా = వెలుగునది, బ్రహ్మవిష్ణుశివ = బ్రహ్మవిష్ణుశివులకు, శ్రేష్ఠా = ప్రీతిపాత్రురాలు, యోనిమధ్యే = యోనిమధ్యమున, మహాకాలీ = మహాకాళీ, ఛిద్రరూపా = రంధ్రరూపముగలది, సుశోభనా = శుభము లిచ్చునది, సుఖదా = సుఖమునిచ్చునది, మదనాగారా = మన్మథుని ఇల్లయినది, కాలీ + ఆది = కాళీమొదలుగాగల, యోగినీదేవి = యోగినుల దేవత, యోనికోణేషు = యోని కోణములందు, సంస్థితా = నెలకొన్నది, మనోహరా = మనస్సును హరించునది, దుఃఖలభ్యా = కష్టముమీద లభించునది, యోనిః = యోనిశక్తి, మామ్ = నన్ను, సర్వదా = ఎల్లవేళల, పాతు = కాపాడుగాక!

**తాత్పర్యం :** వీర్యరూపముగలది, శైలజ, శరీరమధ్యవిరాజిత, బ్రహ్మవిష్ణుశివప్రియ, మహాకాళిగా యోనిమధ్యమున నుండి, ఛిద్రముగ శభమును, సుఖమును ప్రసాదించు మన్మథగృహము, యోగినీదేవత యోనికోణములందు నెలకొన్నది, మనోహర, దుర్లభ, అట్టి యోని శక్తి నన్నెప్పుడు కాపాడుగాక ! *

**శ్లో ॥ మహాశివో మేరురూపో యోనిమధ్యే వసేత్ సదా ।**
**కైవల్యదా కామముక్తా యోనిర్మాం పాతు సర్వదా ॥ 11**

**శ్లో ॥ సర్వదేవస్తుతా యోనిస్సర్వదేవప్రపూజితా ।**
**సర్వప్రసవకర్త్రీ త్వం యోనిర్మాం పాతు సర్వదా ॥ 12**

**శ్లో ॥ సర్వతీర్థమయీ యోనిః సర్వపాపప్రణాశినీ ।**
**సర్వగేహే స్థితా యోనిః యోనిర్మాం పాతు సర్వదా ॥ 13**

**ప్రతిపదార్థం :** మహాశివః = శివమహాదేవుడు, మేరురూపః = మేరురూపుడై, సదా = ఎల్లప్పుడు, యోనిమధ్యే = యోనికేంద్రమున, వసేత్ = నివసించును, కామముక్తా = కోరికలులేనిదై, కైవల్యదా = కైవల్యముక్తిని ప్రసాదించునదైన, సర్వదేవస్తుతా = దేవతలందరచే స్తుతింపబడు, సర్వదేవపూజితా = దేవతలందఱకు పూజ్యురాలగు, సర్వప్రసవకర్త్రీ = సృష్టికర్త్రి, సర్వతీర్థమయీ = అన్ని పుణ్యతీర్థములు తానైన, సర్వపాపప్రణాశినీ = అన్నిపాపములు పోగొట్టునట్టిది, సర్వగేహే స్థితా = అన్ని గృహములలో ఉండునదియైన, యోనిః = యోని, త్వమ్ = నీవు, మామ్ = నన్ను, సర్వదా = ఎల్లప్పుడు, పాతు = రక్షించుగాక!

**తాత్పర్యం :** శివమహాదేవుడు సదా మేరురూపుడై యోనిమధ్య వసించును. దేవతలందఱకు పూజ్యురాలు, వందనీయురాలు, సర్వసృష్టికర్త్రీ, తీర్థమయి, పాపనాశిని, కామముక్త, కైవల్యదాయినియగు యోని అన్ని గృహములలో నెలకొన్నది యోనిరూప పరాశక్తి. ఆ మహాశక్తి నన్నెప్పుడు రక్షించుగాక! ✻

**శ్లో ॥ ముక్తిదా ధనదా దేవీ సుఖదా కీర్తిదా తథా ।**
**ఆరోగ్యదా వీరరతా పఞ్చ తత్త్వయుతా సదా ॥ 14**

**శ్లో ॥ యోనిస్తోత్రమిదం ప్రోక్తం యః పఠేత్ యోనిసన్నిధౌ ।**
**శక్తిరూపా మహాదేవీ తస్య గేహే సదా స్థితా ॥ 15**

**ప్రతిపదార్థం :** ముక్తిదా = ముక్తినిచ్చునది, ధనదా = ధనసంపద నిచ్చునది, సుఖదా = సుఖమిచ్చునది, కీర్తిదా = కీర్తినిచ్చునది, ఆరోగ్యదా = ఆరోగ్యమిచ్చునది, యైన, దేవీ = దేవీదుర్గ, వీరరతా = వీరాచారమునందనురక్త, తథా = అట్లే, పఞ్చతత్త్వయుతా = పంచకృత్యములతో కూడినది, (దీనిని ), సదా = ఎల్లప్పుడు, ఇదం యోనిస్తోత్రమ్ = ఈ యోనిస్తోత్రమును, యః = ఎవడు, యోనిసన్నిధౌ = యోనిసమక్షమున, పఠేత్ = చదువునో, తస్య = వానియొక్క, గేహే = ఇంటిలో, శక్తిరూపా మహాదేవీ = శక్తిరూప దుర్గాదేవి, సదా = ఎప్పుడూ, స్థితా = విరాజిల్లును.

**తాత్పర్యం :** ధనమును, సుఖమును, కీర్తిని, ఆరోగ్యమును, ముక్తిని ఇచ్చు దుర్గాదేవి వీరాచారమునందు, పంచకృత్యములగు సృష్టి–స్థితి–లయ–తిరోధాన–అనుగ్రహములందు ఆసక్తి గల దేవత, యోనిస్తోత్రమును సదా చదువుచుండు వాడు ఈ శక్తిరూప మహాదేవిని సంతోషపరుచును. వాని ఇంటియందీ దేవత వసించును. ✻

**శ్లో ॥ తీర్థపర్యటనం నాస్తి నాస్తి పూజాదితర్పణమ్ ।**
**పురశ్చరణం నాస్త్యేవ తస్య ముక్తిరఖణ్డితా ॥ 16**

**శ్లో ॥ కేవలం మైథునేనైవ శివతుల్యో న సంశయః ।**
**సత్యం సత్యం పునః సత్యం మమ వాక్యం వృథా నహి ॥ 17**

**ప్రతిపదార్థం :** తీర్థపర్యటనమ్ = పుణ్యతీర్థములలో ద్రిమ్మరుట, న+అస్తి = లేదు, పూజ + ఆది తర్పణమ్ = పూజమొదలు కొని నైవేద్యము వరకు గల కార్యక్రమము, న + అస్తి = లేదు, పురశ్చరణమ్ = పురశ్చరణ చేయుట, న + అస్తి + ఏవ = లేనేలేదు; తస్య = వానికి, ముక్తిః = మోక్షము, అఖణ్డితా = అనివార్యము; మైథునేన + ఏవ కేవలం = మైథున మొక్కదానిచేతనే, శివతుల్యః = శివసమానుడు, న సంశయః = అనుమానములేదు; సత్యం సత్యం పునః సత్యం మమ వాక్యమ్ = నా మాట ముమ్మాటికి నిజము, వృథా నహి = వ్యర్థము కాదు.

**తాత్పర్యం :** పుణ్యతీర్థాలకై తిరుగనక్కరలేదు, పూజానైవేద్యముల కార్యకలాపమక్కరలేదు, మంత్రపురశ్చరణ చేయబనిలేదు; యోనిపూజకునకు ముక్తి అనివార్యము. మైథునమును తన్త్రోక్తప్రకారమాచరించిన వాడు శివ సమానుడగును. నిస్సందేహముగా ఇది ముమ్మాటికీ నిజము. శివావాక్య మిది దబ్బర కాదు. *

**శ్లో ॥ యది మిథ్యా మయా ప్రోక్తా తవ హత్యా సుపాతకీ ।**
**కృతాఞ్జలిపుటో భూత్వా పఠేత్ స్తోత్రం దిగమ్బర! ॥ 18**

**శ్లో ॥ సర్వతీర్థేషు యత్పుణ్యం లభతే చ స సాధకః ।**
**కాల్యాదిదశవిద్యాశ్చ గఙ్గాదితీర్థకోటయః ।**
**యోనిదర్శనమాత్రేణ సర్వాః సాక్షాన్న సంశయః ॥ 19**

**ప్రతిపదార్థం :** మయా = నాచేత, మిథ్యా = అసత్యము, యది ప్రోక్తా = చెప్పబడినచో, (అహం = నేను), తవ = నీయొక్క, హత్యా సుపాతకీ = హత్యచేసిన పాతకురాలిని (అగుదును), కృత+అఞ్జలిపుటః = అంజలి ఘటించినవాడగుచు, స్తోత్రమ్ = స్తోత్రమును, పఠేత్ = పఠించదగును, దిగమ్బర! = ఓ దిగంబరా!, యత్ పుణ్యమ్ = యే పుణ్యము, సర్వతీర్థేషు = అన్ని తీర్థములలో, లభతే = పొందునో, కాలీ + ఆది దశవిద్యాః చ = కాళీమొ॥ దశవిద్యలున్నూ, గఙ్గా + ఆది తీర్థకోటయః చ = గంగానది మొదలు కోటితీర్థములున్నూ, సర్వాః = అన్నియు, యోనిదర్శనమాత్రేణ = యోని దర్శనమువలన, సాక్షాత్ = కంటి ముందున్నవే (అగును); న సంశయః = సందేహములేదు.

**తాత్పర్యం :** నేను అసత్యము చెప్పినచో నిన్ను చంపిన పాపాత్మురాలినగుదును. ఓ దిగంబర! అంజలి ఘటించి ఈ స్తోత్రమును పఠింపదగును. మరియు ఆ సాధకుడు

తీర్థయాత్రలు చేసియు, కాళికోపాసనాది దశవిద్యల చేతనూ యేపుణ్యమును పొందునో, అది సర్వం యోనిదర్శనమాత్రమున పొందగలడు. నిశ్చయము. ✻

**శ్లో ॥ కులసమ్భవపూజాయామాదౌ చాన్తే పఠేదిదమ్ ।**
**అన్యథా పూజనాద్దేవ రమణం మరణం భవేత్ ॥ 20**

**శ్లో ॥ ఏకసన్ధ్యాం త్రిసన్ధ్యాం వా పఠేత్ స్తోత్రమనన్యధీః ।**
**నిశాయాం సమ్ముఖే శక్త్యాః స శివో నాత్ర సంశయః ॥ 21**

**ప్రతిపదార్థం :** కులసమ్భవపూజాయామ్ = కులాచారపూజాక్రమంలో, ఆదౌ = మొదట, చ = మరియు, అన్తే = చివర, ఇదమ్ = ఇది, ఈ స్తోత్రమును, పఠేత్ = చదువవలెను,అన్యథా = లేకున్నచో, దేవ! = ఓ స్వామీ! పూజనాత్ = పూజించుటవలన, రమణమ్ = సంభోగము, మరణమ్ = మరణము, భవేత్ = అగును; స్తోత్రమ్ = స్తోత్రమును, అనన్యధీః = బుద్ధియందు మరిదేనిని ఉంచక, ఏకసన్ధ్యామ్ = ఒక సంధ్యాకాలమున, వా = లేక, త్రిసన్ధ్యామ్ = మూడు సంధ్యలలో, నిశాయామ్ = రాత్రివేళ, శక్త్యాః = శక్తియొక్క, సమ్ముఖే = సమక్షమున, పఠేత్ = చదువవలెను, సః = (అట్లు చదివిన) వాడు, శివః = శివుడు (అగును). అత్ర = ఈ విషయమున, న సంశయః = అనుమానములేదు.

**తాత్పర్యం :** కులాచారము ననుసరించి చేయు యోనిపూజ ప్రారంభముననను చివరను గూడ ఈ స్తోత్రపఠనము చేయవలె. చేయనిచో, పూజించి రమించేవేళ మరణము సంభవించును. ఈ స్తోత్రమును నిత్యము ఒక సంధ్యాసమయంలో గాని లేక త్రిసంధ్యలలో గాని పఠిస్తూ రాత్రివేళ శక్తిసన్నిధిలో పఠించినచో, ఆ సాధకుడు శివుడే అవుతాడు. ఇందులో సందేహం లేదు. ✻

ఇతి నిగమకల్పద్రుమే యోనిస్తోత్రం సమాప్తమ్

---

## అనుబంధం-4
# యోనికవచమ్

**శ్రీదేవ్యువాచ** = శ్రీదేవి ఇట్లనెను.

**శ్లో॥ భగవన్! శ్రోతుమిచ్ఛామి కవచం పరమాద్భుతమ్ ।**
**ఇదానీం దేవదేవేశ! కవచం సర్వసిద్ధిదమ్ ॥ 1**

**ప్రతిపదార్థం :** భగవన్ = భగవంతుడవైన, దేవదేవేశ = దేవదేవా, ఈశ్వరా!, ఇదానీమ్ = ఇప్పుడు, సర్వసిద్ధిదమ్ = అన్ని సిద్ధులను ప్రసాదించునదియగు, పరమ+అద్భుతమ్

=మిక్కిలి అద్భుతమైన, కవచమ్ = కవచమును, శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

**తాత్పర్యం :** దేవదేవా! ఈశ్వరా! ఓ స్వామీ! మిక్కిలి అద్భుతమైనది, అన్ని సిద్ధులను ప్రసాదించునది అయిన కవచమునిప్పుడు వినగోరుచున్నాను. ✻

**మహాదేవ ఉవాచ** = మహాదేవుడిడిట్లనెను.

**శ్లో ॥ శృణు పార్వతి! వక్ష్యామి అతిగుహ్యతమం ప్రియే! ।**
**యస్మై కస్మై న దాతవ్యం దాతవ్యం నిష్ఫలం భవేత్ ॥ 2**

**ప్రతిపదార్థం :** ప్రియే! = ప్రియమైన, పార్వతి = ఓ పార్వతీ! శృణు = వినుము, వక్ష్యామి = చెప్పుచున్నాను; అతిగుహ్యతమ్ = పరమరహస్యము, యస్మై కస్మై = ఎవనికో ఒకనికి, న దాతవ్యమ్ = ఇవ్వదగినది కాదు, దాతవ్యమ్ =ఇవ్వదగు (నని ఇచ్చినచో), నిష్ఫలమ్ = ఫలములేనిది. భవేత్ = అగును.

**తాత్పర్యం :** ఓ ప్రియమైన పార్వతీ! పరమరహస్యం చెప్పుచున్నాను వినుము. ఇది అందరికీ చెప్పదగినది కాదు. చెప్పినచో ఫలితముండదు. ✻

**అస్య శ్రీ యోనికవచస్య గుప్త ఋషిః కులటాచ్ఛన్దః రాజవిఘ్నోత్పాతవినాశే వినియోగః**

**శ్లో ॥ హ్రీం యోనిర్మాం సదా పాతు స్వాహా విఘ్నవినాశినీ ।**
**శత్రునాశాత్మికా యోనిః సదా మాం రక్ష సాగరే ॥ 3**

**ప్రతిపదార్థం :** హ్రీం యోనిః = యోని శక్తి, విఘ్ననాశినీ స్వాహా = విఘ్నముల హరించునది, మామ్ = నన్ను, సదా = ఎల్లప్పుడు, పాతు = రక్షించుగా! శత్రునాశాత్మికా యోనిః=శత్రునాశకశక్తియగు యోని, మామ్=నన్ను, సాగరే = సంసారసముద్రమునందు, సదా = ఎల్లపుడు, రక్ష = రక్షించుము

**తాత్పర్యం : 'హ్రీం స్వాహా'** యని విఘ్నములను సమర్పింతును. శత్రువులను నశింపజేయు విజయదుర్గాశక్తియై యోని సదా నన్నీ సంసారసాగరమందలి విఘ్నములనుండి, శత్రువులనుండి కాచి రక్షించుగాక! ✻

**శ్లో ॥ బ్రహ్మాత్మికా మహాయోనిః సర్వాన్ ప్రరక్షతు చ ।**
**రాజద్వారే మహాఘోరే క్రీం యోనిః సర్వదావతు ॥ 4**

**ప్రతిపదార్థం :** బ్రహ్మాత్మికా = బ్రహ్మమూలమైన, మహాయోనిః = యోనిశక్తి, సర్వాన్ = అందఱను, ప్రరక్షతు = పరిరక్షించుగాక! మహాఘోరే = భయంకరమైన, రాజద్వారే = రాజసభాద్వారమున, సర్వదా = ఎల్లప్పుడు , క్రీం యోనిః = యోనిశక్తి, అవతు = కాపాడుగాక!

**తాత్పర్యం :** యోనిశక్తి బ్రహ్మకు మూలశక్తి. ఆ సృజనశక్తి అందఱిని రక్షించుగాక! రాజద్వారమును దాటి సభాప్రవేశము చేయుట భయంకరము. '**క్రీం స్వాహా**'. ✳

**శ్లో॥ హూమాత్మికా సదా దేవీ యోనిరూపా జగన్మయీ ।**
**సర్వాఙ్గం రక్ష మాం నిత్యం సభాయాం రాజవేశ్మని ॥ 5**

**శ్లో॥ వేదాత్మికా సదా యోనిర్వేదరూపా సరస్వతీ ।**
**కీర్తిం శ్రీం కాన్తిమారోగ్యం పుత్త్రపౌత్త్రాదికం తథా॥ 6**

**ప్రతిపదార్థం :** హుం+ ఆత్మికా = హుం బీజశక్తియైన, జగన్మయీ = జగద్రూప, యోనిరూపా = యోనిరూప, దేవీ = దేవత, నిత్యమ్ = దినదినము, సదా = ఎల్లప్పుడు, సర్వాఙ్గమ్ = అన్నిఅవయవములుగల, మామ్ = నన్ను, సభాయామ్ = సభలోను, రాజవేశ్మని = రాజగృహములలో, రక్ష = రక్షించుము, వేదాత్మికా = వేదశక్తి, వేదరూపా = వేదములరూపైనది, సరస్వతీ = దేవిసరస్వతి, యోనిః = యోనిశక్తి, సదా = ఎల్లప్పుడు, ఆరోగ్యమ్ = ఆరోగ్యమును, శ్రీమ్ = సంపదను, పుత్త్రపౌత్త్రాదికమ్ = కొడుకు కూతులను మనుమ మనుమరాంద్రను, తథా = అట్లే, కీర్తిమ్ = ఖ్యాతిని, కాన్తిమ్ = కాంతిని, (ఇచ్చుగాక!).

**తాత్పర్యం : 'హూం స్వాహా'** బీజాక్షర శక్తియై జగత్తునిండి యోనిరూపమున వెలసిన దేవత నా అంగములన్నిటిని ఎల్లవేళల రాజప్రాసాదములోను, సభలోను, కాపాడుగాక! వేదమున కాత్మయై, వేదమునకు రూపమైన యోనిశక్తియగు సరస్వతి ఎల్లప్పుడును ఆరోగ్యమును, సంపదను, ఆత్మీయపరివారమును, కీర్తిని, కాంతిని ప్రసాదించుగాక ! ✳

**శ్లో॥ రక్ష రక్ష మహాయోనే! సర్వసిద్ధిప్రదాయిని! ।**
**రాజయోగాత్మికా యోనిః సర్వత్ర మాం సదావతు ॥ 7**

**ప్రతిపదార్థం :** సర్వసిద్ధిప్రదాయిని! = అన్నిసిద్ధుల నొసగు, మహాయోనే! = ఓయోనిశక్తీ! రక్ష రక్ష = రక్షించుము. రాజయోగాత్మికా యోనిః = రాజయోగమిచ్చు యోని, మామ్ = నన్ను, సర్వత్ర = అన్ని దేశములందు, సదా = ఎల్లప్పుడు, అవతు = రక్షించుగాక!

**తాత్పర్యం :** సిద్ధులన్నిటి నొసగు మహాయోని రాజయోగప్రద. ఆశక్తి నన్నెప్పుడూ అన్ని తావులలోనూ కాపాడుగాక! ✳

**శ్లో॥ ఇతి తే కథితం దేవ! కవచం సర్వసిద్ధిదమ్ ।**
**త్రిసన్ధ్యం యః పఠేన్నిత్యం రాజోపద్రవనాశకృత్ ॥ 8**

**ప్రతిపదార్థం :** దేవ! =ఓ స్వామీ!, ఇతి = ఈరీతిగా, తే = తమకు, సర్వసిద్ధిదమ్ = అన్ని సిద్ధులనిచ్చు, కవచం = ఈ యోనికవచము, కథితమ్ = చెప్పబడినది; యః =

ఏసాధకుడు, నిత్యమ్ =అనుదినము, త్రిసన్ధ్యమ్ =మూడు సంజలలో, పఠేత్ = పఠించునో, (సః = అతడు), రాజ+ఉపద్రవ = రాజువలన కలుగు హానిని, నాశకృత్ = నశింపజేయువాడు (అగును).

**తాత్పర్యం :** ఓ స్వామీ! ఇది అన్ని సిద్ధులనిచ్చు యోని కవచము. తమకు నివేదించితిని. ఏ సాధకుడైన అనుదినమును త్రిసంధ్యలలో దీనిని పఠించినచో, ఆతడు రాజాగ్రహము వలన కలుగు హానిని నశింపజేయగలడు. ✻

**శ్లో॥ సభాయాం వాక్పతిశ్చైవ రాజవేశ్మని రాజవత్।**
**సర్వత్ర జయమాప్నోతి కవచస్య జపేన హి ॥ 9**

**శ్లో॥ శ్రీయోన్యాః సఙ్గమే దేవీం పఠేదేనమనన్యధీః ।**
**స ఏవ సర్వసిద్ధీశో నాత్ర కార్యా విచారణా ॥ 10**

**ప్రతిపదార్థం :** కవచస్య జపేన హి = కవచమును జపించిన మాత్రమున, సభాయాం = సభలో, వాక్పతిః చ ఏవ = బ్రహ్మయే, రాజవేశ్మని = రాజమందిరమున, రాజవత్ = రాజువలె, సర్వత్ర = అన్ని తావులలో, జయమ్ =విజయమును, ఆప్నోతి = పొందు చున్నాడు. శ్రీయోన్యాః = శ్రీయోనిశక్తితో, సఙ్గమే = కలయికలో, అనన్యధీః = అన్యమనస్కుడు కాక, దేవీమ్ = యోనిరూపశక్తికవచమును, ఏనమ్ = దీనిని, పఠేత్ = పఠించినట్లయిన, సః ఏవ = ఆతడే, సర్వసిద్ధి = అన్ని సిద్ధులకు, ఈశః = ప్రభువు; అత్ర = ఈ విషయమున, విచారణా = ఆలోచన, మీమాంస, న కార్యా = చేయదగదు.

**తాత్పర్యం :** ఈ కవచమును జపించిన సాధకుడు సభలో బ్రహ్మ, రాజమందిరమున రాజువలెనుండి అన్ని తావులలో జయించును. శ్రీయోనిశక్తితో కలిసియునప్పుడు అన్యమనస్కత లేక, ఈ కవచమును పఠించినచో, ఆతడన్ని సిద్ధులకు ప్రభువగు ననుటకు ఆలోచింపనక్కరలేదు. ✻

**శ్లో ॥ మాతృకాక్షరసంపుటం కృత్వా యది పఠేన్నరః ।**
**భుఙ్క్తేచ విపులాన్ భోగాన్ దుర్గయా సహ మోదతే ॥ 11**

**ప్రతిపదార్థం :** మాతృకాక్షర = మంత్రబీజాక్షరములను, సంపుటం కృత్వా = ఈ కవచమున అనుసంధానం చేసి, నరః = సాధకుడు, యది పఠేత్ = చదివినచో, (సః = అతడు), విపులాన్ భోగాన్ = విస్తారమైన భోగములను, భుఙ్క్తే = అనుభవించును, చ = మరియు, దుర్గయా = దుర్గాదేవితో, సహ మోదతే = కలిసి ఆనందించును.

**తాత్పర్యం :** మహామంత్రబీజాక్షరాలను అనుసంధానం చేసి యీ కవచాన్ని చదివిన నరుడు విస్తారమైనభోగాలను అనుభవించి, మరణానంతరము పరలోకమున దేవి దుర్గతో

కలిసి ఆనందించును, అనగా, ఆమె లోకమున ఆమె సమక్షమున ఆనందించునని భావము. **'హ్రీం క్రీం హూం స్వాహా'.** ✻

**శ్లో॥ ఇతి గుహ్యతమం దేవి! సర్వధర్మోత్తమోత్తమమ్।**
**భూర్జే వా తాడపత్రే వా లిఖిత్వా ధారయేద్యది ॥ 12**

**శ్లో॥ హరిచన్దనమిశ్రేన రోచనాకుఙ్కుమేన చ ।**
**శిఖాయామథవా కణ్ఠే సోఽపీశ్వరో న సంశయః ॥ 13**

**శ్లో ॥ శరత్కాలే మహాష్టమ్యాం నవమ్యాం కులసున్దరి! ।**
**పూజాకాలే పఠేదేనం జయీ నిత్యం న సంశయః ॥ 14**

**ప్రతిపదార్థం :** ఇతి = ఇట్లని, దేవి! = ఓ దేవీ!, గుహ్యతమమ్ = పరమరహస్యమైన, సర్వధర్మ = ధర్మములన్నిటిలో, ఉత్తమ+ ఉత్తమమ్ = శ్రేష్ఠమైనవానిలో శ్రేష్ఠమైనది, దీనిని, భూర్జే = భూర్జపత్రములలో, వా =లేక, తాడపత్రే వా = తాటియాకులపైనైనను, లిఖిత్వా = వ్రాసి, యది ధారయేత్ = ధారణచేసినట్లయిన, హరిచన్దనమిశ్రేణ = హరిచందనముతో కలిపిన, రోచనాకుఙ్కుమేన చ = కాంతివంతమైన కుంకుమతోగూడ, శిఖాయామ్ = సిగలో, అథవా = లేకున్న, కణ్ఠే = కంఠమున, (ధారయేత్ యది = ధరించినట్లుయిన), సః అపి = అతడున్నూ, ఈశ్వరః = ప్రభువే(అగును); న సంశయః = అనుమానములేదు. శరత్కాలే = శరదృతువులో, మహాష్టమ్యామ్ = దుర్గాష్టమినాడు, నవమ్యామ్ = మహర్నవమినాడు, పూజాకాలే = పూజాసమయమున, కులసున్దరి! = ఓ కుండలినీరూపశక్తీ!, ఏనమ్ = దీనిని, పఠేత్ (యది) = పఠించినచో, నిత్యమ్ = అనుదినము, జయీ = జయము గలవాడగును; న సంశయః = నిశ్చయము.

**తాత్పర్యం :** ఓదేవీ! పరమరహస్యమైనది ధర్మములలో నెల్ల ఉత్తమధర్మమైనది ఇది. దీనిని భూర్జపత్రములపై గాని లేక తాటియాకులపైగాని వ్రాసి ధారణ చేసినను, హరిచందనమును కాంతివంతమైన కుంకుమను కలిపి సిగలోనో కంఠముననో ధరించిన సాధకుడు ఈశ్వరుడగును. శరదృతువులో దుర్గాష్టమి లేక మహర్నవమి పర్వదినములలో పూజచేసే వేళ పఠించినచో, అనుదినము వానికి జయమే కలుగును. ఇందు సందేహములేదు. ✻

**ఇతి శక్తికాగమసర్వస్వే హరగౌరీసంవాదే శ్రీయోనికవచం సంపూర్ణమ్ ॥**

---

## అనుబంధం- 5
# కాలీకవచమ్

**భైరవ్యువాచ** = భైరవి ఇట్లనెను.

**శ్లో ॥ కాలీపూజా శ్రుతా నాథ! భావాశ్చ వివిధాః ప్రభో! ।**
**ఇదానీం శ్రోతుమిచ్ఛామి కవచం పూర్వసూచితమ్ ॥ 1**

**శ్లో ॥ త్వమేవ స్రష్టా పాతా చ సంహర్తా చ త్వమేవ చ।**
**త్వమేవ శరణం నాథ! త్రాహి మాం దుఃఖసంకటాత్ ॥ 2**

**ప్రతిపదార్థం :** నాథ! = ఓ స్వామీ! ప్రభో! = ఓ ప్రభూ!, కాలీపూజ చ = కాలీపూజయును, వివిధాః భావాః = అనేక భావములు, శ్రుతాః = వినబడినవి; ఇదానీమ్ = ఇప్పుడు, పూర్వసూచితమ్ = ముందు చెప్పబడిన, కవచమ్ = కవచమును, శ్రోతుం ఇచ్ఛామి = వినగోరుచున్నాను. త్వం ఏవ = తమరే, స్రష్టా = సృష్టికర్త,పాతా = రక్షకుడవు, సంహర్తా చ = నశింపజేయువాడవు కూడ, త్వం ఏవ చ = నీవే ; శరణమ్ = శరణ్యుడవు, త్వం ఏవ = నీవే; మామ్ = నన్ను, దుఃఖసంకటాత్ = దుఃఖమను కష్టమునుండి, త్రాహి = రక్షించుము.

**తాత్పర్యం :** ఓస్వామీ! కాలీపూజను గురించియును, పశువీరదివ్యభావములను గూర్చి మీరు చెప్పగా విన్నాను. ఇప్పుడు ముందు సూచింపబడిన కవచమును వినవలెనని కోరిక కలిగినది. సృష్టికర్త, భర్త, హర్త తమరే, తమరే శరణు.నన్నీ కోరిక దీర్చి, దుఃఖకారణము లేకుండజేసి రక్షించవలెను. *

**భైరవ ఉవాచ** = భైరవుడిట్లనెను.

**శ్లో ॥ రహస్యం శృణు వక్ష్యామి భైరవి! ప్రాణవల్లభే! ।**
**శ్రీజగన్మఙ్గలం నామ కవచం మన్త్రవిగ్రహమ్ ॥ 3**

**శ్లో ॥ పఠిత్వా ధారయిత్వా చ త్రైలోక్యం మోహయేత్ క్షణాత్ ।**
**నారాయణోఽపి యద్ధృత్వా నారీభూత్వా మహేశ్వరమ్ ॥ 4**

**శ్లో ॥ యోగినం క్షోభమనయద్ధృత్వా చ రఘూత్తమః ।**
**వరతృప్తో జఘానైవ రావణాది నిశాచరాన్ ॥ 5**

**ప్రతిపదార్థం :** ప్రాణవల్లభే! = ప్రాణేశ్వరి! భైరవి! = ఓ భైరవీ!, రహస్యమ్ = రహస్యమును, వక్ష్యామి = చెప్పుచున్నాను, శృణు = వినుము; శ్రీజగన్మంగలమ్ = శ్రీజగన్మంగలము, నామ = పేరుగల, మన్త్రవిగ్రహమ్ = మంత్రరూపమైన, కవచమ్ = కవచమును,

పఠిత్వా = చదివి, ధారయిత్వా చ = ధరించియు, క్షణాత్ =నిముసములో, త్రైలోక్యమ్ = మూడు లోకములను, మోహయేత్ = మోహింపజేయును; యత్ = దేనిని, ధృత్వా = ధరించి, నారీ భూత్వా = స్త్రీయై, నారాయణః అపి = విష్ణువుగూడ, మహేశ్వరమ్ = శివుని, యోగినమ్ = యోగియైనవానిని, క్షోభమ్ = చంచలత్వమును, అనయత్ = పొందించెను; యత్ ధృత్వా = దేనిని ధరించి, రఘూత్తమః = రఘురాముడు, వరతృప్తః = వరమునొంది, రావణ = రావణుడు, ఆది = మొదలగు, నిశాచరన్ = రాక్షసులను, జఘాన = చంపెను.

**తాత్పర్యం :** ప్రాణేశ్వరీ, భైరవీ! రహస్యం, విను. శ్రీజగన్మంగళం అను పేరుగల మంత్రరూపకవచాన్ని చదివి, ధరించి, ఒక్క నిమిషంలో ముల్లోకాలను మోహంలో ముంచవచ్చు. దీనిని ధరించి నారాయణుడు స్త్రీ మూర్తిగా మోహినియై శివుని యంతటి యోగిని చంచలబుద్ధిగా చేసిననాడు; శ్రీరాముడు దీని మహిమచేతనే వరప్రసాదియై రావణునితో గూడ రాక్షసులను సంహరించినాడు. *

**శ్లో ॥ యస్య ప్రసాదాదీశోఽహం త్రైలోక్యవిజయీ విభుః ।**
**ధనాధిపః కుబేరోఽపి సురేశోఽభూచ్ఛచీపతిః ॥ 6**

**శ్లో ॥ ఏవం సకలా దేవాః సర్వసిద్ధీశ్వరాః ప్రియే! ।**
**శ్రీజగన్మఙ్గలస్యాస్య కవచస్య ఋషిశ్శివః ॥ 7**

**ప్రతిపదార్థం :** యస్య = దేనియొక్క, ప్రసాదాత్ = ప్రసన్నతవలన, అహం ఈశః = ఈశ్వరుడనైన నేను, త్రైలోక్యవిజయీ = ముల్లోకముల జయించిన, విభుః = స్వామిని; ధనాధిపః = ధనమున కధిపతియైన, కుబేరః అపి = కుబేరుడున్నూ, శచీపతిః = శచీదేవి భర్త, సురేశః అభూత్ = దేవతల కధిపతియైనాడు, ఏవమ్ = ఇట్లు, సకలాః దేవాః = దేవతలందఱు, సర్వసిద్ధి+ఈశ్వరాః = అన్నిసిద్ధులకు అధికారులయిరి; ప్రియే! = ఓప్రియా! శ్రీజగన్మఙ్గలస్య+అస్య = ఈ జగన్మంగళమను, కవచస్య = కవచమునకు, ఋషిః = ఋషి, శివః = శివుడు.

**తాత్పర్యం :** ఈ కవచం ప్రభావంచేతనే ఈశ్వరుడనైన నేను ముల్లోకాలవిజేతను. కుబేరుడు ధనాధిపతియైనాడు. శచీదేవి మగడు దేవతల రాజైనాడు. ఇట్లు దేవతలందఱు అన్ని సిద్ధులకు అధిపతులైనారు. ఈ జగన్మంగళ కవచమునకు ఋషి శివుడు. *

**శ్లో ॥ ఛన్దోఽనుష్టుప్ దేవతా చ కాలికా దక్షిణేరితా ।**
**జగతాం మోహనే దుష్టవిజయే భుక్తిముక్తిషు।**
**యోషిదాకర్షణే చైవ వినియోగః ప్రకీర్తితః ॥ 8**

**ప్రతిపదార్థం :** ఛన్దః = ఛందస్సు, అనుష్టుప్ = అనుష్టుప్. దేవతా చ = దేవతయును, దక్షిణా+ఈరితా కాలికా = దక్షిణకాలిక; జగతాం మోహనే = జగత్తులను మోహింపజేయుటలో, దుష్టవిజయే = దుష్టులను జయించుటలో, భుక్తిముక్తిషు = భుక్తిని, ముక్తిని సాధించుటలో, యోషిదాకర్షణే చ ఏవ = స్త్రీల నాకర్షించుటలోను, వినియోగః ప్రకీర్తితః = వినియోగము ప్రసిద్ధము.

**తాత్పర్యం :** దీని ఛందస్సు అనుష్టుప్, దేవత దక్షిణ కాళిక, లోకాలను భ్రమంపజేయుట లోను, దుష్టులను జయించుటలోను, భుక్తిముక్తిసాధనముగాను, స్త్రీవశీకరణకు గూడ ప్రసిద్ధంగా దీని వినియోగం. *

**శ్లో॥ శిరో మే కాలికా పాతు క్రీంకారైకాక్షరీ పరా ।**
**క్రీం క్రీం క్రీం మే లలాటం చ కాలికా ఖడ్గధారిణీ ।**
**హూం హూం పాతు నేత్రయుగం హ్రీం హ్రీం పాతు శ్రుతీ మమ॥ 9**

**శ్లో ॥ దక్షిణే కాలికే పాతు ఘ్రాణయుగ్మం మహేశ్వరి! ।**
**క్రీం క్రీం క్రీం రసనాం పాతు హూం హూం పాతు కపోలకమ్ ॥ 10**

**శ్లో॥ వదనం సకలం పాతు హ్రీం హ్రీం స్వాహాస్వరూపిణీ ।**
**ద్వావింశత్యక్షరీ స్కన్ధౌ మహావిద్యా సుఖప్రదా ॥ 11**

**ప్రతిపదార్థం :** కాలికా = కాళికాదేవి, మే = నాయొక్క, శిరః = తలను, పాతు = రక్షించుగాక!, క్రీం క్రీం క్రీం; మే = నాయొక్క, లలాటం చ = నుదురునున్నూ, ఖడ్గధారిణీ కాలికా = ఖడ్గమును ధరించిన కాళిక (పాతు = రక్షించు గాక ! ) ; హూం హూం, నేత్రయుగమ్ = కన్గవను, పాతు = రక్షించుగాక!; హ్రీం హ్రీం, మమ = నాయొక్క, శ్రు తీ = రెండు చెవులను, పాతు = రక్షించుగాక! ఘ్రాణయుగ్మమ్ = ముక్కుపుటలను, మహేశ్వరీ దక్షిణే కాలికే = మహేశ్వరియగు దక్షిణకాళిక, పాతు = రక్షించుగాక! ; క్రీం క్రీం క్రీం, రసనామ్ = నాలుకను, పాతు = రక్షించుగాక! హూం హూం, కపోలకమ్ = చెక్కిలిని, పాతు = రక్షించుగాక!, స్వాహాస్వరూపిణీ = స్వాహా రూపముగల, హ్రీం హ్రీం బీజశక్తి, సంకలం వదనమ్ = ముఖము నంతయు, పాతు = రక్షించుగాక!, సుఖప్రదా = సుఖమును ప్రసాదించు, ద్వావింశత్యక్షరీ = 22 అక్షరములుగల, మహావిద్యా = మహావిద్య, స్కన్ధౌ = భుజములను, పాతు.

**తాత్పర్యం :** 'క్రీం' అను ఒకే బీజాక్షరమాత్రాధిదేవతయైన శక్తి కాళిక నా తలను, ఖడ్గధారిణి నాలలాటమును, హూం బీజశక్తి నేత్రములను, హ్రీం బీజశక్తి నా చెవులను, మహేశ్వరియైన దక్షిణకాళిక నా ముక్కు పుటలను, క్రీం శక్తి నా నాలుకను, హూం శక్తి నా చెక్కిలిని, స్వాహారూప హ్రీం శక్తి ముఖమంతటిని కాపాడుగాక! ఇరువది రెండక్షరముల మహావిద్య నా భుజములను కాపాడుగాక! *

## ద్వావింశత్యక్షరీమహావిద్యా

**క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం దక్షిణేకాలికే క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం స్వాహా ।**

**శ్లో ॥ ఖడ్గముణ్డధరా కాలీ సర్వాఙ్గమభితోఽవతు ।**
**క్రీం హూం హ్రీం త్ర్యక్షరీ పాతు చాముణ్డా హృదయమ్మమ॥ 12**

**ప్రతిపదార్థం :** ఖడ్గ = కత్తిని, ముణ్డ = తలను, ధరా = రెండు చేతులలో ధరించిన, కాలీ = కాళి, సర్వాఙ్గమ్ = అన్ని అంగములను, అభితః = అన్ని దిక్కులనుండి పూర్తిగా, అవతు = రక్షించుగాక!, క్రీం హూం హ్రీం త్రి + అక్షరీ = క్రీం హూం హ్రీం అను మూడు బీజాక్షరములు గల మంత్రాధిదేవత, చాముణ్డా = చాముండి, మమ హృదయం = నాహృదయమును, పాతు = రక్షించుగాక!

**తాత్పర్యం :** ఒక చేత కత్తిని, ఒక చేత తలను ధరించిన కాళి అన్ని అవయవములను అన్ని దిక్కులనుండి పూర్తిగా కాపాడుగాక! **'క్రీం హూం హ్రీం'** అను మూడు బీజాక్షరములు గల మంత్రాధిదేవతయగు **చాముండేశ్వరి** నా హృదయస్థానమును రక్షించుగాక! ✻

**శ్లో॥ ఐం హూం ఓం ఐం స్తనద్వన్ద్వం హ్రీం ఫట్ స్వాహా కకుత్స్థలమ్।**
**అష్టాక్షరీ మహావిద్యా భుజౌ పాతు సకర్తృకా ॥ 13**

**ప్రతిపదార్థం :** ఐం హూం ఓం ఐమ్ = ఈ బీజముల శక్తి, స్తనద్వన్ద్వం = రెండు చనులను, హ్రీం ఫట్ స్వాహా = ఈ మంత్రార్థము, కకుత్స్థలమ్ = మూపురభాగమును, అష్టాక్షరి = ఎనిమ దక్షరముల గల, మహా విద్యా = మహామంత్రాధిదేవత, సకర్తృకా = సకర్తృక, భుజౌ = భుజములను, పాతు = రక్షించుగాక!

**తాత్పర్యం :** ఎనిమిదక్షరములుగల మంత్రాధి దేవత సకర్తృక. ఆ మంత్రమున పూర్వార్ధ భాగశక్తి స్తనములను, ఉత్తరార్ధభాగ శక్తి మూపురమును, అష్టాక్షరీమంత్ర శక్తి భుజములను రక్షించుగాక! **'ఐం హూం ఓం ఐం హ్రీం ఫట్ స్వాహా'** ✻

**శ్లో ॥ క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం కారీ పాతు షడక్షరీ మమ।**
**క్రీం నాభి మధ్యదేశం చ దక్షిణే కాలికేఽవతు ॥ 14**

**శ్లో ॥ క్రీం స్వాహా పాతు పృష్ఠం చ కాలికా సా దశాక్షరీ ।**
**క్రీం మే గుహ్యం సదా పాతు కాలికాయై నమస్తతః ॥ 15**

**ప్రతిపదార్థం :** క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం కారీ = క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం అను బీజాక్షరము గల, షడక్షరీ = ఆరు అక్షరముల మంత్రాధి దేవత, దక్షిణే కాలికే = దక్షిణ కాళిక, మమ = నాయొక్క, నాభిమధ్యదేశమ్ = బొడ్డు

మధ్యభాగమును, పాతు = రక్షించుగాక! క్రీం స్వాహా = క్రీం స్వాహాతో ముగియు దశాక్షరీ = పది అక్షరములుగల మంత్రాధిదేవత, సా కాలికా = ఆ కాళిక, పృష్ఠం చ = పిఱుదుల భాగమునున్నూ, పాతు = రక్షించుగాక! క్రీం, మే = నా యొక్క, గుహ్యమ్ = రహస్యప్రదేశమును, సదా = ఎల్లప్పుడు. పాతు = రక్షించుగాక !, తతః = అందువలన, కాలికాయై నమః = కాళికకు నమస్కారము.

**తాత్పర్యం :** షడక్షరీ మంత్రాధి దేవతయైన **'దక్షిణే కాళికే'** నా నాభిమధ్య ప్రదేశమును, దశాక్షరీ మంత్రాధి దేవతయైన కాళిక నా పిఱుదుల భాగమును, రహస్యభాగమును రక్షించుగాక! అందువలన కాళికకు నమస్సులు.

1) **'క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం'** – షడక్షరీ

2) **'క్రీం దక్షిణే కాలికే క్రీం స్వాహా'** – దశాక్షరీ

*

**శ్లో ॥ సప్తాక్షరీ మహావిద్యా సర్వతన్త్రేషు గోపితా ।**
**హ్రీం హ్రీం దక్షిణే కాలికే హూం హూం పాతు కటిద్వయమ్ ॥ 16**

**ప్రతిపదార్థం :** సర్వతన్త్రేషు = అన్నితంత్రములలో, గోపితా = రహస్యముగనుంచబడిన, సప్తాక్షరీ మహావిద్యా = ఏడక్షరముల మహామంత్రము, హ్రీం హ్రీం దక్షిణే కాలికే హూం హూం, అనునది, కటిద్వయమ్ = పిఱుదులను, పాతు = రక్షించుగాక!

**తాత్పర్యం :** అన్ని తంత్రములలో నిక్షిప్తమైయున్నది సప్తాక్షరీ మహామంత్రము, **హ్రీం హ్రీం కాలికే హూం హూం** అనునది ఆ మంత్రాధిదేవత దక్షిణ కాళిక నాపిఱుదులను కాపాడు గాక!

**శ్లో ॥ కాలీ దశాక్షరీ విద్యా స్వాహా మామూరుయుగ్మకమ్ ।**
**ఓం క్రీం క్రీం మే స్వాహా పాతు కాలికా జననీ సదా॥ 17**

**ప్రతిపదార్థం :** దశాక్షరీ విద్యా = పదియక్షరముల మంత్రాధిదేవత, కాళి, స్వాహా = స్వాహారూపిణి, మామ్ = నన్ను, మే = నాయొక్క, ఊరుయుగ్మకమ్ = తొడలతోగూడ, జననీ కాలికా = కాళీమాత, సదా పాతు = ఎల్లపుడు రక్షించుగాక !

**తాత్పర్యం :** దశాక్షరీ మంత్రాధిదేవతయైన కాళీమాత నా ఊరువులను, నన్ను సదా కాపాడుగాక!

*

**శ్లో॥ కాలీహృన్నామవిద్యేయం చతుర్వర్గఫలప్రదా।**
**క్రీం క్రీం క్రీం పాతు సా గుల్ఫం దక్షిణే కాలికేఽవతు॥ 18**

**ప్రతిపదార్థం :** ఇయమ్ = ఈ, కాలీహృత్ నామ = కాళీహృదయము అను పేరుగల, విద్యా = మంత్రము, చతుర్వర్గఫలప్రదా = నాలుగు విధముల ఫలము నిచ్చునది,

క్రీం క్రీం క్రీం పాతు = రక్షించుగాక!, సా దక్షిణే కాలికే = ఆ దక్షిణకాళిక, గుల్ఫం = చీలమండలను, అవతు= రక్షించుగాక!

**తాత్పర్యం :** కాళీహృదయ మనుపేరుగల ఈ మంత్రము పురుషార్థమల నాల్గింటిని ఇచ్చునది, రక్షించునది. ఆ దక్షిణకాళి నా చీలమండలను రక్షించుగాక! *

**శ్లో ॥ క్రీం హూం హ్రీం స్వాహా పదం పాతు చతుర్దశాక్షరీ మమ।**
**ఖడ్గముణ్డధరా కాలీ వరదాభయధారిణీ॥ 19**

**ప్రతిపదార్థం :** క్రీం హూం హ్రీం స్వాహా, చతుర్దశాక్షరీ = పదునాలుగక్షరములు గల మంత్రాధి దేవత, ఖడ్గముణ్డధరా = ఖడ్గమును, తలను చేత ధరించిన, వరద + అభయధారిణీ = వరదముద్రను, అభయముద్రనూ ధరించిన, కాలీ = కాళి, మమ = నా యొక్క, పదం = పాదమును, పాతు = రక్షించుగాక!

**తాత్పర్యం :** చతుర్దశాక్షరీమంత్రాధిదేవత, ఖడ్గమును తలను రెండు చేతులలోను, వరదముద్రను అభయముద్రను రెండు చేతులలోను ధరించిన చతుర్భుజయైన కాళి నా పాదములను రక్షించుగాక! **'క్రీం హూం హ్రీం దక్షిణే కాలికే క్రీం హూం హ్రీం స్వాహా'** *

**శ్లో ॥ విద్యాభిః సకలాభిః సా సర్వాఙ్గమభితోఽవతు ।**
**కాలీ కపాలినీ కుల్లా కురుకుల్లా విరోధినీ ॥ 20**

**ప్రతిపదార్థం :** కాలీ = కాళి, కపాలినీ = కపాలమాలాధరి, కుల్లా = కుల్లా, కురుకుల్లా = కురుకుల్లా, విరోధినీ = విరోధిని, సకలాభిః విద్యాభిః = అన్ని విద్యల శక్తులతోను, సా = ఆమె, సర్వాఙ్గమ్ = అన్ని అంగములను, అభితః = అన్ని దిక్కులనుండి, అవతు = కాపాడుగాక!

**తాత్పర్యం :** కాళి, కపాలిని, కుల్ల, కురుకుల్ల, విరోధిని అను మంత్రాధి దేవతలు గల అన్ని మంత్రశక్తులతో గూడిన ఆ ఆదిశక్తి నా అంగములన్నింటిని అన్ని దిక్కుల నుండియు కాపాడుగాక! *

**శ్లో ॥ విప్రచిత్తా తథోగ్రోగ్రప్రభా దీప్తా ఘనత్విషా ।**
**నీలా ఘనా బలాకా చ మాత్రా ముద్రా మితా చ మామ్॥ 21**

**శ్లో ॥ ఏతాః సర్వాః ఖడ్గధరా ముణ్డమాలావిభూషణాః ।**
**రక్షన్తు దిగ్విదిక్షు మాం బ్రాహ్మీ నారాయణీ తథా॥ 22**

**శ్లో ॥ మాహేశ్వరీ చ చాముణ్డా కౌమారీ చాపరాజితా ।**
**వారాహీ నారసింహీ చ సర్వాశ్చామితభూషణాః ॥ 23**

**శ్లో ॥ రక్షన్తు స్వాయుధైర్దిక్షు విదిక్షు మాం యథా తథా ।**
**ఇతి తే కథితం దివ్యం కవచం పరమాద్భుతమ్ ॥ 24**

**ప్రతిపదార్థం :** విప్రచిత్తా = విప్రచిత్త, తథా = అట్లే, ఉగ్రా+ఉగ్రప్రభా = ఉగ్ర, ఉగ్రప్రభ, దీప్తా = దీప్త, ఘనత్విషా = ఘనత్విష, నీలా = నీల, ఘనా = ఘన, బలాకా = బలాక, చ = మరియు, మాత్రా = మాత్ర, ముద్రా = ముద్ర, చ = మరియు, మితా = మితా, మామ్ = నన్ను, ఏతాః సర్వాః = వీరందరు, ఖడ్గధరాః = ఖడ్గమాల ధరించినవారు, ముణ్డమాలావిభూషణాః = తలలమాలలు అలంకారముగ గలవారు, దిక్ = దిక్కులందు, విదిక్షు = మూలలందు, బ్రాహ్మీ =బ్రాహ్మి, నారాయణి = నారాయణి, తథా = అట్లే, మాహేశ్వరీ చ = మాహేశ్వరియును, చాముణ్డా = చాముండా, కౌమారీ చ = కౌమారియు, అపరాజితా = అపరాజిత, వారాహీ = వారాహి, నారసింహీ చ = నారసింహియు, సర్వాః చ = అందఱును, అమితభూషణాః = అమితమైన అలంకారములు గలవారు, మామ్ = నన్ను, స్వాయుధైః = తమ ఆయుధములతో, దిక్షు విదిక్షు = దిక్కులందు, మూలలందు, రక్షన్తు = రక్షింతురుగాక ! ఇతి = ఇట్లని, దివ్యం పరమాద్భుతం కవచమ్ = దివ్యము, మిక్కిలి అద్భుతమైన కవచము, తే = నీ కొరకు, కథితమ్ = చెప్పబడినది.

**తాత్పర్యం :** విప్రచిత్త. ఉగ్ర, ఉగ్రప్రభ, దీప్త, ఘనత్విష, నీల, ఘన, బలాక, మాత్ర, ముద్ర, మిత, అను ఈ శక్తి రూపలందఱును ఖడ్గములు ధరించి, ముండమాలలు అలంకరించికొని నాలుగు దిక్కులందు, నాలుగు మూలలందు ఉండి, నారాయణి, మాహేశ్వరి, చాముండ, కౌమారి, అపరాజిత, వారాహి, నారసింహీ, అమితాలంకారులై, సాయుధులై దిక్కులన్నిట, మూలలన్నిట నిలిచి, నన్ను రక్షింతురుగాక! ఈ కవచము దివ్యము, పరమాద్భుతము, నీకొరకు చెప్పబడినది. *

# ఫలశ్రుతిః

**శ్లో ॥ శ్రీ జగన్మఙ్గలం నామ మహావిద్యౌఘవిగ్రహమ్।**
**త్రైలోక్యాకర్షణం బ్రహ్మన్ కవచం మన్ముఖోదితమ్ ॥ 1**

**శ్లో॥ గురుపూజా విధాయాథ విధివత్ప్రపఠేత్తతః ।**
**కవచం త్రిసకృద్వాఽపి యావజ్జీవం చ వా పునః ॥ 2**

**శ్లో ॥ ఏతచ్ఛతార్ధమావృత్య త్రైలోక్యవిజయీ భవేత్ ।**
**త్రైలోక్యం క్షోభయత్యేవ కవచస్య ప్రసాదతః ॥ 3**

**ప్రతిపదార్థం :** శ్రీజగన్మంగలమ్ = శ్రీజగన్మంగళము అని, నామ = ప్రసిద్ధమైన, మహావిద్యా + ఓఘ విగ్రహమ్ = మహామంత్రం సమస్తము యొక్క రూపము గల

దానిని, త్రైలోక్య + ఆకర్షణమ్ = ముల్లోకములను వశీకరించునదియైన, కవచమ్ = కవచము, మత్+ముఖ+ఉదితమ్ = నాయొక్క ముఖమునుండి వెలువడినది, గురుపూజా = గురుపూజను, విధాయ = చేసి, అథ = అటుపై, విధివత్ = శాస్త్రోక్తపద్ధతిలో, త్రిసకృత్ వా అపి = మూడు సంధ్యలలో గూడ, యావత్ జీవం, చ = జీవించి యున్న వరకున్ను, వా పునః = మరియు నొక ప్రత్యామ్నాయముగ, ఏతత్ = ఈ మంత్రమును, శతార్ధమ్ = ఏబదిసార్లు, ఆవృత్య = ఒక ఆవృత్తిగా చేసి, కవచమ్ = కవచమును, పఠేత్ = చదివిన, తతః = అందువలన, త్రైలోక్యవిజయీ భవేత్ = ముల్లోకముల జయించినవాడగును; కవచస్య = కవచము యొక్క, ప్రసాదతః = అనుగ్రహమువలన, త్రైలోక్యమ్ = మూడు లోకములను, క్షోభయతి+ ఏవ = కల్లోలపెట్టును.

**తాత్పర్యం :** శ్రీజగన్మంగల మను పేర ప్రసిద్ధమైన మహామంత్రస్వరూపిణియై ముల్లోకముల వశీకరించు కవచము నా ముఖతః వెలువడినది. శాస్త్రోక్తముగ త్రిసంధ్యలలోను జీవితకాలం ఏబదిసార్లొక ఆవృత్తిగ జేసి గురుపూజానంతరము ఈ కవచమును పఠించినచో, ఈ కవచపు అనుగ్రహమువలన ముల్లోకములను కల్లోలమొనర్చి విజయుడు కాగలడు. *

**శ్లో ॥ మహాకవిర్భవేన్మాసం సర్వసిద్ధీశ్వరో భవేత్ ।**
**పుష్పాఞ్జలిం కాలికాయై మూలేనైవార్పయేత్సకృత్ ॥ 4**

**శ్లో ॥ శతవర్షసహస్రాణాం పూజాయాః ఫలమాప్నుయాత్ ।**
**భూర్జే విలిఖితం చైతత్ స్వర్ణస్థం ధారయేద్యది ॥ 5**

**శ్లో ॥ విశాఖాయాం దక్షబాహౌ కణ్ఠే వా ధారయేద్యది ।**
**త్రైలోక్యం మోహయేత్క్రోధాత్ త్రైలోక్యం చూర్ణయేత్ క్షణాత్ ॥ 6**

**ప్రతిపదార్థం :** మాసమ్ = నెలరోజులు కవచపఠనంచేత, మహాకవిః భవేత్ = మహాకవియగును, కాలికాయై = కాళికాదేవికి, మూలేన+ఏవ = మూలమంత్రము తోడనే, పుష్పాంజలిమ్ = పుష్పాంజలిని, అర్పయేత్ యది = అర్పించినట్లయిన, సకృత్ = ఒక్కసారి, శతవర్షసహస్రాణామ్ = నూరువేల, పూజాయాః = పూజయొక్క, ఫలం ఆప్నుయాత్ = ఫలమును పొందును; భూర్జే = భూర్జ పత్రముపై, విలిఖితం చ ఏతత్ = వ్రాయబడినదైన దీనిని, స్వర్ణస్థమ్ = బంగారమున పొదిగి, ధారయేత్ యది = ధరించినట్లయిన, విశాఖాయామ్ = విశాఖానక్షత్రమున, కణ్ఠే = మెడలో, వా = లేక, దక్షబాహౌ = కుడి భుజమున, ధారయేత్ యది = ధరించినట్లయిన, త్రైలోక్యమ్ = ముల్లోకములను, మోహయేత్ = భ్రమింపజేయును, క్రోధాత్ = కోపమున, త్రైలోక్యమ్ = ముల్లోకములను, క్షణాత్ = క్షణములో, చూర్ణయేత్ = పొడిచేయగలడు.

**తాత్పర్యం :** మాసము దినములు కవచపఠనం చేసిన వాడు మహాకవి యగును. మూలమంత్రంతో కాళికాదేవికి పుష్పాంజలిని సమర్పించినచో సర్వసిద్ధులను పొందును. భూర్జపత్రంపై వ్రాసి బంగారపు తాయతులో నుంచి కంఠమున గాని లేక కుడి భుజమునగాని విశాఖా నక్షత్రమున్నపుడు ధరించినచో లక్షసంవత్సరముల పూజాఫలమును పొందును. మూడు లోకాలను మోహింపజేయును. కోపగించినచో, ముల్లోకములను నుగ్గు చేయగలడు. *

**శ్లో ॥ పుత్త్రవాన్ ధనవాన్ శ్రీమాన్ నానావిద్యానిధిర్భవేత్ ।**
**బ్రహ్మాస్త్రాదీని శస్త్రాణి తద్గాత్రస్పర్శనా త్తతః ॥ 7**

**శ్లో ॥ నాశమాయాతి యా నారీ వన్ధ్యా వా మృతపుత్త్రిణీ ।**
**బహ్వపత్యా జీవతోకా భవత్యేవ న సంశయః ॥ 8**

**ప్రతిపదార్థం :** పుత్త్రవాన్ = పుత్త్రులుగలవాడు, ధనవాన్ = ధనవంతుడు, శ్రీమాన్ = శ్రీమంతుడు, నానావిద్యానిధిః = అనేకవిద్యలలో పండితుడు, భవేత్ = అగును, శస్త్రాణి = ఆయుధములు, బ్రహ్మ+అస్త్ర+ఆదీని = బ్రహ్మాస్త్రము మొదలగునవి, తత్ = వానియొక్క, గాత్రస్పర్శనాత్ = శరీరమును తాకుటవలన, తతః = అక్కడనే, నాశమ్ = నాశనమును, ఆయాతి = పొందుచున్నవి. యా నారీ = ఏస్త్రీ, వన్ధ్యా = గొడ్రాలు, వా = లేక, మృత = మరణించిన, పుత్త్రిణీ = పుత్త్రులు గలదియో, (సా = ఆమె), బహు + అపత్యా = ఎక్కువ మంది బిడ్డలు గల, జీవత్ + ఓకా = ఇల్లాలు (ప్రాణముగల ఇల్లు), భవతి + ఏవ = కానే యగును, న సంశయః = అనుమానము లేదు.

**తాత్పర్యం :** పై శ్లోకములలో నుదహరింపబడిన సాధకుడు కొడుకులు గలవాడుగ, ధనవంతుడుగ, శ్రీమంతుడుగ, ఎన్నో విద్యలు నేర్చిన పండితుడుగ అగును. శస్త్రములు వానిని తాకి నంతనే నిర్వీర్యములై నశించును. గొడ్రాలుగాని లేక గతపుత్రిణి గాని ఆమె పిల్లల కోడియై జీవించియున్న ఇల్లుగ మారును. నిశ్చయము.

శ్రీమాన్ శబ్దమున కిక్కడ గౌరవము పొందువాడన్న అర్థ మన్వయించును. అట్లే విద్యానిధి యనుటలో విద్యాశబ్దము శాస్త్రములు, కళలు అను అర్థముతో బాటు మంత్రవిద్యలను గూడ సూచించును.

**అస్త్రము** మంత్రశక్తితో అసాధారణ బలమును పొందిన సాధారణ శస్త్రము. **శస్త్రము** సాధారణ శక్తిగల ఆయుధము. *

**శ్లో ॥ న దేయం పరశిష్యేభ్యో హ్యభవతేభ్యో విశేషతః ।**
**శిష్యేభ్యో భక్తియుక్తేభ్యో హ్యన్యథా మృత్యుమాప్నుయాత్ ॥ 9**

**శ్లో ॥ స్పర్ధాముద్ధయ కమలా వాగ్దేవీ మన్దిరే సుఖే ।**
**పౌత్రాన్తం స్థైర్యమాస్థాయ నివసత్యేవ నిశ్చితమ్ ॥ 10**

**ప్రతిపదార్థం :** పరశిష్యేభ్యః = ఇతరుల శిష్యులకు, అభవతేభ్యః విశేషతః = విశేషించి విశ్వసించని వారికి, న దేయమ్ = ఈ కవచమీయదగదు; భక్తియుక్తేభ్యః = భక్తిగలిగిన, శిష్యేభ్యః హి = శిష్యులకు మాత్రమే (ఇవ్వదగును) , అన్యథా = ఇట్లుకాకున్నచో, మృత్యుం ఆప్నుయాత్ = మరణించును, స్పర్ధామ్ = పోటీని, ఉద్ + హయ = విడిచిపెట్టి, కమలా = లక్ష్మీదేవి, వాగ్దేవీ మన్దిరే = సరస్వతి ఇంటిలో, సుఖే = సుఖమున, పౌత్రాన్తం = పుత్రపౌత్రవృద్ధిగా, స్థైర్యం = దిట్టతనమును, ఆస్థాయ = పొంది, నిశ్చితమ్ = నిశ్చయముగా, నివసతి + ఏవ = నివసించును.

**తాత్పర్యం :** ఇతరుల శిష్యులకున్నూ, భక్తిలేని వారికిన్నీ ఈ కవచమును ఉపదేశింపరాదు. తన శిష్యులకు, భక్తిగలవారికి మాత్రమే ఇవ్వదగును. ఈ నియమము తప్పి ప్రవర్తించినచో మరణము కలుగును. తమ మధ్య గల స్పర్ధను విడిచి లక్ష్మీదేవి సరస్వతి యింట ధైర్యముగ పుత్రపౌత్రాది తరముల పర్యంతము నివసించుట నిశ్చయము. *

**శ్లో ॥ ఇదం కవచమజ్ఞాత్వా యో భజేత్ ఘోరదక్షిణామ్ ।**
**శతలక్షం ప్రజప్త్వాపి తస్య విద్యా న సిద్ధ్యతి ।**
**సహస్రఘాతమాప్నోతి సోఽచిరాన్మృత్యుమాప్నుయాత్ ॥ 11**

**ప్రతిపదార్థం :** ఇదం కవచమ్ = ఈ కవచమును, అజ్ఞాత్వా = తెలియక, యః = ఎవడు, ఘోరదక్షిణామ్ = ఘోరదక్షిణ కాళిని, భజేత్ = ఉపాసించునో, తస్య = వానికి, శతలక్షమ్ = ఒకకోటి, ప్రజప్త్వా అపి = మంత్రజపము చేసినను, విద్యా = మంత్రము, న సిద్ధ్యతి = సిద్ధించదు; సహస్రఘాతమ్ = వెయ్యి విఘ్నములు, నష్టములు, ఎదురు దెబ్బలు, ఆప్నోతి = పొందును ; సః = ఆ సాధకుడు, అచిరాత్ = కొద్దికాలములోనే, మృత్యుమ్ = మరణమును, ఆప్నుయాత్ = పొందును.

**తాత్పర్యం :** ఈ కవచము నెఱుగక ఘోరదక్షిణ కాళిని ఉపాసించిన సాధకుడు కోటి జపం చేసిననూ మంత్రము ఫలించదు; కాగా, వెయ్యి ఆటంకములు నష్టములు కలుగును. ఆతడు కొలది కాలములోనే మరణించును.

**ఇతి కాలీకవచం సంపూర్ణమ్ ॥**

**శ్రీః**

# Mahavidyas




One source tells that Kali is anjana (black, collyrium); Tara is Nila (dark blue); Matangi is asita (black) or shyamanga; Sodasi and Bhuvanesvari are of the color of rising sun (balarkakanti); Bhairavi is the color of a thousand rising suns; Chinnamasta is the color of a million suns; Dhumavati is of ashen color (Vivarna); Bagalamuki is of yellow color (Pitavarna); Kamala is of the color of lightning (Saudaminisannibha); ShyamAngI is of dark green color; If you think all races are represented in Mahavidyas, you are right. Kali is primarily black, the Eve of all Eves.

**Central Triangle occupied by TPS**
**Configuration, Placement of Devis (deities) and Worship mode in Krishna and Shukla Paksa.**




Krishna-Shukla Paksa MAHAVI7.gif

**TPS = Tripurasundari**

1.Maha Tripura Sundari, 2.Kamesvari, 3.Bhagamalini, 4.Nityaklinna, 5.Bherunda, 6.Vanhivasini, 7.Maha Vajresvari, 8.Shivadooti (Roudri), 9.Twarita, 10.Kulasundari, 11.Nitya, 12.Neelapataka, 13.Vijaya, 14.Sarvamangala, 15.Jwalamalini and 16.Chidroopa (Chitra).

Krishna Paksa: Worship Anticlockwise from KAmesvari to Chitra (1 to 15).
Shukla paksa: Worship clockwise from Chitra to KAmesvari (15 to 1)

Prepared by Veeraswamy Krishnaraj
www.bhagavadgitausa.com